# పరమయోగివిలాసము

తాళ్లపాక తిరువేంగళనాథ ప్రణీతము.



శ్రీ పిఠాపురసంస్థానాధీశు లగు,

శ్రీ శ్రీ శ్రీ మహారాజా

రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు

బహద్దరు వారిచేఁ

ప్రకటింపఁబడినది.



మొదటికూర్పు, 500.



కాకినాడ:

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1928

 [వెల రు 2-8-0

# పీఠిక.

శ్రీ పిఠాపురసంస్థానాధీశులగు శ్రీ శ్రీ శ్రీ మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావుబహాద్దరువారు ప్రాచీనాంధ్రగ్రంథ సంపాదనమునకై నన్ను నియమించినకాలమున (1917 సం॥రః) మైసూరులోని మహారాజకళాశాలాంధ్రోపాధ్యాయులగు బ్ర॥ శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు నాకిచ్చిన గ్రంథములలో "పరమయోగివిలాసము" కూడఁ జేరియుండెను. ఆప్రతి కొంతశిథిలమైయుండెను. మదరాసులోని గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరీలోఁ గుండ మఱియొకప్రతి యుండఁగా రెండింటికి శ్రీమహారాజావారు ప్రతులను వ్రాయించి బ్ర॥ శ్రీ శతావధాని ఓలేటి వేంకటరామశాస్త్రిగారిచేఁ బాఠమును సరిచేయించి ముద్రింపించి జీర్ణోద్ధరణము గావించి యాంధ్రలోకమునకు మహోపకృతిం గావించిరి. ఈగ్రంథము ముద్రితమైనపిమ్మట "రెడ్డిరాణిపత్రిక" యొక్క సంపుటము 5 సంచిక 6 లో శ్రీ శేషాద్రిరమణకవులు హైదరాబాదులోని "రెడ్డిబోర్డింగులోను, ఆంధ్రపరిశోధకశాఖలోను" రెండు తాళపత్రప్రతు లుండినటులు వ్రాసియున్నారు. కాని సమయమునుమించుటచే నాప్రతులతో నీగ్రంథమును సవరించుటకు వీలుకలుగ లేదు.

## గ్రంథకర్త.

ఈ గ్రంథమును రచించినయాతఁడు "తాళ్ళపాక తిరువేంగళనాథుఁడు." "అష్టమహిషీకల్యాణము" అను మఱియు

కగ్రంథమునుగూడ నీతఁడు రచించెను. రెండును ద్విపదకావ్యములే. ఈతనికిఁ "జిన్నన్న" యను మాఱుపేరు కలదందురు. శ్రీ రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రియందు "తాళ్ళపాక చిన్నన్న" యనునాతఁడు "అష్టమహిషీకల్యాణము" వ్రాసెననియుఁ దమకా గ్రంథము లభింపలేదనియు "తాళ్ళపాక తిరువేంగళనాథుఁడు" పరమయోగివిలాసము వ్రాసెననియు వేర్వేఱుకవులనుగా గ్రహించిరి. దీనికిఁగారణ మప్పటి కష్టమహిషీకల్యాణము వారికి లభింపకపోవుటచేతనే యయియున్నది. అష్టమహిషీకల్యాణ మిపు డాంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునం గలదు. దానింజదివినచోఁ జిన్నన్న వేఱు తిరువేంగళనాథుఁడు వేఱుకాక రెండుగ్రంథములను రచించినవాఁ డొక్కరుఁడె యని మనకుఁ దెలియనగును. అష్టమహిషీకల్యాణగ్రంథమునందు నీతనిచరితము విపులముగాను, పరమయోగివిలాసమునం గ్లుప్తముగాను జెప్పఁబడెను. ఈతనితాత "అన్నయ్య" తండ్రి తిరుమలయ్య. (ఇతనికిఁ బెదతిరుమలయ్య యను నామాంతరము గలదు) అన్నలు 1 పినతిమ్మయ్య, 2 అన్నయాచారి, 3 తిరువేంగళయ్య. తమ్ముఁడు కోనేటి వేంకటనాథుఁడు. పినతండ్రి నరసింహుఁడు. (ఈతనికి నరసింగన్నయని పేరు కూడ కలదు.) పినతండ్రికి మారుఁడు 1 నారాయణుఁడు, 2 అన్నయ్య, 3 అప్పలార్యుఁడు వీరందఱు

సంగీతసాహిత్యవిద్యలయందుఁ బండితులఁట. ఆశ్వలాయన
సూత్రము, భారద్వాజసగోత్రము, నందవరీకశాఖ యని చె
ప్పియున్నాఁడు. తాతయగు నన్నయ్య పదకవిత్వవిశారదుఁ
డఁట. ఆతని పదకవిత్వలక్షణములఁ బినతిమ్మయ్య "సంకీర్త
లక్షణము" లను చిన్నపుస్తకముగా రచించెను. అది యాంధ్ర
సాహిత్యపరిషత్పత్రికలో ముద్రింపఁబడెను. తండ్రియగు
పెదతిరుమలయ్య 1 ఆంధ్రవేదాంతము, 2 ద్విపదహరివంశము,
3 చక్రవాళమంజరి, 4 రేఫరకారనిర్ణయము ననుగ్రంథము
లను రచించెను. 3, 4 గ్రంథములు పైపరిషత్పత్రికలో నే
ప్రకటింపఁబడినవి. (పెదతిరుమలయ్య రచించిన యాంధ్ర
భగవద్గీతావ్యాఖ్యాన మొకటి గాన్పించుచున్నది, అదియే
యాంధ్రవేదాంతమై యుండును.) హరివంశము మృగ్యము.
తిరుమలయ్య "మండెము" కోటలోనుండువాఁడఁట. మండె
ముకోట కర్ణాటాంధ్రదేశమధ్యస్థమై యొక్కయెడ నుండి
నటులఁ జరిత్రలవలనఁ దెలియవచ్చుచున్నది. పితామహుఁ
డయిన యన్నయ్య కృష్ణదేవరాయునికాలమునం దుండి కొ
న్ని యగ్రహారములను సంపాదించె నని శ్రీ వీరేశలింగము
పంతులుగారు వ్రాసియున్నారు కాని యందుల కాధారము
చూపలేదు. తిరుపతిలోని యొకశాసనము ననుసరించి
యన్నయ్య శ్రీనాథునినాఁటివాఁడై యుండెనని బ్ర॥ శ్రీ వే
టూరి ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథములో వ్రాసి

యున్నారు. అందువలన నన్నయ్య కై శ్రీస్తవశకము యొక్క పదునేనవశతాబ్దమధ్యమునం దుండినవానినిగాఁ దలఁపవలసి యున్నది. ఈతిరువేంగళనాథుఁడు పరమయోగివిలాసము యొక్క యాశ్వాసాంతములందు,

ద్వి. అనుపమ శ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ

యనియు, అష్టమహిషీకల్యాణము యొక్క పీఠికలో

............కావ్యంబుఁ జెప్పి
మొనలేని శ్రీవేంకటేశు మెప్పించి
......మకరకుండలము లిమ్మహిఁ గొన్నవాఁడ

అనియు, నాశ్వాసాంతముల యందు

ద్వి. అనుపమ శ్రీవేంకటాధీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ

యనియుం జెప్పియున్నాఁడు. ఈతఁడు కావ్యము చెప్పి మెప్పించిన వేంకటాద్రి లేక వేంకటాధీశుఁ డెవఁడు? వీరేశలింగముపంతులుగారు పై వేంకటాద్రి వసుచరిత్రకృతిభర్త యగు తిరుమలదేవరాయుని సోదరుఁడును బ్రసిద్ధినొందిన "తాలికోట" యుద్ధములో విజయనగరసైన్యములకు సర్వసైన్యాధిపత్యము వహించి రణనిహతుఁడైన వేంకటాద్రి యని తలఁచి చంద్రగిరిలో రాజ్యము చేసిన తిరుమలదేవరాయుని చతుర్థపుత్రుఁడగు వేంకటపతిరాయుఁడేమో యని కూడ

సందేహించియున్నారు. మఱికొందఱుకూడ తిరువేంగళనాథుని సత్కరించినయాతఁడు వేంకటపతిరాయఁడే యని తలంచుచున్నారు. కాని వేంకటపతిరాయునికి "వేంకటాద్రి" యను నామము కాన్పింపదు. (1) వసుచరిత్ర, (2) చంద్రభానుచరిత్ర అను నాంధ్రగ్రంథములును, (1) కువలయానందము, (2) శృంగారమంజరీనాటకము, (అముద్రితము) అను సంస్కృతగ్రంథములును తిరుమలదేవరాయపుత్రుని వేంకటపతిరాయఁడే యని చెప్పినవి. కాన వేంకటపతిరాయుని వేంకటాద్రియని చెప్ప వీలులేదు. తిరుమలదేవరాయుని సోదరునికి "వేంకటాద్రి" యను నామమును చరిత్రకారులు వాడియున్నారు. వసుచరిత్రకారుఁడు కూడ నాతనిని "వేంకటాద్రి" యని చెప్పియున్నాఁడు. (చూడుఁడు వసుచరిత్ర 1-51) కాన తిరువేంగళనాథుని సత్కరించినయాతఁడు 1560 సం॥ర ప్రాంతమున నుండుటచేఁ గవియు నప్పటివాఁడే కాని 1600 సం॥ర ప్రాంతపువాఁడు కాఁడు. ఈకాలము తిరువేంగళనాథుని తాత యన్నయ్య, కృష్ణదేవరాయల కాలమున నుండెనను శ్రీ పంతులుగారి యభిప్రాయమునకుఁ గాని యంతకుముందు ముప్పది నలువది వత్సరములకు ముందుండిన శ్రీనాథుని కాలమున నన్నయ్యయుండుననను శ్రీప్రభాకరశాస్త్రి గారి తలఁపునకు గాని యంతవిరుద్ధముగాఁ గాన్పింపదు. మఱియుఁ బెదతిరుమలయ్య మంజెనుకోటలో నుండుట విజయ

నగరసామ్రాజ్య ముచ్ఛిన్నస్థితిలోనుండినప్పుడై యుండును. ఆ తనికుమారుడగు మనకవికూడ విజయనగరప్రాంతముననె యుండియుండును. వేంకటపతిరాయలు చంద్రగిరి వేలూరు ప్రాంతములలో నధికారమును వహించెనే కాని మరెను ప్రాంతము నేలలేదు. కాన సర్వవిధములం గవి 1560 సం॥ర ప్రాంతపువానినిగాఁ దలపోయవలసియున్నది. విజయనగర రాజ్యవిచ్ఛిత్తిననుసరించి తద్రాజవంశజులతోఁ బాటికవివంశజులును "చంద్రగిరి" ప్రాంతములకుఁ జేరి తమకులదైవతమగు తిరుపతివేంకటేశుని సేవింపఁ దిరుపతిలో స్థిరపడి తమ పెద్దలు రచించిన యమూల్యములగు గ్రంథజాలమును రాగి రేకులపై వ్రాసి శ్రీవేంకటేశ్వరాలయమున కర్పించిరి. అవి నేఁటికిని గలవు. వానికిఁ బ్రతులను తిరుపతిమహంతు గారు వ్రాయింపఁబోవుచున్నారను నూతనవార్త వినవచ్చుచున్నది.

## గ్రంథవిశేషములు.

ఈ గ్రంథము వైష్ణవభక్తాగ్రేసరులగు "పన్నిద్దరాళ్వారుల" చరిత్రమైయున్నది. "తిమ్మభూపాలుఁ" డను మఱి యొకకవి పైయాళ్వారులచరిత్రమునె పరమయోగివిలాస మనుపేరనె పద్యకావ్యముగా రచించెను. ఇద్దఱు నించుమించొకకాలపువారె. వీరిరువురకవిత్వములలో నెవరికవిత్వము శ్రేష్ఠమైన దనుటలో నభిప్రాయభేదము కలుగుగాని

కవులనందఱు నేదియోయొకవిధముగా హేళనముఁ జేయువాఁడను ప్రథ గల తెనాలిరామలింగకవియె యీతనిఁ బొగడె నను నీపద్య మొకటి లోకములో వ్యాపించియున్నది.

క. చిన్నన్న ద్విపద కెరఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెరఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్.

పదలాలిత్యము, అర్థగాంభీర్యము, శబ్దాలంకారాదివిశేషములు నీతనికవిత్వమునఁ బ్రకాశించును. ఈతనిద్విపద రచనాచమత్కృతి పిమ్మటనుండిన ద్విపదకవులకు మార్గదర్శకమైనది. కవిత్వవిశేషము లీగ్రంథపాఠకులకే విశదమగునని విడచి, కవి తననుగూర్చి చెప్పుకొనినవిశేషముల "నష్టమహిషీకల్యాణము"నుండి దిఙ్మాత్రముగ వ్రాయుచున్నాఁడను.

ద్వి........ ...కావ్యంబుఁ జెప్పి
మొనలేని శ్రీవెంకటేశు మెప్పించి
సకలంబు నెఱుఁగ నసాధారణాంక
మకరకుండలము లిమ్మహిఁ గొన్నవాఁడ
దినములోననె వేయి ద్విపద లింపొంద
వినుతవర్ణనలతో విరచించువాఁడ
గవిశిరఃకంపయోగ్యప్రతిద్విపద
నవబిరుదాంకుండ...... ............

కొంకక తమనోటికొలదులఁ బలుకు
మంకుఁబోతులకు గ్రామ్యంబుసామ్యంబు
ఆరీతి నుడువక యలఘుశబ్దార్థ
సారసరీతి రసప్రభావముగఁ
గులికి కస్తూరివీణెఁ గోసినకరణిఁ
వెలికప్పురపుఁగోవిఁ వెఱచినసరణి
విరవాదిపొట్లంబు విడిచినమాడ్కిఁ
బరిమళించుచుఁ గవ్వల్ బళిబళి యనఁగఁ
గవితచెప్పినసులక్షణుని గవీంద్రుఁ
డవునందు రేనెచ్చినట్లు చెప్పెదను"

ఈతఁడు చెప్పుకొనినది యతిశయోక్తిగాక స్వభావోక్తియే యని గ్రంథపాఠకులకు విశదము కాఁగలదు. ఇట్టి యుద్గ్రంథమును ముద్రింపించి లోకోపకృతి గావించిన శ్రీశ్రీశ్రీ మహారాజావారికిఁ బరమేశ్వరుఁడు పుత్రపౌత్రాభివృద్ధియు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియు నొసఁగుఁగాక.

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.



శ్రీ

# పరమయోగివిలాసము

## ప్రథమాశ్వాసము.

### అవతారిక

ద్విపద.

శ్రీయలమేల్మంగఁ జిరకృపాపాంగఁ
దోయజదళనేత్రిఁ దోయధిపుత్త్రి
శ్రీవేంకటేశసంశ్రితకుచదేశ
దేవేంద్రవినత నాదిమవచోవినుత
గజరాజమిళిత నంగజరాజకలిత
విజితాళికులవేణి వికచాబ్జపాణి
జలజలీలాగేహ సౌవర్ణదేహ
జలజాతభవమాత జగదేకమాత
శ్రీవేంకటాధీశుఁ జిరకృపావేశు
దేవాధిదేవు సందీప్తప్రభావుఁ
దలఁచి భూనీళలఁ దడవి యాచక్ర
జలజకౌమోదకీశార్ఙ్గఖడ్గములఁ

దిర మొందుభక్తి నుతించి యనంత
గరుడవిష్వక్సేనకరుణయుం బడసి
శ్రీకరవైష్ణవసిద్ధాంతవిభవ
పాకశాసనుఁ దాళ్ళపాకశాసనుని
యాచారవిజితామరాచార్యుఁ దిరుమ
లాచార్యు ఘను మదీయాచార్యుఁ దలఁచి
పరమార్యు వాధూలపతి నప్పగారి
గురుతరు లగు *మహాగురువరేణ్యులను
రామాంఘ్రికమలాభిరామతాత్పర్యు
రామానుజాకారు రామానుజార్యు
నమలునిం బరమదయాకరమూర్తి
నమితవిద్యాపూర్ణుఁ డగుమహాపూర్ణు
మందారహారణు నిర్మలపాదపద్మ
వందారు మాయాళువందారుఁ బొగడి
యామోదభరకీర్తితాబ్జనేత్రాభి
రామమిశ్రాఖ్యుని రామమిశ్రాఖ్యు
మండితనిజచిత్తమందిరనిహిత
పుండరీకాక్షునిఁ బుండరీకాక్షు
†నమలాత్మ మునినాథు నానాథహానిఁ
గుమతభంజననిరంకుశుఁ బరాంకుశుని

*సర్వ †నమలుని ముని

ప్పన్నుతద్రావిడాగమసార్వభౌము
లైన మాఱారల నాళువారులను
నిఖిలముక్తౌఘంబు నిత్యవర్గంబు
నఖిలభాగవతుల నాత్మం దలంచి
హారితాత యచు వేంకటాచలపూర్ణు
హరిపూజనాడంబి యగు గుర్వనంబి
నిరవాంద శ్రీవేంకటేశ్వరుచేతఁ
గరమొప్ప శంఖుచక్రము లందినట్టి
చిరకీర్తి వైష్ణవసేవానువర్తి
స్మరమూర్తి నలతొండమాన్ చక్రవర్తి
సతతవేదామృతశరధి దాశరథి
నతికృపాపరు భట్టరాచార్యవర్యు
సిరివరు నిజశిష్యుఁ జేసికొన్నట్టి
హరిభక్తిపరు ననంతాళువారులను
శఠమతధ్వాంతసంహారి యైన
శఠకోపమునిఁ బోలుశఠకోపహాని
వేదంబుఁ దెనుఁగుఁ గావించి సంసార
ఖేదంబు మాన్పినకృష్ణమాచార్యు
ఘనతరపంచమాగమసార్వభౌము
ననఘు శ్రీతాళ్ళపాకన్నమాచార్యుఁ

దలఁచి యంజలిఁ జేసి తత్ప్రసాదంబు
కలిమిని బాచమాగమసార్వభౌమ
హరిసేవ కాశ్వలాయనసూత్రనంద
వరవంశభవ భరద్వాజసగోత్ర
పావన శ్రీతాళ్ళపాకన్నయార్య
ధీవిశారదసూనుఁ దిరుమలాచార్య
వినుతనందన తిరువేంగళనాథుఁ
డనుపేరి యేను కావ్యం బొందు సేయఁ
దలపోయుచున్నయత్తఱిఁ గరుణించి
కలలోన వైష్ణవాకారంబుఁ దాల్చి
యేతెంచి శ్రీవేంకటేశుండు తనదు
చేతఁ దా నారగించినప్రసాదంబుఁ
గృపచేసి పరమయోగివిలాస మనఁగ
నిపుడు కాసారయోగీంద్రాదికథలు
జానుగా సిరికిని సపరివారుండ
నైనట్టి తనకు నీ వంకితంబుగను
బనుపడ ద్రావిడప్రబంధంబు చూచి
తెనుఁగున రచియింపు ద్విపదరూపమున
నన విని మేల్కాంచి యలమేలుమంగ
ననుపమశ్రీవేంకటాధీశుఁ దలఁచి

తలఁపు తన్మూర్తులం దగులంగఁ జేసి
యలయంజనాద్రీశు నాత్మలోన నిలిపి
యరుదందు శ్రీవేంకటాద్రీశువాక్య
సరణి నాకబ్బంబు సవరింపఁ బూని
కడలి దాఁటంగ రాఘవభూ*వరుండు
కడఁకమై సేతువుఁ గట్టించునప్పు
డనిలజముఖు లైన యగచరనాథు
లనుపమశక్తి మహాపర్వతములఁ
గట్టకట్టంగఁ దాఁ గట్టనుంకించు
నొట్టిన లోకూర్మి యుడుతచందమున
భువనంబులోన నభోమణి యొప్పు
దివిఁ గీటమణియును దెలివొందుకరణి
సామజబృందంబు చనుదెంచుత్రోవఁ
జీమలపంక్తి వచ్చిన†విధంబునను
వేదంబులెల్ల ద్రావిడముగాఁ జేసి
వేదాంతవిదులుఁ గోవిదులు నైనట్టి
గురుతరు లగుపరాంకుశముఖ్యయోగి
వరుల వైభవముఁ గావ్యము సేసినట్టి
యలఘుపూర్వాచార్యు లగువారియెదుట
నిల నితరుఁడు కావ్య మెట్లుచెప్పెడిని

*విభుండు †చందమునను

గావునఁ దత్పాదకమలసేవకుఁడఁ
గావున వారిమార్గమున నే నేను
జలజాతవాసినిచనుబాల ముట్టి
పలికెద నానేర్చుపరిపాటి నిప్పు
డలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికిఁ
గనకచేలునకు శృంగారలోలునకు
వినమితేశునకు శ్రీవేంకటేశునకు
నంకితంబుగను గావ్యంబుఁ గావింతు
నింకఁ దత్ప్రారంభ మెయ్యది యనిన
మోదించి నారదముని చెప్పినట్టి
యాదవశైలమాహాత్మ్యంబునందు
గారవంబునఁ "గలౌఖలుభవిష్యంతి
నారాయణ పరాయణా" యని పలుకు
కలిహారం బైనభాగవతంబునందుఁ
గలిగి పూర్వాచార్యకథిత మై వెలసి
మఱియును వృద్ధపాద్మంబునఁ బద్మ
తెఱఁగొప్ప సూతి శ్రీపతికిఁ జెప్పినదియుఁ
గావునఁ దత్కథాక్రమ మొప్ప నేను
గావింతుఁ గృతి దాని క్రమ మెట్టి దనిన

## కథారంభము.

చలనొప్పఁ జిదచిదీశ్వరయుక్తమగుచు
నలచతుర్దశభువనాత్మకం బైన
కమలజాండంబును గడచి యామీఁదఁ
గమలతేజోవాయుగగనభూతాది
తతమహదవ్యక్తతత్త్వరూపముల
నతిశయం బొందుసప్తావరణముల
డాసిన ప్రకృతిమండలమున కవల
భాసిల్లుచుం బరాత్పరవాస మగుచుఁ
గుటిలతార్కికఘూకకుల*కర్కనేత్రి
పటలంబునకుఁ జండభానుమండలము
చతురాననేశవాసవముఖ్యులకును
మతి నెన్నఁగా నవాఙ్మనసగోచరము
ననయంబు వ్యావృతపునరావృత్తిపదము
వినతాదితేయంబు వేదవేద్యంబు
నంబుజోదరముకుందాహ్వయాకార
ణంబు విద్యానిధానంబు సేవ్యంబు
నగుచుఁ బరవ్యోమ మని సంతతంబు
నిగమముల్ పొగడ నెన్నిక కెక్కి తనరి

* తర్క

యానందపాదత్రయాన్వితం బగుచు
నానందకాయుధు నావాస మగుచు
లుంఠితసంసారలోలశోకంబు
కుంఠితాఘంబు వైకుంఠంబు నాఁగఁ
గర నొప్పుభువన మాగమసన్నుతంబు
నిరతిశయానందనిలయ మైయుండు
నరము నరణ్యంబు ననుపేరి యమృత
శరధు లింపొందు నచ్చటఁ గవగూడి
యతుల మై దివ్య మై యటఁ గర్మయుగళ
యుతుల కయోధ్య నా నొప్పు నయోధ్య
యనుపేరు గలిగి శ్రీహరిరాజధాని
ఘనతరస్ఫూర్తిఁ బ్రకాశించు మఱియు
వరమణిమయమహావరణసహస్ర
పరివృతం బగుచు నపార మైయుండు
కడు నశ్వరంపులోకంబుల రోయు
వడువునఁ బవమానవలితాంచలముల
దీపించు వైజయంతీవితానంబు
లాపురంబున గోపురాగ్రంబులందు
నవరత్నమయసౌధనవ్యతేజంబు
లవిరళరేఖ లై యందంద పొడువ

నరయంగ నిందిరాలోకాతీత మయ్యు
హరిధనుశ్శ్రీ నొప్పు నమ్మహాపురము
లలి తేందిరానీలజాలకదీప్తిజాల
ములు నభోగతి నొక్కమొత్తమై నిగుడఁ
గాళింది యాకాశగామిని యైన
పోలిక నొప్పు నప్పురవరంబునను
రాజితగృహపద్మరాగరాగముల
రాజిల్లు వరహీరరథ్యాచయంబు
ఘనశేషభోగసంఘంబుల నెప్పు
డనుకరింపుచు నుండు నతివైభవముల
సతతంబు నిందిరాప్రజాపతు లనఁగ
నతుల తేజోమూర్తు లగు నిత్యవరులు
నాపురీవరగోపురాగ్రభాగముల
నేపారఁగా వసియించియుండుదురు
కులిశధారకు వడంకుచు లావు వెడలి
పలుకంటకములఁ జొప్పడువారిఁ గూడి
భూలోకమున నుండు భూధరతతులఁ
గేలి సేయుచు నుండుఁ గేళిశైలములు
తపనదోషాకరదర్శనం బాత్మ
నెపుడుఁ గోరుచు నొక్కయెడలను గుందు

ప్రాకృతపద్మకైరవసమూహంబు
లేకాలమును దమ కెనయే యటంచు
నగుచు సదా ప్రసన్నత మించి మించు
లగునట్టి పద్మకల్హారంబు లెసఁగు
నాసారపుష్పనీరాపూర్ణ దివ్య
కాసారశతములఁ గలిగి పెంపొందు
నచ్చట విలసిల్లు నారామతతులు
నిచ్చలు సౌరభానీకము ల్గలిగి
తరులతారూపముల్ తాల్చిననిత్యు
లరుదార ముక్తులై యరుదెంచువారి
నెలకొన్న తమవైన నీడలచేత
ఫలములచేతఁ బుష్పంబులచేత
నుపచరింపుచు నుండు నుచితవైఖరుల
నెపుడు న త్తరువుల నెక్కి చూపట్టు
శుకపికాదులు శౌరిసుందు ప్రాప్యందు
ప్రకటంబుగా నని పల్కుచు నుండు
నందులోఁ గొన్ని యుద్యానశైలాదు
లిందిరాసతి నటియించులీలలకె
ప్రతి లేక *యెప్పుడుఁ బాల్పడియుండుఁ
బతి†లీలకే పాలుపడియుండుఁ గొన్ని

*యెపుడుఁ బాల్పడియుండు లోక †లీలలకె

యరయంగ మఱికొన్ని యాసతీపతుల
పరమలీలలకుఁ బాల్పడియుండు నెపుడు
దివ్యసౌందర్యులు దివ్యవిగ్రహులు
నవ్యయు లగుపౌరు లచట నుండుదురు
అలదివ్యనగరమార్గాంతరసీమ
నలఘువైభవముల కాలయం బగుచు
నయ్యబ్జనాభుని యనుకంప కెపుడు
నెయ్యమై సౌరభానీకంబుతోడ
లీయమై పద్మమేలిమిచూపు వోలెఁ
దీయమై యైరమ్మదీయమో నాఁగఁ
దళుకొత్తు సరసి సంతతవికాసములఁ
జెలువొందు కనకరాజీవబృందములఁ
దులగించు నపరంజితొగలమానికపుఁ
గలువల తేనియల్ గముచి సొంపెక్కి
షట్పదంబులు వింతసరణు లేర్పడఁగ
షట్పదఝంకృతుల్ సలుప నెంతయును
నలనొప్పు నలసరోవరము చెంగటను
గొలఁది మీఱిన బిల్వకుంభినీజంబు
అవిరళశాఖాత్రియంబుతో సోమ
సవనంబు నా హేమచలదళం బమరు

## పరమయోగివిలాసము.

*తిరుచ్ఛాయఁ దా ననువొంద నిలిచి
తెంచుముక్తుల కెదు రేగి వారిఁ
గొమరార భూషించుకొంటకు భూషాంజ
నములు †జలములుఁ జూర్ణములు మాలికలు
వేర్వేఱఁ బూని సవిస్మయాకృతులఁ
బర్విన యచ్చరపడఁతు లేనూఱు
లనిశంబు నచటికి నరుదెంచుముక్తు
లనుకైరవముల నవాంగచంద్రికలఁ
జెలువార వికసింపఁ జేయుచు నచట
మెలఁగుచుందురు సమేలంబుతోడఁ
జల్లనై తద్దివ్యజనపదంబులకు
‡నెల్లయై యమృతవాహిని యై చెలంగి
యావరపురి చెంత నమితసంసార
దావతప్తాత్ముల తాపంబు దీర్చి
పుదుడింపఁగా ద్రవీతభూత యైనట్టి
కరిరాజవరదుని కరుణయ పోలె
భాసిల్లి విరజ నాఁ బరుపడి ప్రకృతి
వాసనాపాంసువుల్ వడి నడంచుచును
నమలయై యెపుడు ముక్తాశ్రిత యగుచు
నమితయై పరమహంసావృత యగుచు

*నాతరువులనీడ †శెలములు రాశెలములు ‡నెల్లనై

నరయ సంజీవని యై దివ్య మగుచు
మురసూదనుని దయామూర్తియుం బోలె
సరసిజాక్షియుఁ గూర్మచరణవర్ణితయు
గురుతరకోకవక్షోజభాసితయు
బిసరుహజాలశోభితయు నై ముక్తి
బిసరుహవాసిని పెంపు చూపుచును
దనలోనఁ గ్రుంకుమాత్రనె చేతనులకుఁ
దనుదేహముల డించి తఱగనిసిరుల
సరవిఁ బంచోపనిషన్మయాకృతులఁ
గర మర్థి నొసఁగు నక్కజము రెట్టింప
నాయేటఁ గ్రుంకినయట్టిశరీరి
యాయతరాహుఘోరాస్యగహ్వరము
వెలువడి చను చెంచువిధుమండలంబు
కలిమి సంసారపంకముతోడఁ బాసి
లీల నాచక్కి నిల్చిన యమానవుని
కేలి కెందమ్మి సోఁకినయంతలోనె
కర మర్థి దివ్యమంగళవిగ్రహములు
ధరియించు నెట్టి†చిత్రమొ కాని మఱియు
వనమాలికాశ్రీనివాసితం బగుచు
వనమాలికాధరువక్షంబ పోలె

---

† విచిత్రమో మఱియు

లాలితదశరథోల్లాసితం బగుచుఁ
బోలింప సాకేతపురమునుం బోలె
ఘనశంఖచక్రప్రకాశితం బగుచు
ననుపమం బగుకలశాబ్ధియుం బోలె
సంతతమానవసంయుతం బగుచు
వింతగు సురరాజువీడునుం బోలె
రాజిల్లు నన్నగరంబు నెన్నడుమ
రాజార్కకోటుల రమణ నవ్వుచును
వైకుంఠ మనుపేర వర్ణన కెక్కి
వైకుంఠనాథుని వాస మింపొందు
నామహానగరమధ్యమున మాణిక్య
హేమతోరణముఖానేకవస్తువులఁ
దనరి యానందసుధాలిప్త మగుచు
నినసహస్రంబుల కెన యైనకాంతి
నగణితమణిమయం బై వేదవిదిత
మగు సహస్రస్తంభ మనుమంటపమున
నిగనిగం దళుకొత్తు నెలకట్టుక్రింద
జిగివిభూతిద్వయచిత్రితం బగుచు
దివ్యపుష్పముల నాస్తీర్ణ మై వివిధ
దివ్యవాసనలును దివ్యరత్నములు

ధర్మాదిసూరిపాదములునుం గలిగి
భర్మకాంతులఁ గనుపట్టుచేలముల
నలువొందు సింహాసనమున సహస్ర
దళపద్మ మొప్పఁ దత్కర్ణికనడుమఁ
గృతశబ్దతంత్రధురీణుఁ డై చంద్ర
శతములఁ గేలించుచాయఁ గైసేసి
పొడ తెంచు రవిసరి బోలు కెంజాయ
లడరెడు పడగలయందలి మణుల
బలువైన తేజంబుపరపుగా మిగులఁ
బొలుపాఱు శేషునిభోగంబునందు
భానుకోటుల మించుప్రభ గల్గి నిర్భ
రానందుఁడును నిత్యుఁ డఖిలశేషియును
గురుతరుండును నిరంకుశమహాదయుఁడు
పరమేశ్వరుఁడు నైన పద్మావిభుండు
నెమ్మితో శ్రీభూమినీళలం గూడి
నెమ్మోముచక్కి వెన్నెలనవ్వు చిలుక
*నెఱసంజ గనుపించు నెఱ్ఱదామరల
యొఱపు నెల్లిదమాడుచున్న పాదములు
పన్నికాళియలసంపద ముట్టుకోలు
గొన్న నిగ్గులసోనఁ గురియు లేఁదొడలు

---

*నెరసంజ గనువిచ్చు

శృంగారజలధి రాజిల్లు మైవాక
శృంగంబు లనఁగ మించినజానుయుగము
యౌవనారామంపుటనఁటులో యనఁగ
శేవసోయగము వాటిల్లు నూరువులు
మొలనూళ్ళమానికములరంగు లెనయు
కలధౌతచేలసంగతకటిస్థలము
నలువ నాఁ జని పదునాల్గులోకములఁ
గలిగించుపాపనిఁ గన్నపొక్కిలియుఁ
గడుపులోపలి త్రిజగములకు నెల్ల
నడర నేర్పఱిచెనో యన నొప్పువళులు
జలరాశికన్యకాసౌధాగ్రరత్న
కలశమో యనఁగ నగ్గలపునిగ్గులును
నలవడి సకలజీవాత్మకం బగుచుఁ
దులగింపుచున్న కౌస్తుభదివ్యమణియు
నలరఁ బ్రధానతత్త్వాత్మకం బనఁగఁ
జెలఁగు శ్రీవత్సంబుచే నొప్పునురము
సతతంబుఁ దనయుగస్థలిఁ బాయకుండు
నతివ లీలాడోల యన *నొప్పు మిగిలి
పొగడొందుచును మహాభూతస్వరూప
యగువైజయంతిఁ బాయనిభుజాంతరము

*సొంపు

ఘనతరలావణ్యకలశాంబురాశిఁ
గనుపట్టు నవతరంగము లన నొప్పు
శారద నారదచ్ఛాయలఁ దెగడు
తారహారంబులఁ దనరుపేరురము
తొలఁగక వేగ నార్తులయార్తిఁ దీర్ప
వలసినయెడల నవ్వాలియాయుధములు
కేలిమై నంది †సోఁకించుచో మిగుల
నాలస్య మనియెన్ని యనిశ మేమఱక
తగ నహంకృతి కధిదైవ మై చంద్రు
పగిదిఁ జూపట్టెడిపాంచజన్యాబు
రూపింపఁగా మనోరూప మై యశముఁ
బ్రాపించు నలసుదర్శనము నింపెసఁగ
బలసి కీర్తిప్రతాపము లిరుమేలఁ
జెలఁగించుకరణిఁ దాల్చినబాహుయుగము
పాఁపకంకటి నూఁదిపట్టి చూపట్టు
డాపలి కేలు బిటారంబు నెఱప
జానువుపైఁ బాఱఁజాఁచిన కేలు
మానిత కేయూరమాణిక్యరుచిర
కటకము ల్మెఱయ నెక్కడ లేనివింత
నటనలు నెఱచల్లు నాల్గుమూఁపులును

†హెంకించుచో

మంచికస్తూరి యుమ్మలి దొప్పఁదోఁగి
యంచితం బైన కంఠాంబుజాతంబు
చెలువంపుసిరి కొల్ల సేయుచునుండు
నలరుసామ్రాజ్యసింహాసనం బనఁగ
నవ్యాజకోమలహాసంబు మోవి
నవ్య మై పరఁగ నెంతయు నొప్పుమోము
మొనసిన నయనసముద్రమర్యాద
కొనర సేతువు నాఁగ నొప్పునాసికయు
మలఁగువీనులతోడ మలయుచు మిగుల
ధళ ధళ మనువెలిదమ్మికన్నులును
బొలుపాఱు విరళకపోలపాలికలఁ
గులుకు నిగ్గుల నకరకుండలంబులును
లాలితశార్ఙ్గవిలాసభావములఁ
బోలి మార్పడియున్న భ్రూలతాయుగము
నానతశశిరేఖ నాసియించునొసలు
నానీలకుటిలదీర్ఘాలకంబులును
జగ†దధిరాజ్యసూచకము నై ‡తపను
ధగధగల్ దెగడు రత్నపుఁగిరీటంబు
నెఱసంజనీరెండ నెనసినమొగులు
తెఱఁగున దీపించు దివ్యతేజంబుఁ

†దభి ‡తనుప

గలిగి సహస్రారకమలపూర్వాది
దళవీథులందుఁ జిత్తరముగా నిలిచి
కమలానిభాకృతుల్ గలిగి యొంతయును
విమలలోచన లైన విమలాదిసతులు
చామరహస్త లై సరవి సేవింప
నామహాకమలమధ్యము పూర్వదిశను
గలికి భాగుల ననుగ్రహ యనుపేరి
చెలువ బంగారుకుంచియ నైచుచుండఁ
దనకుఁ బీఠము చేల తల్పంబు దీప
మును ఛత్రిపాదుకల్ మొదలుగాఁ గలవి
తాన యై దివ్యసౌందర్యవేషంబు
పూని యనంతుఁ డాపొంత సేవింపఁ
బడగయు మిత్రిందు బంటు వీవనయు
నడతెంచు సరద మున్నతవితానంబు
మొదలైనపరికరములు తానె యగుచు
నెదుటఁ బక్షీంద్రుఁ డొక్కఁడుఁ గొల్వు సేయ
వరుస విద్యాధిదేవత యైనవేత్రి
మరుదారఁ బూని సేనాధినాయకుఁడు
వరగుణోజ్జ్వలుఁడు విష్వక్సేనుఁ డెలమిఁ
బరిచరత్వముఁ దాల్చి భజియింపుచుండ

రమణఁ దత్పురనగరద్వారగోపు
రములు సాలములు నారసి కాచుచున్న
యములు లైనట్టి చండాదినిత్యులును
గుముదాదినిత్యులుఁ గుంజరాస్యాది
ఘనులుఁ జెంతల నూడిగంబులు సేయఁ
బనిపూని దానవప్రాణపారణల
నలవడి దివ్యాంగు లగుచుఁ బార్శ్వములఁ
జళుకొత్తు పంచాయుధంబు లుప్పొంగి
జయజయశబ్దముల్ సవరించుకొనుచు
నయమారఁ జెంత సన్నుతులు గావింప
నత్యంతసంతోషితాత్ములై మఱియు
నిత్యులు ముక్తులు నిగమసంతతులు
నెలమిఁ జంకలఁ జేతు లిడి కొల్చుచుండ
నలఘువైభవముల నాపరాత్పరుఁడు
మూఁడుకాలంబులు మునుముట్ట నెఱిఁగి
మూఁడగు నక్షరములయర్థ మగుచు
మూఁడుధామంబుల మొనసి నిల్చుచును
మూఁడుగుణంబుల మును మిడి దాఁటి
మూఁడువర్గంబుల ముదమార నొసఁగి
మూఁడుతాపంబుల ముఱియఁ గొట్టుచును

మూఁడులోకముల కిమ్ముల నేలికగుచు
మూఁడుమూర్తులకును మొదలివాఁ డగుచుఁ
గరుణాకటాక్షవీక్షణసుధాధార
శరణాగతులయెడ చల్లఁజేయుచును
నమితకల్యాణగుణాభిరాముండు
సమఘనరహితుండు సర్వేశ్వరుండు
నిర్వికారుండును నిగమవేద్యుండు
సర్వజ్ఞుఁ డనఘుండు సర్వశేషియును
నైన పాణేశ్వరు *నర్ధాసనం గదిసి
యానసం బెత్తి నెయ్యము తియ్య మొదవ
రాకేందుముఖి యకారణదయామూర్తి
నాకేశనుత జగన్నాథునిదేవి
జగదేకజనయిత్రి సర్వశేషిణియు
నగు నిందిరాదేవి యప్పు డిట్లనియె
సరసిజోదర సర్వజనక యోగీంద్ర
కరుణామయాత్మ యాగమవేద్య నీవ
తెలియంగ సృష్టియు స్థితియు నంత్యమునుఁ
గలిగించి పిమ్మటఁ గలిగింప నోంప
నరయ నీసేవకు లగుపద్మసూతి
హారుల కిద్ధఱకును నధికార మొసఁగి

*సముఁగునం

వగపెల్లఁ దీఱ దేవర సంతతంబు
జగములఁ బోషింపఁజాలి వెండియును
సదయుండవై సర్వజనుల నీడేర
మొదలికర్మబ్రహ్మముల స్వరూపముల
విదితంబు గావించు వేదజాలములు
తదుపబృంహితములై తనరుశాస్త్రములుఁ
గలిగించి దేవరఁ గాంచుమార్గంబుఁ
దెలిపి చూపిన నట్టితెరువునఁ జనక
ప్రకృతివాసన డీలుపడుమ నజ్ఞాన
నికరవారిధుల మునింగి తేలుచును
దనయాజ్ఞ మీఱిన దాసులమీఁదఁ
గనలి భూపతి దండు గదలినపగిదిఁ
దమకించి నీయాజ్ఞ దాఁటి నిచ్చలును
దమయిచ్చఁ దిరుగు నాత్మల విలోకించి
పనిబూని వీరి నేర్పడఁ బ్రోచి తెత్తు
నని రామకృష్ణముఖ్యావతారముల
నవతరించియుఁ గొన్ని యాత్మలఁ గరుణ
నవనంబు సేసి యిట్లరుగుదెంచితివి
నిఖిలజీవుల' నెన్న నీశేషభూతు
లఖిలజీవులకు నీ వయ్యా వట్లయ్యుఁ.

గొందఱు విగతదుఃఖులఁ జేసి మఱియుఁ
గొందఱు విహితదుఃఖులఁ జేయఁ దగునె
జాడతో దేవర సకలజీవాళి
నీడేర్చువిధము నా కెఱిఁగింపుమయ్య
యన విని లేఁతన వ్వానవాబ్జమున
ననలొత్తఁ దనప్రాణనాయికఁ జూచి
యల్లనఁ దనకేల నాపద్మహస్త
పల్లవం బానఁగూర్చి బళి బళీ యనుచుఁ
దలిరుఁబోఁడిరో నీవు తలఁచినగతినె
తలఁపులో నేనును దలఁచుచున్నాఁడ
ననయంబు నీవు న న్నడిగినందులకు
వినుము చెప్పెద నది వివరంబు గాఁగ
సిరి పద్మ! యే నేమి సేయుదు మున్ను
ధరలోన నానావతారముల్ దాల్చి
యున్నట్టి నన్నొకానొకఁ డాత్మలోన
నెన్ని బ్రహ్మంబుఁ గా నెఱిఁగి భజించుఁ
గొందఱు శత్రుగాఁ గోరియుందుదురు
కొందఱు మిత్రుగాఁ గోరియుండుదురు
కొందఱు రాజుగాఁ గోరియుండుదురు
కొందఱు బాలుగాఁ గోరియుండుదురు

అందఱు నాచంద మరయరు వారి
నిందఱ నేరీతి నీడేర్తు నింకఁ
దనుఁగొల్వు మని యాత్మఁ దలఁచి యాత్మలకుఁ
దనువు లింద్రియములుఁ దాన యిచ్చితిని
ఇచ్చిన నవి దాల్చి హీనభావముల
నిచ్చలో నామూర్తి నెఱుఁగంగలేక
యెనయ నిధ్మములఁ దే నిచ్చనకర్త్రిఁ
గొని యాలతోఁకలు గోసినరీతిఁ
దనుఁ గొల్వనిచ్చిన తనువులు దాల్చి
యనయంబు పరవిషయాసక్తు లగుచు
*నాసురప్రకృతు లై యనిశ మనాది
వాసనామూఢు లై వంతలఁ జిక్కి
గొనకొన్న రాట్నపుగుండ్రలకరణిఁ
బనిబూని ఘనకర్మపరతంత్రు లగుచు
నరకంబులందు జన్మంబులయందుఁ
దిరుగుచు నిట్లు వర్తిలెడుజీవులకు
నెలనాఁగ! యే నెట్టు లీడేర్తు నైనఁ
గలదు నుపాయ మొక్కటి విను మింకఁ
దలపోసి వారి కంతర్యామి నగుచుఁ
దెలిసిశ్రీరంగాదిదివ్యదేశముల

*నసురప్రకృతులయి

నర్చావతారంబు లంగీకరించి
యర్చనాసుముఖుండ నగుచు నుండెదను
జేనంటి యింటఁ బెంచినయిట్టిఁ జూపి
కానలో నిట్టులం గైకొన్నకరణి
నరయ సజాతీయు లగువారిచేతఁ
జిరజీవతతుల వశీకరించెదను
గావున ధరలోనఁ గమలాయతాక్షి !
నీవు విశ్వంభర నీళావధూటి
ధర చక్రిశార్ఙ్గనందక గదా నాగ
వరమైన తేజువిష్వక్సేనముఖులు
శ్రీవత్సకౌస్తుభాంచితనిత్యనరులుఁ
గోవిదు లగుచండకుముదాదిఘనులుఁ
దక్కనిత్యులును భూస్థలిఁ బ్రవేశించి
పెక్కువర్ణంబులఁ బెంపొందఁ బొడమి
పెక్కుదేశముల సంప్రీతి వర్తిలుచుఁ
బెక్కుభాషలు నేర్చి పెక్కుకబ్బములు
సర్వాధికారముల్ సకలవేదాంత
నిర్వాహకంబులు నిగమరూపములు
నతులసద్గుణవర్ణనాలంకృతములు
నతులముల్ ద్రావిడభాషానురూపములు

గేయముల్ నిత్యసంకీర్తనాత్మకము
లాయతరసపోషణానుభావ్యములు
నగుచు నొప్పఁగఁ జేసి యలవానిచేత
జగతిపై దుష్టదర్శనపరాయణుల
ననయంబు బాహ్యారాద్ధాంతతమిస్ర
మునఁ జెంది మోహితాత్ములు నైనవారి
నరయంగ సంసార మనుకాననలోనఁ
దిరిగెడు కరులపొందిక నున్నవారిఁ
గట్టుకంబంబులఁ గడియంగఁ జేర్చి
కట్టు నేనుంగులకరణి మీరలును
బదరక భక్తిప్రపత్తిమార్గములఁ
బదవుల నొందించి భవము లడంచి
పరమార్థ మగుపరాత్పరుఁ డని నన్ను
నరయంగఁ జేయుఁడా యని నియోగింప
వనజాతవాసిని వనజాక్షుఁ జూచి
యనియె దేవర మమ్ము నలధరాస్థలిని
బొడమి ద్రావిడవాక్యములఁ బ్రబంధంబు
లొడఁగూర్పు మనుటకు నుచిత మిం కెద్ది
నావుఁ డానందించి నారాయణుండు
శ్రీవనజాక్షి నీక్షించి యిట్లనియెఁ

గలుషసంతతులరాకాసి నాఁ గాశిఁ
గలుగంగఁ జేసిన గంగచెంగటను
హరపార్వతీవివాహముఁ జూడఁ గోరి
సురలు మునీంద్రులచ్చోటికే తేర
నాభారమున నుత్తరాశావకాశ
భూభాగ మెడల నొప్పున గ్రుంగ నపుడు
బొమ్మరవోయి పేల్పులమూఁక వేల్పుఁ
గమ్మరిఁ బిలిచి యక్కజము చూచితివె ?
యురుతరం బగు దీనియొరఁగు దిద్దంగ
వెరవు గల్గిన మాకు వివరింపు మనినఁ
జెప్పిన నామాటఁ జేసెద రేనిఁ
జెప్పెద నని సురశ్రేణి కిట్లనియె
నమితతపోధనుం డగుకుంభతనయుఁ
గ్రిమ్మ మొప్ప వలదిక్కునకడకుఁ బంచినను
సమరీతి నొప్పు రసాచక్ర మనినఁ
దమకించి యాకుంభతనుజన్ముఁ డలిగి
నులివెచ్చనూర్పు కన్నుల కెంపు నెఱయఁ
దలఁపున నెలకొన్న తాల్మి వోవిడిచి
కనలుచు నావిశ్వకర్మ నీక్షించి
యనియె నీవకొర్రిక్తు లాడ నేమిటికిఁ

బని( బూని పార్వతీపరిణయోత్సవము(
గన( గోరి యంతరంగమున నెంతయును
లలిమీఱ( బెక్కుగాలములనుండియును
గలుషాత్మ ! యిచ్చట( గాచియుండంగ(
జెనటివై విఘ్నంబు చేసితో లేదో?
యని కనలుచు( దావకాన్వయులకును
బని యధికంబు నల్పము కూలి యగుచు(
జనుఁగాక యని ఘనశాపంబు నిచ్చె
నిచ్చిన ననయంబు నిచ్చలోఁ బొగిలి
కరిచ్చఱ నావిశ్వకర్మ యి ట్లనియె(
గటకటా ! సకలోపకారంబు గాఁగ
నిట( బిల్చి నను సురలెల్ల( బ్రార్థించి
యడిగినంటుల్ల కుపాయంబు( జెప్పటకు
నుడికి నీ వీగతి నుచితంబు( దప్పి
శపియింప( దగునె యోచపలాత్మ! యనుచు(
గుపితుఁడై యవ్వాని కోపించి పలికె
నీవు తాల్చినయట్టి నిగమసంతతులు
దావిడరూపముల్ తాల్చఁగా కనుచు
శపియింప నిరువురజగడంబు( జూచి
యపుడు వారలకోప మమరులు మాన్చి

పనిబూని కుంభసంభవుఁ బెక్కుగతుల
వినుతించి దక్షిణోర్వికిఁ బాపుటయును
జని ఖిన్నుఁడై కలశజమహానితిలకుఁ
డనుపమంబగుమలయాద్రిమీఁదటను
హానువారి మునిఁగి వెయ్యేన్నూఱుదివ్య
సమములు నను గూర్చి సవరించెఁ దపము
నత్యంతసంతోష మడర నే నపుడు
పరితృప్తుఁడనై వేఁడు ఫల మిత్తు ననిన
వినతుఁడై మునియు వేవేలచందముల
వినుతించి తనపూర్వవృత్తంబుఁ దెలిపి
యావిశ్వకర్మశాపాయత్తమైన
దావిడత్వము వచ్చెఁ దనవేదములకు
నేమి సేయుదు నింక నిందిరానాథ!
యీమనోవిగ్రహం బెట్లు మాన్పెదవొ?
యనినం బ్రసన్నుండనై దావిడత్వ
మొనరిన శ్రుతులె సర్వోన్నతత్వంబుఁ
గలిగి మదీయభక్తశ్రేణిచేత
వెలయునట్లుగఁ జేసి వివరింతు నేను
నని వరం బిచ్చితి నదికారణమున
మును మిమ్ము దావిడముఖ్యదేశముల

నవతరించుఁడ యంటి నారీతి మీరు
నవతరింపుఁడు వేగ నాదేశములను
అని వారి నియమించి యారమానాథుఁ
డనుపమం బైన శేషాచలంబునను
శ్రీరంగముఖ్యవిశేషదేశముల
ధారుణి నర్చావతారరూపములు
ధరియించి భక్తసంతతులఁ బ్రోచుచును
బరిపూర్ణవిభవసంభరితుఁ డై యుండెఁ
గాంచనరత్నప్రకాశితజాల
కాంచితం బగు తనయందంబుఁ గాంచి
యనిమిషల్ ముక్తిశ్రీయజనేత్రి కాంచి
యన నొప్పుచును గాంచి యనుపేరఁ బరఁగి
గరిమ నే డగుముక్తికరము లైనట్టి
పురములలో నెల్లఁ బొగడొందె యపుడు
వనజకల్హారజీవనవతి కడలి
వనబోఁడు లెంతె మన్నన సేయునవతి
విమలాంబుపూరసంవిజితభోగవతి
కమనీయసురభిసంఘూతభోగవతి
యమలకారండవహంసపూగవతి
సుమితపున్నాగఖర్జూరపూగవతి

వరుణమందిరరాగవతి పక్షిరాజ
వరవేగవతి వేగవతి యనునేఱు
చుట్టును విలసిల్లుచుం దనుఁదానె
పెట్టనికోట యై పెంపొందుచుండ
నుత్తరోత్తరవృద్ధి నొదవించు బ్రహ్మ
యుత్తరవేది నా నొప్పు నప్పురిని
యురుతరవరదోత్సవోద్యన్మృదంగ
బిరుదగంభీరదభేరీరవంబు
విని యకాలమునందు వేడ్కఁ నెమళ్ళు
ఘనవాద మనుచుఁ గేకాధ్వాను లేసేయు
నమిత మై యగ్రహారాధ్వరధూమ
మమలాంబరంబున నమరి చూపట్టఁ
గాదంబినీపంక్తిగాఁ దలపోసి
నాదించి వెండియు నర్తింపుచుండు
బయలేఱు నెల శిరోభాగదేశముల
నయమార భోగిసంతతిమండనమ్ము
లగుచున్న సౌధంబు లలయామ్రినాథుఁ
డగు నాగకంకణు హసియింపుచుండుఁ
గాముబాణము లనంగా వేఱ కలవె
కామించి వీరల కన్నులే కాక

కనకసూనము లనంగా వేఱె కలవె
ననుపారు వీరలనాసలే కాక
ఘనమైనవిరు లనంగా వేఱె కలవె
కొనలు మించిన వీరిగుబ్బలే కాక
కమ్మదామర లనంగా వేఱె కలవె
ముమ్మాటికిని వీరిమోములే కాక
కనకపత్రిక లనంగా వేఱె కలవె
చెనకమించిన వీరిచెక్కులే కాక
కంబుపోతము లనంగా వేఱె కలవె
కంబుకంఠుల మించుగళములే కాక
గగనఖండము లనంగా వేఱె కలవె
నగవుమోముల వీరినడుములే కాక
కదళికాతరు లనంగా వేఱె కలవె
యెదుటుమీఱిన వీరియూరులే కాక
కడఁగుతాఁబే ళ్ళనంగా వేఱె కలవె
కడు మించు వీరిమీఁగాళ్లులే కాక
అనిమిషాదులు గొనియాడంగఁ జక్కఁ
దనమెల్ల జగములోఁ దమసొమ్మె యనఁగఁ
బసిఁడిసలాకలో భావజువింటి
కుసుమాస్త్రములొ యనఁ గొమరు దీపించి

పరమలావణ్యసంపదచేత జనుల
నరు దండఁ జేయు తోయజనిభాననలు
నిఖలశాస్త్రాగమనిధు లైనబుధులు
నఖిలేశచరణసంయతు లైనయతులు
హరికోటిసమతేజు లైనరాజులును
హరహితునకు ఘను లగువైశ్యజనులు
హరిభక్తిమతిభద్రు లైనశూద్రులును
హరినీలమణిచారు లైనతేరులును
ఘనబలవిజితదిక్కరు లైనకరులు
ననుపమజవజితహరు లైనహరులుఁ
గవులును రసికపుంగవులునుం గలిగి
యవిరళశ్రీలచే నను వొంది యుండు
నరయ నన్నగరిమధ్యమున ననంత
సరసిచెంగట హస్తిశైలాంతరమున
బంగారుబోఁడుల పాలిండ్లఁ బోలు
బంగారుకుండలపస మించి మింటి
కాఁపురంబులవారు కని సన్నుతించు
గోపురంబులు వజ్రకురువింద నీల
లలితంబు లైనజాలములజాలములు
మలయజవిద్రుమమణిమంటపముల

ధళధళం బొలుచుకుందనపువాకిళ్ళ
చలప నిచ్చలపుఁబచ్చలతోరణముల
సురనీలవిరచితసోపానతతుల
గురుచంద్రికాంతపుఁగోణిగెచూరులను
జలువనెత్తావులు సారెకు మలయ
మలయమారుతముల మలయుమాళిగలఁ
గళుకుకంబముల బంగారుబోదియలఁ
జలుకలచాలు దీర్చినవలీకముల
నింపొంది మఱియు ననేకచిత్రములఁ
బెంపొంది లోచనప్రీతి రెట్టింప
నంచితం బగు సదనాంతరసీమ
మించిన శేషవల్మీకంబు †చెంత
మదిరి పసిండిచే నొనరించినట్టి
*మదిరె చేతులవయ్యు మాళిగెమీఁద
నోట నొక్కొ-కమాఱు నొడివినం బుణ్య
కోటి నిచ్చుచుఁ బుణ్యకోటి నా వెలయు
బంగారుమేడలోపలభూమిఁ గల్గు
సింగార మొకకుప్ప చేసినరీతిఁ
జెందమ్మిరేకులఁ జెనకుపాదములఁ
జెందిన పసిఁడి గజ్జియలు నందియలు

†చేర్ప *మదిని చేతులవయ్య

చుట్టిన కెలఁకులఁ జంగులువాఱఁ
గట్టిన హేమాంశుకంబు చూపట్ట
నురుతరంబుగ గద యూనుహస్తంబు
వరుస భక్తులఁ బ్రోచు వరదహస్తంబు
పాటి మీఱినయట్టి పద్మభవాండ
కోటికోటుల నించుకొన్న బొజ్జకును
వదలకుండఁగఁ గట్టువైచినరీతి
నుదరబంధం బెంతయును నొప్పుచుండ
జడియని బాహుపాశములచేఁ గట్టు
వడిన సోమార్కబింబములచందమున
నలరక్కసులమిత్తి యగుచుట్టుఁ గత్తి
వలమురియును నెంతె వలనొప్పుచుండ
విన్నుపైఁ గ్రొమ్మించు వెన్నెలసోగ
యున్నకైవడి సిరి యురమునఁ జెలఁగ
నలరమాదేవి సౌభాగ్యంబు రత్న
కలశంబుకైవడి కౌస్తుభం బలరఁ
బంటవలంతి గుబ్బల మీఁద నొత్త
నంటిన మకరరేఖాంకంబు లనఁగఁ
గులుకుముద్దులనక్రకుండలాకృతులు
తళుకొత్తు చెక్కుటద్దములపై నిండి

భాసిల్లఁగా వపాపరిమళోల్లాస
వాసితాధరపల్లవమున లేనగవు
నిగుడంగ సంపంగి నెఱిచూపునాస
తెగ గల తెలిదమ్మిఁ దెగడుకన్నులును
గోపు వంచినవింటికోమ రైనబొమలు
నాపూర్ణసోముని హసియించుమోము
నిటలభాగంబున నెలవంక లైన
కుటిలకుంతలములు కొమరు దీపింప
నిఖిలయావనపద్మినికి గూడి కట్టి
శిఖర మెత్తినయట్లు జీవరత్నముల
రీతిఁ జూపట్టుకిరీటంబుఁ గలిగి
పాతకాభీలజం బాలసూర్యుండు
దేవరాయఁడు రమాదేవితో భక్త
సేవితుం డై తలఁచినవారి కెల్ల
వరము లిచ్చుచు దేవవరమునీశ్వరులు
వరదరా జనుచు భావన సేయ నజుని
హోమగుండంబులో నుదయించి యిష్ట
కామంబు లిచ్చు నెక్కాలంబునందు
రమణ మై యతనియగ్రంబున హేమ
కమలాకరం బొందు గల దందులోన

నపమానపాంచజన్యాంశంబు వచ్చి
పసిఁడినెత్తమ్మిగర్భముఁ బ్రవేశింప
భాసిల్లఁ నానాఁటఁ బ్రబలి చూపట్టెఁ
గాపారలక్ష్మికి గర్భచిహ్నములు
గాటంపుతమ్మిమొగ్గలచన్నుమొనలఁ
దేఁటికప్పిదవెఁ బూఁదీవె నెమ్మేను
పలుకఁబాఱెను గనుపట్టె నాతటము
వలనొప్ప నల్లగల్వలబంతి యారు
తెలిదమ్మి నెమ్మోము తెలతెలఁబాఱె
నొలయులేనురువుచిట్టుములు బిట్టయ్యెఁ
దరఁగలవళులు మందంబులై తనరె
సరసమృత్తికలవాసనలె యింపయ్యె
నలఁగి తిన్నటియుంచనడలు జాగయ్యె
నలమహాచామీకరాబ్జినియందు
హరినాభి నుదయించు నజునిచందమున
హరితార నాశ్వయుజాఖ్యమాసమునఁ
గాంచనపంకజగర్భంబునందుఁ
బాంచజన్యాంశ ముద్భవ మయ్యె నప్పుడు
నాయోగి రవి యుదయంబైనకతనఁ
గాయజాజ్ఞానాంధకారంబు లణఁగె

దివినుండి మొఱసెను దేవదుందుభులు
దివిజకామినులు న ర్తించి రందంద
సురలు వర్షించిరి సూనవర్షములు
సారిదిఁ దక్కినయట్టి శుభసూచకములు
శౌరి దేవకియందు జన్మించునప్పు
డారయ నేరీతి నాకీతి నుండెఁ
గమలాక్షుఁ డపుడు దిగ్గన నేగుదెంచి
కమలవాసిని యైనకమలయుఁ దాను
భ్రమరపంక్తుల సరసంబులతోఁ దూఁగు
రమణీయ మైన సారసపుఁదొట్టెలను
వేదనాదంబుఁ గావించుబాలకుని
మోదంబుతోఁ జూచి మురవైరి గదిసి
చేతఁ గైకొని చెంత సిరిపుత్త్రుఁబోఁడి
చేతికి నిచ్చె నిచ్చిన లోకమాత
తనయుపైఁ గూర్మి నెంతయుఁ బాలు గుబ్బ
చనుదోయి గురియంగ సందిటం గ్రుచ్చి
నయమార నాలింగనము సేసి శిరముఁ
బ్రియమార మూర్కొని పెరిమెఁ జన్నిచ్చి
యెలమి శౌరియుఁ దాను నిల్లు పోషింప
జలజనివాసిని చనుబాల *పుష్టి

*మూష్టి

వనజాస్త్రకోటిలావణ్యంబుతోడఁ
గనుపట్టి యయ్యోగికంఠీరవుండు
సరసిజాలయపదాబ్జములపై శౌరి
చరణాంబుజములపై సాగిలి మ్రొక్కి
నుతియింప నతని సన్నుతులకు మెచ్చి
శతపత్రనేత్రుండు సారసనిలయ
సజ్జీవనత బహుసత్త్వయోగమును
ముజ్జగంబులతాపములఁ దీర్చుగరిమ
యనుపమగాంభీర్య మమృతమూర్తియును
నొనర సరోనామ మొసఁగి యాతనికి
నమిత మై దుష్ట మైనట్టిసంసార
తమములోపలఁ జిక్కి తముఁ గానలేని
జీవుల నెల్ల రక్షించి వేదంబు
త్రోవకుఁ దెమ్ము నేరుపున నోతనయ!
నీయంద తేమును నిలిచెద మనుచు
నాయోగిహృదయంబునందు వసించి
యుండి రంతట సరోయోగి *డెందమున
నిండారువేడ్కతో నిఖిలదేశములఁ
బరయోగిసామ్రాజ్యవైభవం బెసఁగఁ
జరియించుచుండె నిచ్ఛావిహారముల

*హృదయమున

ఘోరనక్రగ్రాహకూర్మాదిలస ద
పారపారావారపారంబునందు
నుల్లోకముల సమమును మించు లేని
మల్లాపురం బను మహనీయపురిని
ముక్తిపోషుండు కౌమోదకీదివ్య
శక్తిమయుం డైన సన్మౌనివరుఁడు
మును వచించినమాసమున వసుతార
ననుపమనీలోత్పలాంతంబునందు
జనియించె నిందిరాసహితుఁ డై శౌరి
చనుదెంచి కడుసంతసమున నీక్షింప
వనరాశితనయ కేల్వల నున్నతనయుఁ
గొనకొన్నప్రేమఁ జేకొని యెదం జేర్చి
పతిచేతి వలమురి పా లిడఁబూని
కుతుకంబుతో సత్త్వగుణ మనుపాలు
హరిభక్తి యనుస్నేహ మందంద *కలిపి
పరిపూర్ణమతి యోగిపతి కడుపునకుఁ
బోసి పోషించె నొప్పుగ దానవారి
యాసమయమున భూతాభిధానంబు
నతనికి నొసఁగి నీ వవనిపై భూత
తతిని సంసృతిసముద్రముఁ దరింపంగఁ

*కలికి

జేసెదు గాన నిచ్చితి మిట్టివాఁడు
మాసురప్రకృతిచే నజ్ఞాను లగుచు
మముఁ గానకున్న యాత్మల నాత్మవిద్య
మము నెఱుంగఁగఁ జేయు మాపుత్త్రుఁ డనుచుఁ
దోడు నీ కైన ముకుందుఁడు పద్మ యతని
తోడనె తిరుగంగఁ దొడఁగి రంతటను
నలమాసమున సముద్రాగారతార
నలఘుమయూరపురాహ్వయపురిని
దళుకొత్తు లతికాప్రహ్లాదం బనుపేరఁ
గలకొలంకున రత్నకైరవాంతమున
శ్రీనందకాయుధు చె న్నగ్గలించి
శ్రీనందకాంశ మై చెలువొందు యోగి
జనియించె నప్పుడా జగదేకమాత
వనజాక్షుఁడును గారవములు దైవాఱఁ
గముఁ బెద్ద యగుకూర్మి కడలి నోలార్చి
నిడుదనెయ్యములోన నిగుడఁ బోషించి
తద్దయు మెచ్చి పెద్దలకెల్ల నీవ
పెద్ద వై జగతి దీపించెదు తనయ!
యనుచు మహాహ్వయం బతనికి నొసఁగి
యనుఁగు నెకొ్నఁగ నయ్యాదిదంపతులు

నకలంక మైనట్టి యయ్యోగిహృదయ
వికచాంబుజంబుఁ బ్రవేశించి రంత
మురవైరి నాబాల్యమున నుండి చిత్త
సరసిజాంతరములఁ జక్కఁగా నిలిపి
పరిపూర్ణచిత్తు లై బ్రహ్మావిన్యస్త
భరు లైన యయ్యోగివరులు ముప్వరును
దముఁ బోలినట్టి యుత్తము లైనయోగి
తము లెవ్వ రని దేవతామందిరముల
నదుల దేశముల నానాతీర్థములను
వెదకుచు నొక్కచో వీసమంతయును
నాసక్తి లేక సాయంగేహు లగుచు
భాసిల్లుచుండిరి పంకజోదరుఁడు
వారల నిజమహత్త్వంబు నెయ్యెడల
వారని తనపరత్వంబు మోకముల
నెగడించి యజ్ఞాననికరమోహంబు
లగలింతు నని యెన్ని యా యోగివరుల
ముగురి నాకస్మికముగ దేవనగరి
నగుచుండు శ్రీవామనక్షేత్రనగరి
నొనఁగూర్చ బయటఁ బురోపకంఠమున
నునికిగా నల్లంత మున్న యత్తటిని

నను పమాం బైన మహానిశి వేళ
వనదోదయము లేనివానఁ గల్పింప
నప్పు డాపెనువాన యశనిపాతముల
చప్పుళ్లతోడ ఝుంఝూమారుతమున
వడగండ్లతో నలవడి వడి మీఱి
సుడిగాల్పు రవళితో జోరని కురియఁ
జిడిముడి మొగ మడఁచినఁ గానరాక
కడుఘోర మగు నంధకారంబు వొడమ
నొకనికిఁ గూర్చుండియుండంగఁ జాలు
నొకచిన్న గేహాళి యుండంగఁ జూచి
యాయోగివరులలో నాదియోగీంద్రుఁ
డాయెడఁ జనుదెంచి యచ్చోట నిలిచె
నంత రెండవయోగి యట కరుదేర
నంతరంబున నున్న యామునీశ్వరుఁడు
చనుదెంచి తేటి కీసంకటస్థలికిఁ
జనుకున కోడి యాసీనుండ నగుచు
నేనుండి లిరువుర మిటమీఁద నిలిచి
యైన నుండుదము ర మ్మని చేరఁబిలిచి
యున్నతి నమ్మౌనియును దాను నచట
నున్నయత్తఱి మహాయోగి యే తేర

నొకనికి శయనించి యుండరా దిచట
నొకరీతి నొదుగుచు నొదుగుచు మేమ
యీలోన నున్నార మిరువుర మిప్పు
డీలోనఁ జనుదెంచి తీవు నిచ్చటికి
నెక్కొన్న వానలో నిలువక రమ్ము
కక్కసం బైన యిక్కడ నీవు మేము
నొండొరులకు మన మొద్దికై సరదు
కొండము రమ్మంచుఁ గూడి మువ్వురును
నుండి రాగేహాళి నురుతరవృష్టి
దండి మై గురియ నత్తఱి నేగుదెంచి
యలయోగిహృదయంబు నరసెద ననుచుఁ
దలపోసి తపసిడెందపుసందడీఁడు
కడుఁ గక్కసమున నక్కడ నున్నవారి
నడుమ సొత్తెంచి లేనవ్వు నవ్వుచును
గణియంబు గోలిఁ బ్రిక్కల నున్న చెలికు
గణికల నొత్తడిఁ గాపుంచుపగిది
నొత్తున మొదలనే యొదిగెడువారి
నొత్తడి సేయ నయ్యోగీంద్రవరులు
మనము మువ్వుర మిందు మసల నెన్నడుమఁ
జనుదెంచి తనరూపుచందంబు డాఁచి

యిటి కెఱిఁ గడుము వీఁ డెవ్వఁడో వీని
తెలుఁగు తెల్లంబుగాఁ దెలియుద మనుచు
నచ్చెరు పడుచుండి రయ్యాదియోగి
నిచ్చలం బగుభక్తి నిలిపి డెందమున
ధరణి పంతియ సముద్రింబులు నేయి
యరుణు దీపముఁ జేసి యరుణాంశుతతుల
గారాబుచక్రంబు నైఁ బూస్చినట్టి
నీరజాక్షున కిచ్చె నీరాజనంబు
నంత రెండవయోగి యతనిపైఁ బ్రేమ
పంతియ మితి లేనిభక్తియే చమురు
నానందభరితహృదబ్జంబె వత్తి
గా నొనరించి వికాస మై యాత్మఁ
దిర మొందుజ్ఞానంబు దీపంబుఁ జేసి
పెరిమె నారాయణార్పితముఁ గావించె
బాధురజ్ఞానదీపప్రకాశమున
నంధకారం బెల్ల నణఁగె నవ్వేళ
ననుపముం డైన మూడవయోగి శౌరి
తనదుముందరను బ్రత్యక్షు మై నిలువ
సిరిఁ గంటిఁ జెన్ను మించినమేను గంటిఁ
గర మొప్పువదనవికాసంబుఁ గంటి

సల్లలితావనీస్తనకుంభశుంభ
పల్లవంబులఁ బోలుపాదము ల్గంటి
సరసిజహలశంఖచక్రాంకుశాంక
చరణముల్ జగదేకశరణముల్ కంటిఁ
దరణిబింబముచాయఁ దరళించుకనక
సురుచిరాంశుకము నంశుకముఁ గన్గొంటి
శ్రీ మించుకటితటశ్రీసతీవరణ
దామముల్ మేఖలాదామము ల్గంటి
వాత్సల్యజలధికైవడి నొప్పుచున్న
వత్సంబుఁ గంటి శ్రీవత్సంబుఁ గంటిఁ
జుట్టుఁ గైదువు వలచుట్టుశంఖంబు
పట్టిచూపట్టినబాహువు ల్గంటి
శాతాంశుమండలశతకోటికోటి
రీతిఁ జూపట్టుకిరీటంబుఁ గంటి
మలఁగులై తెల్లఁదామరలఁ దామరలఁ
గలహించు నిడువాలుఁగన్నులఁ గంటి
మకరకుండలబాలమార్తాండరుచుల
వికసించు వదనారవిందంబుఁ గంటి
నని నుతింపఁగఁ జూచి యయ్యురువురును
వినుతింపఁ దలఁచి రవ్విష్ణు నీక్షించి

యాపూర్ణమతులకు నావేళ విశ్వ
రూపి యప్పుడ విశ్వరూపంబుఁ జూప
నాసర్వమయురూప మవలోకనంబు
చేసి మ్రొక్కుచు మునిశేఖరు ల్మెచ్చియు
నానంద సుతురూప మపుడు సేవించి
యానందపరవశు లగుచు నుప్పొంగి
యంతాదు లనుపేర నలరుప్రబంధ
చింతామణులు ముక్తిఁ జేర్చునిచ్చెనలు
వేదరూపములు గావించిరి మూడు
వేదాంతవేద్యుఁ డావిశ్వమయుండు
నంటున నయ్యోగినాథుల మతులఁ
దొంటిచందమున నస్తోకుఁ డై యుండ
యోగినాథులు దివ్యయోగసామ్రాజ్య
భోగు లై భువిఁ జరింపుచునుండి రనుచు
నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికి
నంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమ తాళ్ళపాకన్నయార్య

తనయ తిమ్మార్యనందనరత్నశుంభ
దనుపమశ్రీవేంకటాద్రిశదత్త
మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధసరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృత మైన పరమయోగివిలాసకృతిని
యతులితంబుగఁ బ్రథమాశ్వాస మయ్యె.

---

# పరమయోగివిలాసము

## ద్వితీయాశ్వాసము.

హైమసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
మునిశాలికాసారముఖ్యభక్తాళి!
వనమాలి! యవధారు వరదానశీలి!

పుడమిఁ గాంచికిఁ దూరుపునఁ బయోరాశి
పడమట సర్వసంపదఁ జెన్నుమీఱు
సకలభూస్థలము నాస్థలమును బ్రహ్మ
యొకమాఁటు తాఁ దూఁచ నునిచి తూఁచుటయు
ధరణీతలం బెల్ల దానితోఁగూడ
సరితూఁగకునికి చూసరసిజాసనుఁడు
జగతిపై నిది మహీసారాభిధాన
మగుఁగాక యని యన్న నది యాది గాఁగ
మహి మహీసార నామమునఁ జెన్నొందు
బహుపుణ్యకైవల్యఫలద మై యెపుడు

వందును సకలలోకారాధ్యుఁ డైన
యిందిరాపతి వసియించి చెన్నొందు
వనధివేష్టితధరావలయపావనము
వనము మౌనీంద్రజీవనము తత్పురము
సరసను శోభిల్లు చైత్రరథంబు
గరిమలు చపచపంగాఁ జేయురమణ
నావనంబున వీక్షితాత్ముఁ డై లోక
పావనుం డైనట్టి భార్గవమౌని
పుడమిపైఁ బోఁక యాపోఁకపై సూది
యిడి దానిపైఁ బాద మిసుమంత యూఁది
యాననం బెత్తి కరాబ్జము లోడ్చి
భానుమండలముఁ దప్పక విలోకించి
పదిలుఁ డై దేవతాభావపూర్వముగ
మదిలోన మంత్ర మేమఱక యెన్నుచును
మదువులలోన హేమంతకాలమున
వడఁ జల్లుతఱిఁ బంచవహ్నిమధ్యమున
నారూఢచిత్తుఁ డై యహరహం బిట్లు
ఘోరతపంబుఁ గైకొని చేయుచుండ
వడి మీఱి తత్తపోవహ్నులకీల
లడరి వాసవలోక మంటె నంటుటయు

విసుమాన మంది యవ్వేళ దేవేంద్రుఁ
డసమానభీతిచే నందంద వడఁకి
పూని యీక్రూరత పో వృత్తి నెట్టి
మానసవుండ వని నమానపేశ్వరతఁ
గోరి డెందమునఁ గైకొనియెనో కాని
యేరీతి నుండునో యిది యంచుఁ దలఁచి
సంచితమన్యుఁడై శతమన్యుఁ డపుడు
పంచాస్త్రమోహనబాణంబుకరణిఁ
గనుపట్టు నచ్చరఁ గాంచనన్ణి
యనుపేరిచెలువ నొయ్యనఁ జేరఁ బిలిచి
ధరలోన భార్గవతాపసుం డిప్పు
డురుఘోరతపము సేయుచునున్నవాఁడు
చపలాక్షి! నీవిలాసముచొక్కుఁ జల్లి
తపసి గూర్చినతపోధనముఁ గైకొనుము
మదవతి! నినుఁ గన్నమానవుఁ డింద్రు
పద మేలఁ దలఁచు నెప్పగిదినం టేని
రమణి! నీయరుణాధరముఁ గ్రోలువాని
కమృతంబు మై నేల యాసలుపుట్టుఁ
గాంత! నీకుచములుఁ గనువాని కమర
దంతికుంభములపైఁ దలఁ పేల కలుగు

సతివ! నీబాహువుల కగపడువాఁడు
మఱిఁ గల్పలతికల మఱి యేల యెన్నుఁ
బడఁతి! నీపలుకెంపుపసఁ గన్నవాఁడు
తడవునే యాత్మఁ జింతామణిఁ దలఁపఁ
జెలువ! నీతోడిపొందికఁ గల్గువాఁడు
మఱియేల దేవసామ్రాజ్యంబు వెదకు
నని తన సేయుకార్యప్రకారమున
కనుగుణంబుగఁ బల్కు నమరేశ్వరునకుఁ
బ్రణమిల్లి తదనుజ్ఞఁ బడసి యాలేమ
గణుతింపఁ దగుహేమకిళికలో యనఁగఁ
గనుపట్టు దేవతాకామినీమణులు
తనుఁ గొల్వ మేదినీస్థలి కేగుదెంచి
స్వర్గోపవనవికాసముఁ గ్రిందుపఱచు
భార్గవమునివనప్రాంతంబుఁ జేరి
పుట్టతోట్టెలలోని భుజగబాలకులఁ
బట్టి యొయ్యన జోలఁ బాడు నెమళ్ళ
నెలమిఁ జెంతల నాడు నేణపోతములఁ
బిలిచి మచ్చిక యగ్గుఁ బెట్టుబెబ్బులులఁ
బలుమఱుఁ గరములం బట్టి లాలించి
కలభసంతతి ముద్దు గావించుహరుల

వలమి పక్కలలోన నందంద పొదివి
మెలుకపిల్లలకుఁ జన్నిచ్చుపిల్లులును
గలిగి యన్యోన్యరాగములతో స్వైర
ములు మాని సురవనమును గేలి గొనుచు
సారసభవు బోలె శంభునిం బోలె
శారదోద్యచ్ఛివాసంయుతం బగుచు
సురనాయకుని బోలె సుగ్రీవు బోలెఁ
గరిరాజ వనచర కమనీయ మగుచు
నాగలోకముఁ బోలె నలినాస్త్రుఁ బోలె
భోగీంద్రరతికుచభూషితం బగుచు
వనరాశిఁ బోలె దిగ్వలయంబుఁ బోలె
ననుపమాండజవిబుధాకీర్ణ మగుచుఁ
బనసభూజాతముల్ పారిజాతములు
ఘనసారపూగముల్ కనకపూగములు
చిరిబిల్వవారముల్ సింధువారములు
సరస రసాలముల్ చక్రసాలములు
పాదలుజాతులు బహుపుష్పజాతులును
బొదిగొన్న మల్లెలు బొండుమల్లెలును
జందనంబులు గలచందనంబులును
గుందహింతాలముల్ కురువతాలములుఁ

గోలకుంజములు నంకోలకుంజములుఁ
జాలమ్రాఁకులును రెప్పలమ్రాఁకులును
గనుపట్టురావులు గంగరావులును
గొనబైన తేకులు గుముడు తేకులును
గలుగొట్టు రేఁగులు గంగరేఁగులును
దలుకొత్తు నిమ్మలు దాడినిమ్మలును
గుదిగొన్న జువ్వలు కొండజువ్వలును
ముదిరినమోదుగుల్ ములుమోదుగులును
మొదలైనతరులతాముఖములఁ గలిగి
పదివేల తెఱఁగులఁ బ్రబలి యొంతయును
స్వర్గంబువనములఁ జౌక పుట్టించు
భార్గవువనములోపలి కేగుదెంచి
యచ్చరపూఁబోఁడి యచ్చట నిలిచి
వచ్చిన తనతోడివనితలు మెచ్చఁ
గట్టాణిముత్యాలఁ గనుపట్టుచున్న
బొట్టు మిక్కిలి నొఱపుగ సవరించి
నటనగాఁ జిన్నారినామంబుఁ దీర్చి
బటువుగాఁ బచ్చలపతకంబుఁ జేర్చి
కొనబుగాఁ గప్పారుకొప్పుఁ గీలించి
మినుకుగా మేదీఁగె మృగమదం బలఁది

రొలుపుగాఁ గుచ్చెలనొరయంగఁ గట్టి
మెఱుపుగా మొలనూలు మీఁద నమర్చి
కలుకుగాఁ బాఁజులకమ్మలు దాల్చి
తెలివిగా మొగపులతీవె లంకించి
*విన్నాణముగరాలపెండెంబు వెట్టి
వన్నియగా సేల వలెవాటు వైచి
డాలుగాఁ బసిఁడియొడ్డాణంబుఁ బూని
మేలుగా వజ్రాలమించులుఁ బూని
కాంతిగాఁ గెంపులకడియము ల్దొడిగి
వింతగాఁ గపురంబు విడియంబు చేసి
యొసపరి బాగుగా నుద్దాలు మెట్టి
యసమసాయకుని మోహనకాండ మనఁగ
ధళధళఁ దులగించు తాటంకరుచులు
తళుకొత్తు చెక్కుటద్దముల మై నిగుడ
నెఱబేడిసలజాడ నిగుడ నేత్రముల
మెఱుగారుచూపుల మిన్నెల్ల మెఱవ
నఱవిరిగతుల నొయ్యన మూఁపుమీఁద
నఱజాఱువేనలి యల్లాడుచుండ
ఝల్లుఝు ల్లని మునిస్వాంతంబు గలఁగ
ఘల్లుఘు ల్లని పాదకటకముల్ మొఱయ

*బిన్నాణమగరాల

గీటాడుగుబ్బల గికురించుకాంతు
లూటాడుపయ్యెదయోర డాలింప
నెరు లేరుపడి నిగనిగ చిదిరించు
మురువైనకుచ్చెల మొరమొర మెఱయఁ
గడు మించు మరువేఁట గంటలపోల్కి
నడిదారముల గంట లుయ్యాల లూఁగ
ధగధగ మించురత్నముల పెంపెసఁగు
మొగపులకటిసూత్రములు వెడజాఱ
మెఱుఁగుఁ బల్వరుసకాంతిమిన్నంచుతో మోవి
చిఱునవ్వువెన్నెల చిందులాడంగ
వేఁగారుగుబ్బల ప్రేఁకంబుతోడ
లేఁగానుదీవియ లివలివ లాడ
ముంగేలికంకణంబులపంజరంబు
చెంగటి ముద్దురాలుక లాలించి
తమ్ముఁ బెట్టెద రామ తమ్మ నాముద్దు
గుమ్మ మాటాడ రా కొటు కొట్టు మనుచుఁ
జిలుక నొయ్యన ముద్దుచిలుక నందంద
పిలిచిన తనదైన బింబోష్ఠమునకు
నొడిసిన రాచిల్క యొఱపు దప్పించు
బెడఁగున నొకవింతబెడఁగు చూపుచును

భావజుమదదంతిపగిది నాలేమ
యావనాంతరమున కరుదెంచి యచటి
ఘనతపోరాశి భార్గవమహాసివర్యుఁ
గనియుఁ గాననిదానిగతిఁ జేరవచ్చి
యలయుచు సొలయుచు నతనిముంగిటను
బొలయుచు మేనివల్వలు గుబాళించి
పన్నీటి యువము కపురిముమీఁది చలువ
వెన్నెలలో శీతు వెడనవ్వుకొనుచు
మట్టమై తలిరుజొంపములలో నొక్క
పొట్టమైలో నెండపొడవడకుండఁ
దలిరించి కడు నివతాళించుచున్న
యెలమావికిందటి కేతెంచి నిలిచి
చరణంబు మై నొక్కచరణంబు నిలిపి
గురుకుచంబులతళుకులు పిసాళింపఁ
దలిరుకెంగేలఁ గెందలిరాకునొమ్మ
నలవోకఁ బట్టి యొయ్యారంబు నిగుడ
మెఱుఁగువేనలి మూఁపుమీఁద నల్లాడ
నొఆపులు గులుకంగ నొకచిందువాడి
చెలికత్తెమూఁపుపైఁ జేయిఁ జేర్చుచును
జిలుకకు బుద్ధులు చెప్పి నవ్వుచును

దళుదళుక్కున గండతల మొలయించు
నొలయించి కెంగేల నొయ్యన మాటు
మీఱుపాలిండ్లపై మెఱుఁగుగాఁ జెరఁగు
జాఱించు జాఱించి చక్కఁగా నొత్తుఁ
జిఱునవ్వువెన్నెలజిగి నెఱయించు
నెఱయించి మోవివెన్నెల సాళగించు
నల్లన నయనతోయజము లల్లార్చు
నల్లార్చి రెప్పల నడ్డంబు సేయు
నటన మూపునఁ గొప్పు నటియింపఁ జేయు
నటియింపఁ జేసి క్రిన్ననఁ జక్కఁదిద్దుఁ
గరమూలయుగళిబంగరుసూకురాల
విరిబంతి కెంగేల వికసింపమఱియుఁ
జెలికత్తియలపిండుఁ జేరఁజీరుచును
గిలిగొట్టి యంతలోఁ గేరి నవ్వుచును
నలయుచు సొలయుచు నందంద నొసలఁ
జిలుకు లేఁజెమటఁ గెంజేత నూర్పుచును
గఱివంకబొమలు నిక్కంగ సంపంగి
నెఱతావి నెరయంగ నిట్టూర్పు లిడుచుఁ
దగఁ బచ్చపదకంబుతళుకుల మెఱుఁగు
బిగిచన్నుఁగవ చుట్టుఁ బేరెంబు వాఱ

రం గైన కంకణరాగంబుతోడ
నుంగరంబులకాంతు లుప్పరం బెగయఁ
బసిఁడివన్నియఁ గ్రిందుపఱచు నెమ్మేని
పసనిచాయలు వలిపముఁ జౌకళింప
గబ్బిగుబ్బలమీఁది కస్తూరిపూఁత
గొబ్బున మెఱసి దిగ్గున సోఁకుముట్ట
ధరలోని విరహిసంతతి నెలయింప
మరుఁడు పంటినయట్టి మాయామృగంబు
కరణిఁ జూపట్టి భార్గవమానిచిత్త
సరణిఁ బ్రవేశించుసరవిఁ జింతించి
పలుమఱు దనహావభావవిలాస
ములు చూపుచుండ నమ్మునివరేణ్యునకు
నంతరంగము చిందులాడఁగఁ దొడఁగె
నంతట రవిమీఁద వాత్తినచూపు
రాజాస్య తాటంకరవలమై నిగిడె
నోజ దప్పక విధియుక్తమంత్రంబు
నుడివెడి జిహ్వ కన్నుల కల్కినామ
మడుగ నుద్యోగించె ననురాగ మెసఁగ
హృదయాంబుజంబుపై నెనసినబుద్ధి
మదిరాక్షి పాదపద్మములపైఁ దగిలె

జపమాలికాసంఖ్య సవరించు వ్రేళ్లు
చపలాక్షి రమ్మని సన్నఁ గావించె
నప్పుడా మునినాథుఁ డంతరంగమునఁ
గప్పిన కామాంధకారంబుతోడ
నయము పోవిడిచి మానముఁ గట్టిపెట్టి
నియమంబుడిగి మనోనిగ్రహం బేది
జపమాల సడలించి జప ముజ్జగించి
తప మోసరించి లో ధైర్యంబు డించి
యచ్చటఁ జెలువొందు నచ్చరలేమఁ
గ్రచ్చరఁ జూచి దగ్గఱ కేగుదెంచి
కమలాయతాక్షి జగన్మోహనాంగి
భ్రమరకుంతల దేవభద్రేభయాన
నీ వెవ్వ రబ్జాస్య నీకుఁ బే రేమి
దేవకన్యకవో భూదేవకన్యకవో
రాజకన్యవో భోగిరాజకన్యకవో
నీజాడ యెఱిఁగింపు నేఁడు మా కనిన
నీతఁడేఁ జిక్కెఁ బో యితఁ డంచుఁ జూప్ప,
నాతి కైవడి నలనాతి యిట్లనియె
ననఘాత్మ వినుమయ్య యమరకన్యకను
గనకాంగి యనుపేరు గలిగినదాన

ధరఁ బావనాశ్రమస్థలములయందుఁ
జరియింపుచుండుదు సఖులతోఁ గూడి
మీవంటిఘనుల కర్మిలితోడ సేవఁ
గావింపఁ గోరి యీగతి సంచరింతు
నోమానికులవర్య యొంటి మీ కిట్లు
భామలతోఁ గూడి భాషింపఁదగదు
చపురుబోఁడులు తపస్విలవృత్తులకు
వివరింపఁగా వేరువిత్తులు గారె ?
మదిలోన నొక్కటి మాటాడు టొకటి
మదిరాక్షులకు నియమంబు సంశయము
వారులు నహి నైజవర్తనల్ సున్న
భావసంసిద్ధి యెప్పాటను లేదు
వేచందమునఁ గృపావివశుఁడై యీనఁ
గాచినపిదపఁ గుక్కల కిచ్చినట్లు
ఘనతపోధన మెల్లఁ గడపట నొక్క
వనిత కై యేటికి వఱదవుచ్చెదవు
పరమతపోరాజ్యపట్టబద్ధుండ
వరయ నీ కిది యేల యని కేలు మొగిచి
పోయివచ్చెద నని పోవ నుంకింప
నాయెడ భార్గవుం డనియె నచ్చరకుఁ

గలకాల మెల్లను గానలో నాకు
నలములుఁ దిని తిని యలయ నేమిటికిఁ
బరమసౌఖ్యం బైనభామలపొందు
మరుగనివాని జన్మంబు జన్మంబె
పరికింపఁగా మున్ను పార్వతీసతికి
హరుఁ డిచ్చె సగముదేహం బన వినవె
యదియునుగాక తోయజభవుం డేల
వదనపంకేజంబు వాణికి నిచ్చె
వార లట్లుండ నీవసజాక్షుఁ డేల
శ్రీరమాదేవిఁ దాల్చెను వక్షమందు
నిన్నియు నన నేల యిహసౌఖ్యవితతు
లన్నియు నిచ్చువా రన్నుల కారె
విపరీతముగ * నన్ను విడనాడ నేల
తపము పండినమీఁదఁ దాల్తురే జడలు
చపలాక్షి నీతోడిసంగంబు గలుగఁ
దప మేల జప మేల తక్కిన వేల
నన విని తనకు లోనగుటఁ జింతించి
కనకాంగి హానివాక్యము సమ్మతింప
మునినాథుఁ డప్పు డామోదకుంజముల
వనజాస్త్రబాణవిహ్వలచిత్తుఁ డగుచుఁ

* నిన్ను విడనాడ

దొలుత నా గాధిసుతుండు మేనకను
గలసినకరణి నాకనకాంగిఁ గూడి
సరససల్లాపహాసవిలోకనముల
మరుకేళిఁ దేల్చి పిమ్మట విచారించి
యిచ్చలో నిది తగు నిది తగ దనక
యిచ్చట నే నుండి యేమి చేసితిని
యెచ్చటి సురలోక మెచ్చటితపము
నెచ్చటియచ్చర యిట కేల వచ్చె
వచ్చెఁబో యే నేల వనజాక్షిచూపు
మచ్చువేసిన నిట్లు మరు లేల కొంటిఁ
గడుచిత్ర మిది గాదె కడలిలో నుప్పు
నడవిలో నుసిరికాయయుఁ గూడినట్లు
లే వీటి కనకాంగి యేవీటి పహాని
యీవిధి వాటిల్లె నేమికారణమొ
యది చూడవచ్చిన నట్టిద కాదె
ముదితలయెడ నున్నమునివర్యుఁ డైన
జడియక యెట్లుండుఁ జర్చింప వహ్ని
కడ నున్నయీ వెన్న కరుఁగ కే లుండు
నచ్చెరుపడి వేయు నన నేల నొకరి
యిచ్చ గా వెన్నిన నిది దైవకృతము.

అని యాత్మవిద్యావిహారి యై యాత్మ
వనజోదరునిపాదవనజముల్ దలంచి
పరమవిరక్తుఁ డై వభముక్తుఁ డగుచు
నరిగె నంతటఁ దీర్థయాత్రానురక్తి
నాయెడ మునిఁ గూడినంతనే దేవ
లోయజవదన సద్యోగర్భ యగుచుఁ
గమలాక్షుదివ్యసంకల్పంబువలన
దమితదైతేయసుదర్శనాంశజుని
నఘదూరు యోగీంద్రు నతులలగ్నమున
మఘతారకను బౌష్యమాసంబునందుఁ
గని తనవచ్చినకార్య మంతయును
ననుకూల మయ్యెఁ బో మ్మంచు గర్వించి
వనజాసనేంద్రాదివంద్యుఁ డౌవాని
మనుజమాత్రుని గాఁగ మది విచారించి
గుమిగొన్న యొకవేత్రకుంజంబులోనఁ
గొమరుని నునిచి గ్రక్కున నేగె దివికి
మానినందనుఁడు నిర్మానుషం బైన
కానలో బెగ్గిలి కావు కా వనుచు
విలసిల్లఁగా సామవేదనాదముల
నెలుఁగెత్తియేడ్వ నయ్యెడఁ గరుణించి

యామహీంసారనాయకుఁ డైనశౌరి
యామవానిసుతుఁ డున్నయట కేఁగుదెంచి
వసధిమేఖల గారవమున లాలించి
తనకటాక్షామృతధారలచేతఁ
దనివి నొందించి యంతట సేదదేర్చి
తనరించి యంత నంతర్ధాన మైన
జలజాక్షువిరహంబు సైరింపలేక
మెలుఁ గత్తి యాబాలుఁ డేష్చనత్తళిని
మలయంగ నెడ దుప్పిమై నోర గాఁగ
మొలత్రాటఁ జెక్కినమోటకత్తియును
గొనసిగతోఁ గూడి కురు లొకయింత
గనుపట్టఁ జెరివిన గన్నెరాకమ్ముఁ గ
గొనల వెల్వ్యాకుపుట్టగోఁచియు నెరులు
బెనఁగొన్న నునుదబ్బపీఁచు డాకేల
వెడవెడ జివ్వాడు వెమరుసలాక
మెడనుచే బొట్రవేలి యిరుపయుంగరము
నదరంగ *యడమొట్టి యగుగొడ్డుటావుఁ
బిడిముక్కుత్రోడునఁ బెనచి †రాఁబట్టి
తనతోడిజోడు మీదరులు సోదరులు
వెనువెంటఁ జన నొకవేణులావకుఁడు

---

*యెడమోటి †చేఁబట్టి

హరిదాసుఁ డనుపేరియతఁడు భూసార
పురవాసుఁ డవ్వనభూమి కేతెంచి
కలి కెక్కి చిట్టెలు గట్టి లో మునిఁగి
కుఱచ లై వంకరకొంకరల్ వోక
నల్ల లై చక్క నై నవర నై పెరిఁగి
వెల్లవోవని పండువెదురులు చూచి
నఱికి కుప్పలు వైచి నయముగాఁ జివ్వి
ముఱియించి కుదియించి మోపులు గట్టి
యూరికి మరల నుద్యోగించుతఱిని
వారికి నాచెంత వనవీధి నున్న
బాలురావము వినఁబడిన వా రప్పు
డాలించి మార్గాల మని సంశయించి
పొక్కపొక్కని తమభావమఁ జెప్పుచును
గ్రక్కున నటకు డగ్గఱ నేగుదెంచి
యలమానిసుతుఁ డున్న యట్టికుంజంబు
వలచుట్టియుండిరి వలచుట్టినట్లు
హరిదాసుఁ డనుపేరియతఁ డేగుదెంచి
దరుల మేదరుల సోదరుల నీక్షించి
బాలురావం బేమొ పరికింపుఁ డనుచు
నాలోని కేతెంచి యమితతేజమున

భానుకోటిస్ఫూర్తిఁ బ్రహాసింపుచున్న
మానినందనుఁ గాంచి మది సంతసించి
పిల్లి గా ద్దోరి జాబిల్లి గాఁబోలుఁ
జల్లనివెన్నెల చల్లుచున్నాఁడు
అనుచు నబ్బాలు రె ప్పార్ప కెంతయును
గనుఁగొని వేడుకకడలి నోలాడి
యానందబాష్పంబు లాననాబ్జంబు
మై నిండి దిగువాఱ మై గరుపారఁ
బెన్నిధిఁ గన్నట్టి పేదచందమున
నున్నతోన్నతుఁడైన యోగినందనుని
దనయులు లేమి నాదరమున నెత్తి
కొని కూర్మితోడ నక్కునఁ జేర్చి వేడ్కఁ
గొనకొని యావేత్రకుంజంబు వెడలి
తనవార లెల్ల నెంతయుఁ జోద్యపడఁగ
మునిపుత్త్రుఁ గొని పురంబున కేగుదెంచి
తనయాలిచేతి కెంతయుఁ బ్రేమ నొసఁగ
నరవిందనాభుఁ గన్నట్టియశోద
కరణి నుప్పొంగి యాకాంతాలలామ
యనుపొందఁగా బోరు కాడించి కూర్మి
యినుమడింపంగఁ జన్నిచ్చె నిచ్చటయు

నామహీసారనాయకుఁ డైనయట్టి
హేమాంబరుఁడు తనయెదుట నిల్చుటయు
హరిపదధ్యానామృతాహారలహరిఁ
బరితృప్తిఁ జెంది యాభార్గవాత్మజుఁడు
చను గ్రోలఁ డయ్యె నాఁ డనే పెక్కు
దినము లుండంగ నెంతే వెఱఁగంది
మగనితోఁ బలికె నమ్మగువ దూఱుచును
నగుబాటు చేసి తిందఱిలోనఁ దనకుఁ
గటకటా! వీని నెక్కడనుండి తెచ్చి
తిటువంటి పసిబిడ్డఁ డెందైనఁ గలఁడె
చను నోటఁ బెట్టండు చనుఁ గ్రోలకున్న
మినుకంత యుగ్గైన మ్రింగఁ డేమవఁడు
అఁకొన్న చంద మింతైనను లేదు
తేఁకువ చెడఁ డొందుదిక్కుఁ గన్గొనఁడు
అరయ వీఁడు దయ్యము గాని భూమి
వారిబిడ్డలవంటివాఁడె? చూడంగఁ
జిక్కండు నలుగండు చెలు వగ్గలించి
యొక్కచందంబున నున్నాఁడు గాని
యనుచు నిద్దఱు నరు దంద నావార్త
జను లాలకించి యాశ్చర్యంబు నొంది

యాబాలగోపాల మట కేగుదెంచి
యాబాలుఁ జూచుచు నరుగుచుండంగ
నానగరిని వృద్ధుఁ డగుసట్టిపుత్త్రి
హీనుఁ డొక్కరుఁడు పెక్కేండ్లనుండియును
సంతానకాముఁడై సతియును దాను
నంతరంగమున శోకార్తుఁడై యుండి
యావార్త విని వెఱఁగంది డెందమున
భావించి యితఁడు తప్పదు దేవుఁ డనుచు
నత్తపోధనుఁ జూచునభిలాష నటకు
రిత్తచేతులఁ బోవ రీతి గా దనుచు
నొకపోలనెయి, పాలు నొకచేరెఁడన్ని
యకలంకమతి నిచ్చి యది కేలఁ బూని
యనురాగవల్లిక యంతరంగమున
నన లొత్త నటకుఁ గ్రన్నన నేగుదెంచి
హరి మున్ను నందగేహములోన నున్న
వరుస నావేణులావకునింటిలోనఁ
బసనిమాయావటపత్రతల్పమున
వసియించి నిదురించువాఁడునుం బోలె
బాగొప్పఁ దొట్టిలపైఁ బవ్వళించి
యోగనిద్రాసక్తి నుండు నవ్వానిఁ

గని చేత నున్నదుగ్ధము యోగిమ్రోల
నునిచి సన్నుతి చేసి యోగీంద్రవర్య !
నాకేశసన్నుత ! నా చేయుభక్తిఁ
గైకొని నను నీవు కరుణింపవలయు
సీరిసోదరుఁడు కుచేలునియటుకు
లారగించినరీతి నవధారు దేవ !
భక్తవత్సల ! కృపాపారీణ ! నాదు
భక్తిఁ గైకొమ్మని పదముల వ్రాల
నతనిభక్తికి నాత్మ ననయంబు మెచ్చి
యతివేగమునను బద్మాసనుం డగుచుఁ
గరుణాపయోరాశి కాన నామౌని
వరుఁడు తత్క్షీర మాస్వాదించె నపుడు
జను లెల్లఁ జేయుపూజలు లెక్కగొనని
ఘనుఁడు నాసేవ నిక్కము మెచ్చె ననుచు
మనమున నుప్పొంగి మఱిడి యీరీతి
దినదినంబును బాలు దెచ్చుచునుండి
యంతట నొక్కనాఁ డాదృఢవ్రతుఁడు
కాంతయుఁ దాను నక్కడి కేగుదెంచి
ప్రతివారమును దెచ్చుపగిది దుగ్ధంబు
నతనికి నర్పింప నాయోగివరుఁడు

కవలఁ బిసాళిజక్కవల నొప్పారు
తొవల నత్తావిచెందొవల బంగారు
తమ్ముల మీలమొత్తమ్ముల శైవ
లమ్ములఁ గాంచజాలమ్ములఁ బోలిచి
యల్లన నెత్తావు లడరుదెమ్మెరల
జల్లుబోరాడుకాసారంబుఁ గాంచి
యందుఁ దోయములోన నరిగి మధ్యాంబు
నందుఁ గాంచనతోయజాంతరసీమఁ
గమలాంశజాత మైకమలయుం బోలెఁ
గొమరారు నొకరాచకొమరితెఁ గాంచి
నెలపొల్పుఁ గన్నవెన్నెలపుల్గుకరణి
బలువైననిధిఁ గన్నబడుగుచందమున
సంతసింపుమఁ జేరఁ జని నిచుళేంద్రుఁ
డంతరంగము ప్రేమ నంతంతఁ బొదలఁ
దళుకునత్తమ్మిపుత్తడిబొమ్మరింటఁ
బొలుపొందురత్నంపుబొమ్మచందమునఁ
జెలువారుబాలికం జేకొనిపుత్త్రి
చెలువున భావించి చెలఁగి యారాజు
తనపురంబునకు నెంతయువేడ్కతోడఁ
జనుదెంచి నిజనివాసముఁ బ్రవేశించి

తనయులు లేమిఁ దద్దయుఁ బొక్కుచున్న
తనపట్టమహిషి కాదరము రెట్టింపఁ
బద్మిని యనుపేరఁ బాటింపుఁ డనుచుఁ
బద్మజ యైన యాపసిబిడ్డ నొసఁగఁ
నాబాలఁ గైకొని యాత్మ నుప్పొంగి
యాబాలశశిఫాల యనురక్తి మీఱఁ
గొదలేనిసెమ్మది గొనకొన్నకూర్మి
బొదలుగారామునఁ బోషింపఁదొడఁగె
నాళీకసంభవ నవచంద్రరేఖ
వోలె నానాఁట సొంపులు మించి ప్రబలి
మొగినీలములరంధ్రముల నెన్నుకురులు
నిగురుజందురువంక లెన్ను నెన్నొసలు
డిగనివిండ్లకు నెక్కుడించుభ్రూలతలుఁ
దొగమొత్తముల నీల్గఁ ద్రొక్కుకన్నులును
బెలుచశంఖము మొఱపెట్టించుగళముఁ
గెలసిచక్కెర నుడికించుపల్కులును
గిసలయంబుల వణఁకించుకెమ్మోవి
బిసముల నీరాకఁ బెట్టుబాహువులు
వనజాతములఁ దలవంపించునడుగు
లొనరికమైమొప్పు నొప్పునాతన్వి

ధగధగందళుకొత్తు తలిరంపకాని
చిగురుకరాచూలిజీవరత్నంపు
చక్కనిగుమ్మవాసనలపూరెమ్మ
చక్కెరకవణాలసాంబ్రాణితేజి
యపరంజినక్క మోహనములచొక్క
కపురంపులప్ప సింగారంపుకుప్ప
చిలుకలకొలికి గొజ్జగిపువ్వుములికి
తొలుకరిమించు కంతునికేలియించు
ఇంచువేలుపుతీఁగ యొలమించుసోఁగ
చంచరీకాలక శశిఫాలఫలక
పలకవజ్రపుఁదళ్కు బంగారుకళుకు
కలుకులనెఱివేణి గలకీరవాణి
వాణీశనుతపాణి వనజాయుధురాణి
రాణించుకలువ వారనిముద్దుజెలువ
యన నిందుజవ్వని యైరంగవిభుని
నసుఁగులోఁగూర్మి యొయ్యనలోకలోత్త
నిలకు మింటికి నూత్న మొసఁగించి మంచి
వెలఁది చల్లనియేటివెలదిని గాంచి
సొలపుకెంజెడలగొల్పులబాదు గలిగి
తళుకొత్తుచంద్రకాంతంపుదొట్టులను

వేడుక నిడి చేసి పీవనిజోలఁ
బాడుచు రాతికిఁ బాణంబుఁ దెచ్చి
మునులడెందంపుఁదమ్ములనిల్పి సిరుల
మొనసిన యడుగుదమ్ములనొప్పువాని
పదియాఱువన్నియపచ్చ*రింటెంబు
గదియ రింగులువారఁ గట్టినవాని
బుట్టుచు జగములు పుట్టించువాని
బుట్టినిల్లగు తమ్మిపొక్కిలివాని
నలదేవమాణియు ఘంటాభరణంబు
గలిగి ఘల్లన్మ్రోయు కాలియందియల
కంచుమించుగ నేలఁ గాలొందనీక
మించి మేఘంబులమీఁదఁ బాఱుచును
జెలువారుడాలుబల్కు సెకలింపు లెసఁగఁ
బొలుచుపుల్గులరాయబొల్లని నెక్కి
చొప్పడం ద్రొక్కనిచోట్ల ద్రొక్కించి
యొప్పెడు దేవరాహుత్తరాయనిని
నెఱి నెండకన్నును నీడకన్నెపుడు
నెఱుఁగనివాఁ డయ్యు నెలరార నెండ
కన్నును నలనీడకన్నును గలిగి
క్రొన్ననవిలుకానిగురుఁడైనవానిఁ

*గింటెంబు

గడపటఁ గడుపులోఁ గాల్గొండఁగాను
పుడమిపైఁ బుట్టక పుట్టెఁబో మ్మనుచు
వేయినోళులతోడ వినుతులు మునులు
సేయంగఁ గన్నులే చెవులుగా వినుచుఁ
బలుకులు గురువునాఁ బ్రబలి నమలక
మలకల పెను బాన్పుమై నొప్పువాని
పొట్టెంపు నెట్టెంపు పొందు నీరెండ
చుట్టుదారల కరాచూలిమీఁదటను
బంచెవన్నెల తేజిపై వానిమాను
మించుల నదలించుమించుల గలిగి
కడిఁదిరాకాసిమూఁకలఁగన్న బొబ్బ
లిడుపోటుముట్టుమై నెనయించువాని
రంగనాథుని రమారమణు రాజసము
శృంగారమును రూపు చెలువంబు సిరులు
నెఱతనంబును గల్గు నేర్పరి యనుచు
గుఱుతుగ నలపరాంకుశముఖ్యమునులు
పలికిన దివ్యప్రబంధరత్నముల
వలన నిచ్చలు విని వరునిగాఁ గోరి
తనమది నతనిమైఁ దలకొన్నకూర్మి
నినుపాఱ నాపద్మినీరాజవదన

చింతించి వలపులఁ జిక్కి లోఁజిక్కి
యెంతయుం దమిఁ జిక్కి యే పెల్లఁ దక్కి
పన్నుగా నరజాఋపయ్యెదం జేర్చుఁ
బన్నినతమి నాఘుపయ్యెదం జేర్చు
నుడుగక నీరు కన్నుల నాన నిలుపు
నుడివిన సైప కన్నులనాన నిలుపుఁ
గలసెద నని కోరికలలోనఁ గాంచుఁ
గలసి మేల్కని కోరికలలోనఁ గాంచుఁ
గాంతు నెన్నను వినుకలితనంబునను
గాంతుఁ జెప్పిన వినుఁ గలితనంబునను
ఈరీతిఁ దనలోన నిగుఃరొత్తుకోర్కి
సారెసారెకు దీఁగసాఁగ గంగేశు
దాయక పాయక తలఁపు లేకములు
సేయక రాయక చికిలిచన్మోనలు
కుచ్చక మెచ్చక కొనసాఁగి వలపు
లెచ్చక యిచ్చక మిటుసేయకున్న
నేరీతి వేఁగింతు నే నంచు చింతఁ
గూరిన యారాచకూఁతురిఁ జూచి
చెలులెల్ల మతులఁ జర్చించి యీచెలువ
చెలువమి క్లైలాకో చెలువంబుఁ దక్కి

చెలులఁ జేరదు వింతచెలువంబుఁ దాల్చి
చెలువార నెటువంటిచెలువునిమీఁదఁ
దలఁపు చేకూరెనో తరళాక్షి కిపుడు
... ... ...
తఱివేచి చుట్టమై దాయచందమునఁ
దరితీపు సేయుచు దరితీపువింట
నీనారిపై మారుఁ డెలదేఁటినారిఁ
బూని నెత్తావితూపుల నేయఁబోలు
రామాభిరామ నీరామ నారామ
సీమం బరాకు సేసినఁగానియింక
బలవంత మగువంతఁ బాయ దటంచుఁ
జెలు లంతఁ దమహొంత చెలువదోఁకొనుచు
మందారమాధవీమాలతీతిలక
చందనశారదసాకారసరళ
పూగపున్నాగజంబూభూజదూప
నాగకేసరనీపనారంగవకుళ
పనసపాటలపారిభద్రబంధూక
ఘనసారతింత్రిణీక్రముకజంబీర
తరులతాముఖములఁ దనరు నుద్యాన
మరుదార సొత్తెంచునపు డేపు మీఱి

వృద్ధభావము మాన్చి వృక్షాళిఁ గాయ
సిద్ధిఁబొందఁగఁ జేయుసిద్ధుఘుణ్యుండు
కంతునెచ్చెలి వేల్పుగములవిందులకు
సంతసం బొదవ వసంతుఁ డేతేరఁ
దోయజబాణుకత్తులనారు వోలె
నాయెడం దలిరించె నవనీజతతులు
విరహులడెందముల్ విదళింప బట్టు
దొరిగెడురక్తంబుతోఁ దొప్పదోఁగి
రాగిల్లుమరునఖరంబులో యనఁగ
బాగొప్పెఁ గింశుకప్రసవాంకురంబు
లీయింతిచనుగవయెడ రంగవిభుఁడు
పాయకయుండుఁ జొప్పడు మీఁద ననుచుఁ
దెలిపెడిగతి మిండతేఁటిమొత్తంబు
లలరుగుత్తులయెడ నలరి చూపట్టె
నప్పు డారాజకన్యకచెలుల్ చెలిమి
చొప్పడఁ దనుఁగూడి జోడుగా నడువ
జొబ్బిలుకమ్మకస్తురిగబ్బు లొరయ
గుబ్బచన్నులతళుకులు బిత్తరింప
మరుని సామ్రాజ్యరమాదేవికరణిఁ
దరుణులతోడ నెంతయు నొప్పు మిగిలి

వలపలిచలిగాలివలన నల్లాడు
వెలఁది హుంబాళెల వీచోపులుగను
దళుకొత్తుతలిరుబద్దలు సవరించి
బలువిడి గోయిల పడవాళ్ళు నడువఁ
దనరారు చిలుక మొత్తపువందిజనము
తనదుముంగల బిరుదము లుగ్గడింపఁ
బొదలఁ దుమ్మెదనకీపులు బిట్టు మొఱయఁ
బొదలుచుఁ జదలఁ బుప్పొడిదుమ్ము తెగయ
వడి వసంతుఁడు దళవాయియై నడువఁ
గడుసొంపు మిగిలి చక్కదనంబు లెసఁగు
పంచవన్నెల తేజి పడివాగె నడువఁ
బంచబాణుఁడు విజృంభణావృత్తి మెఱసి
మిసమిస మనుచుఁ గ్రొమ్మించులు గలుగు
పసనికర్ణికలును బసిఁడిఘంటలును
గ్రొమ్మించు చెంగల్వకుచ్చుల వెలఁది
తమ్మిలేఁదూడుదంతపు గోడియలను
దిలకించు పవడంపుఁ దీఁగెతాఁడులను
బలువన్నె విరుల కుప్పడ మైనపడము
నలరు మొల్లల వెండి యనుసులతోడఁ
జెలువొందు పూదీవెసెల గొమ్ముకొమ్మ

గోనబుచూపట్టు కుంకుమపువ్వు వఱపు
నోనరిక చిగురాకు టోరఁగును గలిగి
యలరారు చిన్నాణ మైన యందలము
పొలుపొంద రాయంచబోయలు మోవ
నంచలవలరాయఁ డావేళ నేగు
దెంచి యచ్చోట వర్తింపుచునుండె
నత్తఱిఁ జెలరేగి యాకన్యపొత్తు
కత్తియల్ వనకేళిఁ గావింపఁదలఁచి
కెరలి గేదంగుల గిల్లి రాగిల్లి
పరిమళోత్పలములు బట్టి చూపట్టి
కదిసి గొజ్జఁగులఁ గామించి మించి
తుదలేని పుష్పజాతుల రాసిరాసి
పోదఁడు రండని పొదరిండ్లు దూరి
కదియుచు సుమవారిఁ గైకొన్నవారిఁ
జేరి చేముంచి గొజ్జెగి నీటముంచి
సారెకు నీరీతి సరసంపురీతి
విలపిల్లుచుండెడువేళ నామెఱుఁగు
తలిరుబోఁణులఁ జూచి తము దామె చొక్కి
విటపులు గొన్ని పర్వైన ప్రేమతోడఁ
జిటపొటలాడ రంజిలి విఱ్ఱవీఁగి

తముఁ జూడఁ గాన చేతనమూర్తులయ్యె
భ్రమసి చొక్కుచు నెంతె పల్లవింపుచును
నేలీల నను గూడి యీముగ్ధలాడి
కేలిపై బిగ్గ గాఁగిటఁ జేర్చు నొక్క
యరయంగ నిదియేల యీకలకంఠి
పరికించి యొకపాటఁ బాడినఁ జాలు
నంతయెమిటికి నయ్యమృతాంశువదన
వింతగాఁ దన్ను నవ్వినఁ జాలుఁ దుదిని
అదియేలఁ దనతోడ నాకీరవాణి
యదనన్ని యొక్క మాటాడినఁ జాలుఁ
దలఁప నాగతియేల తరుణి నామీఁదఁ
జలునవాతెర తేనె చల్లినఁ జాలు
నదియేల తుదిని తోయజపాదపదము
ముదమున నామీఁద మోపినఁ జాలు
నని కోరుచుండెడు నమ్మహీజముల
యనురాగ మెఱిఁగి యయ్యంబుజాననలు
నకలంక నిజరూపహావభావముల
వికసింపఁ జేసి రవ్వేళ నాచెంత
రంగభూవిభుఁ డానరంగ భుజంగ
పుంగవముఖు లెల్ల బొలమరు లగుచు

జగడించు నిగమంపు సారమేయము ల
డిగిన సూత్రంపుఁ బట్టెడలచేఁ బూని
కడువింతలైన శాఖలవలల్ పూని
పొడవైనయంగంపు బోనులు దాల్చి
తన రెండుగడలనెంతయుఁ జిత్రగతులఁ
జనుదేర నవదాత జలజలోచనుఁడు
ప్రోద్దువంగడమునఁ బొడమినయట్టి
ముద్దులరాచూలి మురువుదీపింప
మలయుచు నడుగు దామరల లేగొనల
సొలయు వజ్రంపు మించుల మించు లెసఁగఁ
దళుకొత్తువెడఁద డెందముమీఁదఁ జినుగు
వెలఁది జన్నిదములు విలసిల్లుచుండ
సోగైనవలకేలి సొంపుడుగోల
బాగైన ముంగేలిపై జాలి డీగ
కరమొప్పు రవలడాకాలి నూపురము
సిరిమించుతళుకుల చెంగావిదట్టి
తులగించు నొసలి కస్తూరినామంబు
తెలిమించు నొంటి ముత్తియపుఁ బోగులును
జాతికిరీటిపచ్చలబణ్ణరసము
ఘాతిన వింతవాసనతట్టు పునుఁగు

కూడిన మొగలి రేకులు నెరివృట్టు
వీడియువీడని వెడజారుకొప్పు
నలవడరంగేశుఁ డమరేంద్రముఖులు
వలచి వెన్వెంట వేవచ్చు చునుండ
వలనొప్పు పసిఁడిమువ్వలు నందియలును
గిలగిలరవళింప గెరలి జాడించి
యక్కజం బగు పైఁడియత్తెంబుమీఁద
ముక్కుదీటుచునున్న ముద్దులడేఁగ
లావులు దువ్వి యల్లన ముష్టిఁబట్టి
కైవంచి సరసంబుగా గవ్వఁజూపి
వైవఁ జక్రము దానవశ్రేణిఁ గదియు
రేవచే వెడలి వాడిమినేగి యాతఁ
గలుషంపుఁ బులుగుల కసిమసఁ జేసి
మలసి పిల్చినఁ గేలిమైనచ్చి వ్రాల
నీరీతి మఱియు ననేకచిత్రముల
నాగామవీథి వేడ్కఁ గాంచు చున్నంత
నాపద్మినీకన్య యారంగవిభుని
రూపకోమలవైఖరులు విలోకించె
నలతలం పెఱిఁగి రంగప్పఁ డాచెలువ
పులకించి సొలపుఁజూపులను గీలింప

మానినీమణి చొక్కి మరుబారిఁ జిక్కి
మానంబు పేరెత్తి మమతతో హత్తి
పులకించి తిలకించి పొదిగొన్న ప్రేమ
తలిరింప నంత నాతలిరంపకాఁడు
చెలరేగి విరహులసెలను వి ల్వంచి
తొలఁగక నెలవంక తూపు సంధించి
యావధూమణి డెంద మదరంట నేసి
కావననాచ్చి యొక్కట బేరువార
నాలోనఁ గనుమూసి యంతలోఁ దెలిసి
యాలలనామణి యతనుతాపంబు
సైరింపలేక యచ్చనలాడు తమిని
గూరినచింతఁ గూర్కొనుచుండు తఱిని
అలరంగ విభుఁడు మోహనమూర్తిఁ ఖ
నెలయించి యెలయించి యింపు పుట్టించి
యరుదెంచె తనదు గేహమున కవ్వేళ
మరుబారిఁ జిక్కి వేమరుఁ జొక్కుచున్న
చెలువచందముఁ జూచి చెలులెల్లఁ గదిసి
సొలవకొం డొరుమోముఁ జూచి యిట్లనిరి
డాయదు మనలతోడను జారువలువ
మూయదు చనుదోయి మోహనం బొదవఁ

జేయదుగానంబు చెలువారు మేనఁ
బూయదుకస్తూరి పొలుపొందునోసలఁ
దీర్పదు తిలకంబు తిన్నఁగా వీణఁ
గూర్పదు గేదంగి క్రొమ్మొడిచెంతఁ
జేర్పదు ముద్దురాచిలుకకు చదువు
నేర్పదు కంటిరే నే డెంతవింత
యలరంగపతిఁ జూచినప్పటినుండి
చెలువమూరునిబారిఁ జిక్కి సొక్కిడిని
అలివేణి నింతసేయఁగవలె దనుచుఁ
బిలిచి యెవ్వరికని ప్రియముసెప్పదను
కెలయుగీరంబు మిక్కిలి వాఁతరట్టు
పొలుచుగోయిల నన్ను పొంపుడుచేయ
మలయు దుమ్మెదలు దిమ్మరిదిప్పకాయ
లిలఁ జందమామయెయ్యెడ బకుపాతి
సొలయు నీచలిగాలి సోమరిపోతు
ఎలయించు విలుఁ డన్న నెగపోఁతకాఁడు
కావున సురభి సాంకవలిప్తదేహు
శ్రీవేంకటేశ్వరుఁ జింతింపరమ్మ
రామనామముఁ బదరక యెన్నరమ్మ
రామపైఁ గనకాంబరముఁ గప్పరమ్మ

వేగ నాగశయాను వేడికోరమ్మ
యోగీంద్రబృందవంద్యుని గొల్వరమ్మ
యనుచు శైత్యోపచారాదులు సేయ
మనసిజతాపంబు మఱియు రెట్టింప
నాకవిధంబునఁ జెలు లొకకొంతతడవు
నకుఁ దేల్చి రాజకన్యక బుజ్జగించి
రాకుమారిక యంతరంగంబుఁ దెలిసి
తోకొని చెలులు తోడ్తో నగరికిని
జనుదెంచి రంత నా జనవరేణ్యుండు
తనుజాతయున్న చందము విలోకించి
కడుఁ గూర్మివాదల సంగడిసెజ్జమీఁద
నిడికొని యొక్కమా టెలమి వాటిలఁగఁ
బరికింప నిన్నాళ్ళ భావంబు లేదు
పరచింతనొందె నీభామాలలామ
యని నిండుజవ్వనియగుట భావించి
తనలోనఁ దా నె యెంతయు విచారించి
మాయమ్మ నీకెట్టిమగఁడు గావలయు
నీయెడ భయము లే కెఱిఁగింపు మనిన
మునిమునిసనగవు కెమ్మోవిపై నిగుడ
నాస పఱముద్దుమో మొక యింతయెత్తి

పరునొల్ల నల పరాత్పరుఁ డైన రంగ
వరుని నావరునిగా వరియింపవలయు
నన విని కడు వెఱఁగంది యారాజు
తనుజాతఁజూచి పద్మజభవాదులకుఁ
జర్చింపఁగా నగోచరుఁడైన విష్ణు
నర్చావతారుని నారంగధాముఁ
గోరుటయెట్లు నీకోరినయట్ల
కూరిమితోడఁ జేకూర్చుటయెట్లు
లిలలోనఁ బసిబిడ్డ లెఱుఁగమిఁ బిలిచి
యల చందమామ వెన్నడిగిన ట్లయ్యె
నని విచారము సేయునపుడు విశ్వాధిఁ
గనకాద్రి నీలశృంగము వోల్చినట్లు
పసిఁడిరెక్కల తేజిపై నెక్కి రంగ
వసుధేశుఁ డఖిలదేవత లెల్లఁ గొలువ
నరుదెంచి ప్రత్యక్షమై రాజుఁ బిలిచి
కరమర్థిఁ బద్మినీకన్య నిమ్మనిన
జననాథుఁడెంతె విస్మయమంది రంగ
జననాథు పాదకంజముల మైవ్రాలి
రంగ! పక్షీంద్రతురంగ! వేదాంత
రంగ! సత్కరుణాంతరంగ! యభంగ!

కౌతుకంబున నేఁడుగాఁ గృతార్థుఁడ
నైతి ధన్యుఁడ నైతి ననఘుండ నైతి
ననుచు సంతోషబాష్పాంబుపూరములు
కనుదోయి నుప్పొంగి కడలుకొనంగ
వినుతులు మఱియు వేవేలు గావించి
ఘనతమైనీడల్లఁ గైసేయఁ బనిచి
నరసురాసుర యక్షనాగకిన్నరులు
వెఱఁగంద శ్రీరంగవిభునకుఁ బ్రేమ
ననుపమలగ్నంబు నందులో నైక
జనని నాపద్మినీ జలజాతనేత్రి
వరవైభవముల నుద్వాహంబుసేసి
యరణంబుగా నప్పు డాసతీమణికి
పిరిమించు పసిఁడిఁ జేసినతండులములు
వరుసనుస్నాట యర్ఘ్యాదిగలంబులును
అనిశంబు నారతు లర్పించి పెక్కు
వనజేక్షణలఁ బెక్కువాహనంబులను
అసదృశరత్నధనాదివస్తువులు
నొసఁగి తక్కినయట్టి యుచితము ల్సలిపి
రమణీయగోపురప్రాసాదమంట
పము లనేకములు చొప్పడమానికములఁ

గట్టించి శ్రీరంగఘనునకుఁ దనదు
పట్టికి సకలసంపదలు నర్పించి
పరమవిజ్ఞానసంపదఁ జెంది భక్తి
పరతఁ దత్వాదతాత్పర్యుఁ డైయుండెఁ
బరమమైయొప్పు నీపద్మినీకన్య
చరితంబు ధరలోన జను లెవ్వరేని
వినిన వ్రాసినఁ జదివినఁ బేరుకొన్న
నెనలేనివేడ్క నభీష్టంబు లొందవు
ననుపమం బగు నమ్మహానగరమున
వనజాతనేత్రు శ్రీవత్సాంశ మెంతె
పరిచరవైష్ణవకులపాథోధిశశి
రుచినాఁగ కార్తికరోహిణీతార
జనియించి కవియోగి సన్నుతుం డగుచు
ననఘుఁ డై తిరుపాణుఁ డనుపేరుగలిగి
యుదయ మొందిననాఁటనుండి రంగేశు
పదచింతనామృతపానంబు సేసి
తలఁపులోఁ బ్రకృతిరోదనము నోదనము
సలుపక కొలుపక జలజాక్షుభక్తి
సరవిధారకముఁ బోషకమునుగాఁగఁ
బరమయోగానంద భరితుఁ డైయుండె

లాలితసకలకళావేత్తయయ్యె
నాళీకకుక్షి గానవిలోలుఁ డగుచు
వేణునాదముసల్పు వెన్నుఁడో యనఁగ
వీణాప్రవీణుఁడై వీణచేఁబూని
యరుదెంచి నిచ్చలు నారంగభూమి
హారిదివ్యమూర్తిగా నాత్మభావించి
యావీడు దొరికక రాదని తలపోసి
కావేరిదక్షిణాంగణసీమయందు
నలరంగ విభునకు నభిముఖంబుగను
నిలిచి తత్పదభక్తి నిరతిఁ బెంపొంది
తలఁపు నెత్తమ్మిలోఁ ద ద్దివ్యమూర్తి
బలుకుఁ దద్గుణదివ్యభవ్యకీర్తనము
నిలిపి హస్తములఁ వీణియఁ గీలుకొలిపి
కలయంగఁ దంత్రులొక్కటఁ బాదుపఱచి
కొనవేల శ్రుతి తంత్రి గూడంగ మీటి
మునుమంద్రమధ్యమము లుదారకమును
నిరవొందఁ జూపి పూరాయిత మొసరించి
స్వరలయగ్రామమూర్ఛల సంచు లెఱిఁగి
స్ఫురితకంపిత ముఖ్యముల బాగు లెసఁగ
వరరసరీతి భావములు చొప్పడఁగ

ఘనశుద్ధమును సాళగమును సంకీర్ణ
మును తేటపడ జగన్మోహనం బొదవ
వీనులవిందుగా వింతగా సామ
గానలోలున కెంతె కర్ణామృతముగ
సతతంబు నీగతి సవరించియుదనుకఁ
బ్రతిలేనికూర్మి విపంచిమీటుచును
ఎడపడకుండఁ బెక్కేండ్లు లీగతిని
గడిపోనికూర్మి కైంకర్యంబుసేయ
నామహాయోగిగానామృతంబునకు
శ్రీమానినీయోగి శ్రీరంగవిభుఁడు
చిత్తంబులోన రంజిలి పద్మమోము
నెత్తమ్మి మిగులనూనిన ప్రేమఁ జూచి
నంటున నయ్యోగినాథుగానంబు
వింటివే వీనులవిందు లయ్యెడిని
అమితమై నాకు న య్యమరులు గ్రోలు
నమృతంబుకంటె మోహనము చూపెడును
అన విని శ్రీదేవి యంబుజోదరుని
గనుఁగొని హస్తపంకజములు మోడ్చి
దేవ! తావకదయాదృష్టిఁ జెన్నొంది
భావింప నీప్రాణపద మైనవాని

బరిపూర్ణమైనసీ పదపద్మభక్తిఁ
బెరసిదేవరకింత ప్రియుఁడైనవాని
బరునిసంగతి వెలుపలనుంప? దగునె
పరమాపుగాఁగఁ జేపట్టి నీకరుణఁ
దిలకింప నికటవర్తిని జేసికొనఁగ
వలయునాప్రోఁడు రమావరుఁడు మోదించి
యనిశంబుఁ దనకుఁ దోయంబు లర్పించు
జననుతుం డగులోకసారంగమౌని
కలితగంగాతరంగముల నెన్నడుమఁ
బొలుపొందుచున్న పుష్పాడిచాళు లనఁగ
ధవళోర్ధ్వపుండ్ర మధ్యముల శ్రీచూర్ణ
మవిదలరేఖ లై యనుగొందుచుండ
నిగనిగ మనుచు వెన్నెలసోగ చెలువుఁ
దెగడు ధోవతులెంతె తేజరిల్లఁగను
జిలుగు వెన్నెలలమించిన జన్నిదములు
వలనొప్పతిరుమణి వడము లింపొంద
రాజిల్లు శంఖచక్రములు నామంబు
తేజరిల్లఁగ యోరదిద్దినయట్టి
పుత్తడిబిందె మూఁపునఁ జేర్చికొనుచు
నత్తఱిఁ గావేరి కరుదెంచి డిగ్గి

తొలకించు నొక కొన్నితోయము ల్నించి
వలిపెంపుఁబావడ వాసెనంగట్టి
పొలుపొందఁగా శిరమునఁ బొందుపఱచి
పలుమరులోఁగుచుఁ బదములెన్నుచును
గరమువేడుక సుధాకలశంబుఁ దెచ్చు
గరుడుఁడోయనఁగఁ బ్రకాశించి చెంత
ధవళాతపత్ర సంతతి సందడింప
వివిధవాద్యములు వేర్వేర ఘూర్ణిలఁగ
మదకరు ల్గొలువఁ జామరములు వీవఁ
ద్రిదశేంద్రముఖ్యు లెంతే సన్నుతింప
నెమ్మిమై నగరిలోనికి నేగుదెంచి
క్రొమ్మించు లన హేమకుంభంబుఁదెచ్చి
తనదుముంగలినిడఁ దద్దయుఁ బ్రీతిఁ
గనుఁగొని శ్రీరంగకాంతుఁ డిట్లనియె
నాసద్గుణములు వీణను దెల్పికొనుచు
నాసీరుఁ డైన గాయకసార్వభౌము
నలవాని వేగ నీయంసంబునందు
నెలమిమై నిడికొని యిటకుఁ దెమ్మనిన
శ్రీరంగవిభుమాట చెవిసోఁకి లోక
సారంగముని మానసమున నుప్పొంగి

కమలజాదులకునుం గనరానియట్టి
కమలలోచనుఁ డొంకె కరుణించె నితని
జెదర కమ్మానిం(డ్రమఁ జెందు భాగ్యంబు
తుదినెన్న నారదాదులకైనఁ గలదె?
యనుచుఁ గవేరకన్యక దాఁటి చేరఁ
జనుదెంచి యాలోకసారంగమౌని
తనుబట్టఁ గమకించు తలఁపు డెందమునఁ
గనియుఁ గాననివానిగతిఁ జక్కనిలిచి
(గక్కునం దనుబట్టఁ గదిసినం జూచి
యెక్కడ వచ్చెద వెఱుఁగవే నన్ను
రాకు రాకు మటంచు రయమునఁ గదలఁ
బోకు పోకు మటంచుఁ బొంచిపోనీక
బలువిడివడిఁ గూడ బరతెంచి యతని
జల పట్టిపట్టి భుజంబుమీఁదటను
ఎక్కించుకొనుచు రంగేశు సన్నిధికి
మక్కువఁ దోతేర మౌనివాహుండు
చేరంగ నేగి రాజీవా(స్త్రగురుని
(శ్రీరంగనాథుని సేవించి పొంగి
యమలుఁడై యాదినాయకుఁడైన నన్నుఁ
దమదాసులకు దాసుఁ బగఁజేసి రంగ

రమణుఁ డౌ వేంకటబ్రహ్మావేశుపాద
కమలముల్ నాకన్నుఁగవ నెలకొనియె
నలఘుప్రసన్నుఁడై యఖిలలోకములు
గొలిచి దైత్యుల గాడకులముల నఱికి
కౌతుకంబున నొప్పు కాకుస్థతిలకుఁ
బీతాంబరంబుసం బెరసె నాతలఁపు
చక్కని వేంకటేశ్వరు బ్రహ్మఁ గన్న
పొక్కిలి యరసంజపొలుపు లగ్గార్చి
సిరిమించు నొయ్యారి చెంగావివలువఁ
బఱికింప నాప్రాణపద మై తనర్చె
బవరాన లంకాధిపతిపదితలలు
తివుట నొక్కమ్మునఁ ద్రెళ్ళంగఁ జేసి
మధుపానమధుమత్తమధుకరజాల
మధురనాదంబుల మాఁ నగ్గలించి
మొనసిన పెనుదేఁటిమూఁకల మొగలు
లనియాడునమ్మాల యలరంగ భూమి
నుల్లసించిన దేవు నుదరబంధంబు
నుల్లంబులోన నా కుల్లసిల్లెడిని
మున్నింటిఘోరాఘముల వేరుఁ ద్రెవ్వ
నన్నింటఁ దనకృపయనుకత్తిఁ దఱిగి

తనవానిఁ జేసి నాతలఁపులో నిలిచి
తనరారు శ్రీరంగధారుణీనాథు
సిరులు దేరుచున్న శ్రీవత్సతలము
కరమర్థి నను బంటుగాఁగఁ గైకొనియె
హారు బ్రహ్మహత్యవాయఁగఁ జేయురంగ
వరు నజాడంబులు వడిద్రిమ్మంగుచుండు
కమనీయకరమైన గళము నన్నిపుడు
ప్రమద మెలర్పంగ బంటుగా నేలె
ధగధగం దళుకొత్తుదరము చక్రంబు
నొగిఁబూని శేషుపై నొప్పురంగేశు
నిగనిగ మనుచుఁ దేనియసోనఁ గురియు
చిగురుకొమ్మోవికిఁ జిక్కె నాతలఁపు
గండుదుమ్మెదలతోఁ గనుపట్టు వికచ
పుండరీకములసొంపులు దువాళింపఁ
దెలుపులై నలుపులై తేటకెంజాయ
లోలయంగ నొప్పు నీయురగేంద్రశాయి.
కన్నుదామరలవికాస మెంతయును
నన్ను నీవేళ మిన్నక డక్కఁగొనియె
ఘనజగత్త్రియమును గడుపులో నునిచి.
తనర నొక్కట వటదళశాయియైన

యీరంగనాథుని నిందిరతోడ
హారజాలంబుల నలరు నెమ్మేను
ఎట్టిచిత్రమొ కాని యిట్టె నాతలఁపు
గట్టిగాఁ దనసొమ్ముగాఁ జేసికొనియె
నవనీతచోరుండు నామనోహరుఁడు
నవిరళశుభమూర్తి యగు రంగశాయిఁ
గనుఁగొన్న యీతనకనుదోయి యొండు
గనకుండుఁ గా కనుక్రమము దీపింప
దానవారాతిడెందముఁ బ్రవేశించి
లీనమై తొంటిపోలిక నుండె నతఁడు
హితమతి మునియాన మెక్కినకతన
నుతికెక్కె మునివాహనుం డనుపేర
ఘనభక్తి నీయోగికథ యెవ్వరేని
వినిన వ్రాసినఁ* జదివిన నుతించినను
నిచ్చ బొంగుచు నిందిరేశుండు సిరికి
నిచ్చిన చన విచ్చు నెడపక యనుచు
నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికి

సంకీర్తంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యసుతాళ్వారాన్వయార్య
తనయ తిమ్మార్యనందన రత్నశుంభ
దనుపమశ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధసరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగివిలాసకృతిని
యతులితం బగు తృతీయాశ్వాస మయ్యె.

---

# పరమయోగివిలాసము.

## చతుర్థాశ్వాసము.

హైమనసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
మునిశాలికాసారముఖ్యభక్తాళి
వనమాలి! యనఘామువరదానశీలి!
భావించి మన్నిటిపడ తూలంకోనఁ
గావేరిసరి యెన్నఁ గావేరి*యనఁగ
దీపించుపుణ్యనదీమణిచెంతఁ
జూంపట్టు శుభలీలఁ జోళదేశమున
నలరు మండంగుడి యనుపేరు గలిగి
జలజాత†జాతుని జలజాక్షి యజితి
యగ్రహారంబన ననుంగొంది యున్న
యగ్రహారంబొప్పు నమితసంపదల
నాసురరిపుచరణాసక్తు లైన
భూసురవర్యు లెప్పుడు నప్పురమున

---

*యనుచు †వాసిని

నఖిలాగమజ్ఞులు నసఘులు నూర్ధ్వ
శిఖులు నిజాశ్రమోచితకృత్యపరులు
నై సప్తశతసంఖ్య నలరియుండుదురు
వీసమంతకునైన విధి లెక్కగొనరు
అందునఁ గలిదోషహరణంబు సేయ
నిందిరాసఖుఁడైన హేమాంబరుండు
లోకరక్షణవృత్తిఁ గోలప్రతిజ్ఞఁ
జేకొని నిరతంబుఁ జెన్నొందియుండు
ననిశంబు యోగభోగాసక్తి నచట
ననిమిషుల్ సమటుంబులై వసింపుదురు
తమచతురాననత్వముఁ బోల దనుచుఁ
దమిఁ జతురాననత్వము నడ్డఁగొనరు
తృణముగా మేరువుఁ దిట్టంగఁగలరు
తృణము మేరువుగాఁగ దీపింపఁగలరు
చలన మొందనియట్టిచక్రిసంసక్తి
*గలిగి యద్విజనాయకత్వము నొంది
యొప్పును రెల్లప్పు డుర్వీసురేంద్రు
లప్పురి నాపావనాత్ములలోన
సకలవేదాంతవిశారదుం డైన
యొకవిప్రవరుకాంతయుదరంబునందు

---

*గలిగియు

జిష్ణుతారను మార్గశీర్షంబునందు
వైష్ణవాన్వయభవ్యవనధిచంద్రుండు
వనమాలికామోదవహమైనయట్టి
వనమాలికాంశంబు వచ్చి జన్మించి
ధారుణిమైన సాధారణవిప్రి
నారాయణుండను నామంబుఁ దాల్చి
జననిగర్భములోనె సకలంబు నెఱిఁగి
జననుతుం డగు పరాశరమౌని వోలె
మాతగర్భములోనె *మహిమతో లోక
మాతనెమ్మోముదామర తేఁటులైన
యారంగపతికరుణాపాంగతతులఁ
జేరంగఁ గలుగుటఁ జేసి భాసిల్లి
సర్వసర్వంసహాచక్రంబులోన
సర్వజ్ఞమూర్తినా జరగి నానాఁటఁ
బెరుఁగుచునుండెను పిన్నప్రాయమున
నరసి గురుండు నిజాగమోక్తమున
నయమార్గమున మౌనినాళీకవిష్ణు
నయనంబునకు నుపనయంబు సేసి
వనజాక్షుతో నొప్పు వసుదేవుకరణి
ఘనమోద మాత్మలోఁ గడలొత్తనుండె

*మమత

వెనుకొని తనలోన విజ్ఞానలతిక
ననలొత్త శ్రీవిప్రనారాయణుండు
కంసారిపాదపంకజభక్తిఁ జెంది
సంసారసారం బసారం బటంచు
శ్రీరంగపతిసేవ సేయుచుఁ గన్ను
లారంగ నతనిసోయగముఁ గన్గొనుచు
నతనికింకరులతో ననిశంబుఁ గూడి
యతనికైంకర్యంబు లాత్మఁ గోరుచును
గరిమవైష్ణవగృహాంగణముల ముక్తి
కరవృత్తి యగు మాధుకరవృత్తిఁ జెంది
ఘననీలతనునకే కైంకర్య మిష్ట
మని యెంచి యొకయుపాయముఁ గాంచి యతఁడు
శ్రీరంగధాముపశ్చిమభాగసీమఁ
జేరువఁ గావేరిచెంత నెల్లపుడు
నలరుచు శ్రీమకుటాంతరీపాఖ్య
గలిగినయొకదీవి గాంచి యచ్చోట
నుద్యాన మొక్కటి యొనరింతు ననుచు
నుద్యుక్తుఁ డగుచు నయ్యుర్వీభాగమునఁ
జిల్లరములు చెట్టుచేమలు నఱకి
కల్లగా వైచి నల్లడఁ బాదుపఱచి

నినుపుగాఁ గావేరినీరుగా రేమునఁ
దనివార నెత్తి యంతట *జేడవెట్టి
యులిపచ్చియైయుండ నొక్కయింతయూరి
పలకెక్కి గుగ్గిలపదునుగా నిచ్చి
పరువడి గుద్దలిపార సొంపార
నిరుచాలువడఁ ద్రిప్పి యిరువాటు నైవి
కాలువ లొనరించి గనిమలు దీర్చి
చాలేర్పరించి యాంచాయ నంతంతఁ
బాదులు సవరించి పైరులు పావి
†పోదులు నోరవి నేర్పున నాటుకొలిపి
యామొడ నీరాన నలరుపూబొదల
డాయఁ జెంగల్వమోడులు పొందుపఱచి
కాపాడి గూఱలుగట్టి నైత్యంబు
పైపైనఁ గావింపఁ బ్రబలి నానాఁటఁ
బొన్నలు బొగడలు బొండుమల్లియలు
గన్నేరుల్ కలుగొట్టు కాంచనంబులును
మల్లెలు కురువేరు మరువంబు పచ్చ
మొల్లలు నారదంబులు గొజ్జగులును
బారిజాతములు సంపంగులు తులసి
గోరంటలును గేతకులు నశోకములు

---

* జాడ †పాదులనెఱిఁగి.

మొదలైనభూరుహంబులు పుష్పలతలు
పదివేలతెరఁగులఁ బ్రబలిచూపట్టి
యొక్కటై వడి *లాకలాంత్రి తలిర్చి
పక్కొమ్మలిడి పాదుపడి చెట్టుగట్టి
యలరుచు నొకటి సహస్రమై పెరిఁగి
చలిమింటి శాఖోపశాఖలై నెగడి
వెడవెడ తూణంబు వెడలినయట్టి
వెడవిల్తుమిట్టల వింతలై యొప్ప
మొనచూపి ననలొత్తు మొగ్గులం దనరి
మినుకుదేఁటులతోడ మేనులు చేసి
యీనినగతి నాకు నిగురుబకొమ్మ
గానరాకుండ నల్లన విఱ్ఱవీఁగి
†వరిబుడ్లనాఁ గనవచ్చు బొమ్మనఁగ
నెరతావి దిక్కుల నిండి వాసింపఁ
గ్రిక్కిరియుచుఁ బుష్పగిరులచందమున
నొక్కెడం బూచె నయ్యుర్వీజతతులు
ఆమూనిశీతాంశుఁ డంతరంగమున
నామోదవార్ధి నోలాడి యంతటను
దనపెట్టుపెరులు తనకన్నులెదుట
ననిచెఁ గా యనుచు నానందించుననుమ

*లోక †వరలిపండ్లనంగ

సారెది మరందంబుసోనలు గురియు
సురపొన్ననీడ భాసురముగా నొకటి
సవరగా నడుమను జవికె గావించి
‡బవరిగా దట్టంపుఁబందిలి వెట్టి
యినుఁ డుదయించునయ్యెడ మేలుకాంచి
తనయనుష్ఠానంబుఁ దప్పక తీర్చి
మనుఁరాజ మైనట్టిమంత్రి మెన్నుచును
ఘనమైన పూవులకరడి గీలించి
యరిగి యవ్వనములో నందంద తిరిగి
యరవిరు లైయున్నయట్టిసూనములు
ననిచి గోమునమగింజ ననలొత్తుతులసి
దినదినంబును గోసి తెచ్చి వేశ్వాఱఁ
జినుగకుండఁగ నీరు చిలికించి తొలఁచి
పనుపడఁ గదళికాపత్త్రముల్ పఱచి
యందుమై వేశ్వాఱ నావిరు లునిచి
పొందుగా మునుమున్నె పోఁజినయట్టి
వార చెన్నార సన్నంబుగాఁ జీరి
చేరువఁ దా సుఖాసీనుఁడైయుండి
బొటవ్రేల దగ్గనిం బూవులు రెండు
నటన గీలించి లో నారఁ సంధించి

‡సవరణ పందిలిఁ జక్కగాఁ జేసి

తొడిమతోఁ దొడిమ పొందుపడంగఁ జుట్టి
మిడివేళ్ళ నందుపై మెఱుఁగుగా నైచి
యెడనెడం దులసి నయ్యెడ నరవిరులు
గడుసొంపుమీఱంగఁ గట్టి మాలికలు
బొందులు తావడంబులు వింతవింత
కందుకంబులు నొప్పుగా సవరించి
పూవులు సజ్జలోఁ బోసఁ గంగఁ బెట్టి
తావిపోవకయుండ దళముల మూసి
అది తనముందేల నమరియుండంగ
నదటున నుత్తరీయము ముసుంగిడుచు
*గనియరుపూచాయ గలసీరుకావి
గనుపట్టుశాటి మీఁగాళ్లతో నొరయ
వినుతిమై ద్రావిడవేదంబు చదివి
కొనుచు వైష్ణవు లెదుర్కొనినంతలోనె
యనుగుల వ్రాలి శ్రీహరిభక్తి మేన
వడియంగ నాయోగివరుఁ డేగుదెంచి
శ్రీరంగనగరంబు చేరంగవచ్చి
యారంగపతిఁ గన్నులారంగఁ జూచి
నుతియించి శౌరి మనోవీధి నిలిపి
యతనిదామోదరాహ్వయము సార్థముగ

*గనమరు

†నాపాదలంబులై యలర దామంబు
లాపంకజాక్షున కర్పించి భక్తి
దనరఁ దీర్థప్రసాదము లన్వయించి
ఘనతరనైష్ఠవాగారంబులందుఁ
గరము వేడుక మాధుకరముఁ గైకొనుచు
నగగున నిజనివాసం బైనయట్టి
తనచేయు నన్వనస్థలి కేగుదెంచి
తనరెడుపర్ణసద్మంబు సొత్తెంచి
యంతరంగమున రంగాధీశ్వరునకు
నంతట నలపవిత్రాన్న మర్పించి
భుజియించి కైంకర్యముల ప్రొద్దుఁ గడపి
రజనియు దినము నారామంబులోనె
కడపుచు నతని కైంకర్యంబు దినము
నెడపడకుండఁ దా నీరీతిఁ జేయఁ
బంకజభవుఁడును పాకశాసనుఁడు
శంకరాదులు నెంతె నవరించుపూజ
సామాన్య మనుచు మెచ్చనియట్టివేలు
పామానివరుపూజ కాత్మలో మెచ్చి
తనదులీలావినోదము చూపవలసి
యనుపమలావణ్యయచ్చర నోర్తుఁ

†నాపాదమాదిగాఁ నలర

దలఁప నేతెంచి పాదములకు నెఱఁగి
పలుమఱు వినుతించి పలుక నీక్షించి
సరసిజనేత్రుఁ డచ్చరతోడఁ బలికె
ధరణిఁ గావేరి కుత్తరభాగసీమ
విలసిల్లు వర్ణ్ణజవిఖ్యాతదేవ
నిలయ మొక్కటి యొప్పు నిఖిలసన్నుతము
భూదేవరాజాదిభూషితం బైన
యాదేవదేవునియాశ్రమాంతమునఁ
జతురనర్తకవంశజాతవై జగతి
నతిలోకసుందరి వై యుండు మింకఁ
గాతుకం బొకటి యేఁ గావింతు ననిన
నాతలోదరియుఁ దదాజ్ఞ పాటించి
యరిగి వర్ణ్ణజాహ్వాయమున నింపొందు
నరవిందనేత్రున కావాస మైన
పురమున నర్తకపుత్త్రియై పొడమె
మరుఁ డేర్చిపట్టినమార్గణం బనఁగఁ
దనదువర్ణాశ్రమధర్మముల్ చూపి
మునులవర్ణాశ్రమములు చూఱఁగొనుచు
జను లాత్మఁ జొక్కి మెచ్చంగ దేవదేవి
యనఁగ జగన్మోహనాంగియై పొదలె

నొఱపైన జడవిరహులవెన్నుతరటు
శౌఱనవ్వు వరభుజంగులగుండెదిగులు
కరములు పల్లవకంఠపాశములు
గురుకుచంబులు కాముకులరొమ్ముపసులు
కడతొడల్ పాంథులకట్టుకంబంబు
లడుగులు విటహృదయముల శల్యములు
ననఁగ బిటారిసోయగములతోడఁ
గనుపట్టుచుండునంగంబులు గలిగి
రతి కళాప్రౌఢి భారతి కళాప్రౌఢి
నతిశయింపుచు యౌవనారూఢ యగుచు
నొఱపులకుప్పయో యొప్పులగనియొ
మెఱుఁగులదిన్నయో మేలిమిచాలొ
నటనలదీమమో నయములప్రోవొ
బటువులపిండొ శోభనకదంబంబొ
యని లోకములు గొనియాడంగ మేన
ననలొత్తు నెరజవ్వనము *కైలువారఁ
బాటఁ దుంబురుని వాక్ప్రౌఢిమ వాణి
నాట రంభాదుల నణకించు మఱియు
నక్కజంబగు దానియందంబుఁ జూచి
చొక్కకుండుట యెట్లు సురనాథుఁ డైన

*దయివాఱ

దలఁప నేతెంచి పాదములకు నెఱఁగి
పలుమఱు వినుతించి పలుక నీక్షించి
సరసిజనేత్రుఁ డచ్చరతోడఁ బలికె
ధరణిఁ గావేరి కుత్తరభాగసీమ
విలసిల్లు వర్ణ్ణజవిఖ్యాతదేవ
నిలయ మొక్కటి యొప్పు నిఖిలసన్నుతము
భూదేవరాజాదిభూషితం బైన
యాదేవదేవునియాశ్రమాంతమునఁ
జతురనర్తకవంశజాతవై జగతి
నతిలోకసుందరి వై యుండు మింకఁ
గాతుకం బొకటి యేఁ గావింతు ననిన
నాతలోదరియుఁ దదాజ్ఞ వాటించి
యరిగి వర్ణ్ణజాహ్వాయమున నింపొందు
నరవిందనేత్రున కావాస మైన
పురమున నర్తకపుత్త్రియై పొడమె
మరుఁ డేర్చిపట్టినమార్గణం బనఁగఁ
దనదువర్ణ్ణాశ్రమధర్మముల్ చూపి
మునులవర్ణ్ణాశ్రమములు చూఱఁగొనుచు
జను లాత్మఁ జొక్కి మెచ్చఁగ దేవదేవి
యనఁగ జగన్మోహనాంగియై పొదలె

నెఱపైన జడవిరహులవెన్నుతరటు
కెఱనవ్వ వరభుజంగులగుండెదిగులు
కరములు పల్లవకంఠపాశములు
గురుకుచంబులు కాముకులరొమ్మువసులు
కడతొడల్ పాంథులకట్టుకంబంబు
లడుగులు విటహృదయముల శల్యములు
ననఁగ బిట్టారిసోయగములతోడఁ
గనుపట్టుచుండునంగంబులు గలిగి
రతి కళాప్రౌఢి భారతి కళాప్రౌఢి
నతిశయింపుచు యౌవనారూఢ యగుచు
నెఱపులకుప్పయో యొప్పులగనియొ
మెఱుఁగులదిన్నెయో మేలిమిచాలొ
నటనలదీమమో నయములప్రోవొ
బటువులపిండొ శోభనకదంబంబొ
యని లోకములు గొనియాడంగ మేన
ననలొత్త నెరజవ్వనము *కైలువారఁ
బాటఁ దుంబురుని వాక్ప్రౌఢిమ వాణి
నాట రంభాదుల నణఁకించు మఱియు
నక్కజంబగు దానియందంబుఁ జూచి
చొక్కకుండుట యెట్లు సురనాథుఁ డైన

*దయివాఱ

మలయుసొంపుల దానిమాటలు విన్న
వలవకుండుట యెట్లు వలరాయఁ డైన
దానిఁ బైకొనెనని తామరచూలి
యైన గౌరీనాథుఁ డైన లోఁ జిక్కి
లోఁగక తేనియలోఁ బడినట్టి
యీఁగలచందాన నెడఁబాయఁగలరె
యట్టిసొంపులు గల యలదేవదేవి
నెట్టనఁ దనవిద్యనేర్పులు నెఱపి
ధరలోన నొరులకుం దరములు గాని
సురతాణిచే *నిలు చూఱలుగొనుచు
నరసార్వభౌము నానందింపఁ జేసి
యురుదైనసగమురాజ్యంబుఁ గైకొనుచు
గరినాథుఁ జొక్కించి కటహకుంభీంద్ర
వరమణిభూషణావళులు గైకొనుచు
గౌళ నేపాళ బంగాళ పాంచాల
చోళేంద్రముఖుల రాజులఁ జొక్కఁజేసి
తనకు నై జంపుబందాయిలం జేసి
కొని లోకములు దన్నుఁ గొనియాడనుండి
యొకనాఁడు నిచుళేంద్రు నుర్వీశచంద్రు
నకలంకగుణధాముఁ డగు సార్వభౌముఁ

*నిట్లు

బోడఁగని తనదునేర్పులు పచారించి
యెడపక నతనిచే నీరానియీవిఁ
గైకొందు ననుచు నాకమలాయతాక్షి
జోకగాఁ గమ్మకస్తురినలుం గిడుచు
జాతిగొజ్జగినీట జలకంబు లాడి
రీతిగా నొకవింత రేఖ చూపట్ట
వలిపెచెంగావిపావడరం గొకింత
వెలిమించు నెరివట్టు వెలివట్టు గట్టి
జవ్వాదిపద నిచ్చి చంద్రకాంతంపు
దువ్వెనఁ గొమరార దువ్వి నెన్నడుమఁ
బాపట యొసపరిబాగుగాఁ దీర్చి
చూపట్టుకొ ప్పొకించుకజాఱఁ దురిమి
తెలిమించు నాణిముత్తెపుజేర్లతోడఁ
బొలుపొందుపచ్చలబొట్టొనరించి
విటులమన్మథుఁడేయు విరిమొగ్గతూపు
నటన గుమ్మడిగింజనామంబుఁ దీర్చి
బవరిముత్యములఁ జొప్పడి పూర్ణచంద్రు
రవణించు విమలతాటంకముల్ దాల్చి
మొగపుదీఁగెకు చెంత ముత్తెపుబలుకు
జిగిమీఱి మణులమించినతాళి వెట్టి

పుంజాలదండదాపున నేవళంబు
రంజిల్ల బణ్ణసరంబు గీలించి
ముంగైమురువుల కిమ్ములఁ గంకణముల
చెంగట ముత్యంపుఁజేకట్లు పూని
తళుకుమించినసందిదండలమీఁద
నెలవంకతాయెతుల్ నెరివుట్టఁ గట్టి
తిరుగుటుంగరముపూదియ లాన వామ
కరమున ముద్దుటుంగరము గీలించి
పడమటిపన్నిటఁ బద నిచ్చి చెంప
కడల కస్తూరిరేఖలువారఁ బూసి
పొలింపఁ దగుమొగపులతోడ దెసలు
డాలించుమణులయొడ్డాణంబుఁ బెట్టి
యొరయుకుచ్చిలమీఁద నొకయింత జాఱ
మురుపైనబిల్లలమొలనూ లమర్చి
మరునిపట్టంపుసామజనిగళంబు
కరణి శోభిల్ల డాకాల నంచలను
సింగారముగ మీఁలఁ జేర్చినమించు
బంగారుసరపణి బాగుగా నునిచి
గణికాశిరోమణి ఘనబిరుదాంక
మణినూపురము వింతమహిమగాఁ జేర్చి.

తనజోడుకోడె యై తనుఁ బాయలేని
తనయగ్రసంభవ తన మున్నె నడవ
నీడుజోడై తను *నెనకొల్పఁ జాలు
చేడియల్ తనుఁజుట్టి సేవించి నడువ
నిచుళకు నరిగి యానృపకులోత్తంసు
నిచుళేంద్రుఁ బొడఁగాంచి నేర్పున నపుడు
రాణించురాగవర్ణములతోఁగూడ
వీణానువిద్యాప్రవీణతఁ జూపి
తక్కినకళలయందలినేర్పు నెఱపి
సొక్కించి వలపులసోనఁ జిక్కించి
యారాజుచేత సప్తాంగంబుఁ గొనుచు
శ్రీరంగనగరంబుచెంతనే మగుడి
చనుచుండి చైత్రవైశాఖంబులందు
మినుకైన రోహిణీమృగశీర్షములను
మిక్కిలివేండ్రమై మెకములతలలు
వ్రక్కలౌఁ బొమ్మనువడి నెండఁ గాయ
గూడారములబండి గొల్లెనగొడుగు
నీడలలోనల్ల నిలువరాకుండ
వడచల్లునెరయెండ వాతెఱ లెండ
నిడుసోగకన్నుల నెరికెంపుచూప

* నెనలొల్పఁజాలు

విరిదేనియలు కమ్మివిరిమీఁదఁ బొదలు
కరణిఁ దేఁజెమట మొగంబుపైఁ బొడమ
నీమొడవడఁ దీర్ప నెలదోఁట యొకటి
యీయుండ లేదొకో యింతులారనుచుఁ
దలపోఁత సేయు నత్తఱిసొంపుమీఱ
నలరుదేనియ నోలలాడి యందంద
పూచినగొజ్జంగిపొదరింట్లు దూఱి
మేచినయలులకు నింపు పుట్టించి
తలిరుజొంపములనెత్తములమై వెడలి
కొలకొలకొలకులఁ గేడించికొనుచుఁ
గలువల నోరసి చెంగల్వలఁ జెనఁకి
చలిమీఱి తొవలతోఁ జయ్యాటమాడి
వనజపంక్తులమీఁద వడిఁ బల్లటీలు
కొనుచుఁ గుందములమై గునిసియాడుచును
ననసోనగురియుపొన్నలనీడ వెడలి
గొనబుమించినకేతకుల దండవట్టి
ననతివేగమి నట్టినడిచాయఁ జొచ్చి
కనుపట్టుపన్నీటికాలువ దాఁటి
మగుడి గందంపుఁగొమ్మలతోడఁ గలిసి
పొగడపుప్పొడి గందపొడిఁ దొప్పదోఁగి

నారాయణునికరుణాదృష్టి వోలెఁ
జారుసౌరభశైత్య సౌభాగ్య మొదవ
వలరాజు గురుఁడు నీవలకులోఁ జేయఁ
గలవాని నిచ్చోటఁ గంటి రమ్మనుచు
నద నెన్ని తనుఁ బిల్వనంపినకీతిఁ
గొదమతెమ్మెర లెదుర్కొన సేదదేరి
యాదేవదేవి తదామోదమునకు
మోదించి పరిమళములజాడ నరిగి
నాగ చాంపేయ పున్నాగ జంబీర
పూగ కేసర కుంద పూగ మందార
సాల నారంగ రసాల బంధూక
కోల కుద్దాల తక్కోల ఖర్జూర
కరకచందనసుభాకరకదంబాది
ధరణీజములతోడఁ దనరుచు నెదుట
నందనవనముచందంబు పులస్త్య
నందనవనముచందంబు గేలించు
సౌరభంబుల విందు సలుపు శ్రీవిప్ర
నారాయణోపవనంబు డాయంగ
నరుదెంచి పూదేనియలకాల్వ బాఁటి
విఱివాడినత్తంబువెడచాయ వెడలి

మలగొన్న సంపంగిమ్రాకులు గడచి
చలిమించు పుష్పమంజరుల వీడ్కొనుచుఁ
బొదలినగొజ్జంగిపొదరిండ్లు దూరి
ముదమున వనమధ్యమునకు నేతెంచి
పన్నీటియేఱవముకప్రియుమీఁదిచలువ
వెన్నెలలో సీతు వెడనవ్వికొనుచు
మట్టమై తలిరుసొంపములలో నొక్క
పుట్టమై లో నెండ పొడవడకుండఁ
దలిరించి కడు నివతాళించు నొక్క
యెలమావికిందటి కేతెంచి నిలిచి
యాచల్లగాలియు నాతోఁటసొబగు
చూచి హా యని సొక్కుచును దేవదేవి
యనుఁగుఁజేడియ లెల్ల నందంద కొలువఁ
దనయగ్రిజాత నత్తఱిఁ జూచి పలికె
నోయక్క కంటివే యొకయొంతవింత
యీ మెడ విరహులయెదలు బిట్టగల
జలజాస్త్రుఁ డడిదముల్ జళిపించినట్లు
చిలుపగాలికి మావిచిగురు లల్లాడె
నమలనానాప్రసూనాఘ్ర్యసంతతుల
రమణీయవివిధమరందపాద్యములఁ

దలకొన్న భృంగనాదస్వాగతముల
నెలమివాటిల మన కీపాదపంబు
లాతిథ్య మొసఁగెడి నదె చూడఁ గదవె
యోతలోదరి యింక నొకవింత వినవె
పంకజాస్త్రునివెన్ను బలమైనవిరుల
సుంకులు రాలు నీసోమరిగాలి
చుట్టాలసురభియై సురభిసంతతుల
నెట్టనఁ గొనివచ్చి నేఁ డిచ్చె మనకు
నవపల్లవోష్ఠి సూనవిరళహాస
పరివిమలపుష్పపరాగాంగరాగ
కలకంఠనాద సంకలితాబ్జవదన
యలికులనిభవేణి యగువనలక్ష్మి
మనలపై నెంతప్రేమను సేసె నిపుడు
వనములో మనయొండవడయెల్లఁ దీర్చె
నని పలుకుచు నున్న యాదేవదేవిఁ
గనుఁగొని పలికె నగ్రిజ నేర్పు మెఱసి
సారంగముఖపక్షిసమితి వేఁటాడి
శ్రీరంగవిభుఁడు విచ్చేయునవ్వేళ
నతని సేదలుదేర్చు నారామమునకు
నతులితం బగుజగదభిరామమునకు

మనబడలిక లెంత మన మన నెంత
యని తనతోడ నిట్లన దేవదేవి
తమకుఁ జేరువఁ దపోధామవిస్ఫూర్తిఁ
గమలాప్తబింబంబుగతి నొప్పువాని
బాలేందుచాయలఁ బదిరెండువగల
డాలించునూర్ధ్వపుండ్రంబులవాని
గాత్రంబుమై నొప్పుగలుగువైడూర్య
సూత్రంబుగతి బ్రహ్మసూత్రంబువాని
నొప్పుచందురుని రాహువు డాసినట్లు
కప్పరు నిడువాలుగడ్డంబువాని
మొలకొత్తుముత్తెంపుమోసులకరణిఁ
దళుకొత్తుసుభ్రదంతంబులవానిఁ
దవిలి మల్లియచాలుతావికై కదిసి
బవరిఁ జుట్టినయట్టిభ్రమరాళికరణి
సవరనితులసిపూసలదండతోడఁ
గవగూడి హరినీలకాంతి గేలించు
తమ్మిపూసలపేరు తనకు నైజంపు
సొమ్ముగా సవరించి చూపట్టువాని
నదనగా వేరితోయంబులఁ గాల్వ
మొదలబంటిని మునిచి మునిచి పోయుచును

దడయక వచ్చి గుద్దలిఁ గొనితొంటి
మడవ మార్చుచు మాఱుమడవఁ దీర్చుచును
ద్రవ్వంగవలయుచోఁ ద్రవ్వి యందంద
పువ్వుఁజెట్టులకెల్ల బ్రోదిసేయుచును
ఆరామకృత్యంబు లాచరింపుచును
జీవికిం దము లెక్కసేయనివాని
శౌరికైంకర్యసంసక్తు శ్రీవిప్ర
నారాయణునిఁ గాంచి నగుచు నిట్లనియె
నక్కక్క చూడవె యలవాఁడు మనల
దిక్కుఁ గన్గొన డెంత తెంపరిఁ వీఁడు
మీఱుజవ్వనము క్రొమ్మీసిమింతో నిల్పు
నూఱుబండెడిని గన్నులఁదన్నుఁజూడ
డాగి యతీశ్వరుపోల్కి నుట్టులతోడఁ
డెగఁగోసికొన్నాఁడొ తెగువతో మున్నె
నలినశరుండైన నన్నుఁ జూచెనేని
నిలువునఁ గరఁగడే నీరుచందమున
నిటవచ్చి మనము దా నెంత సేపాయెఁ
గటకటా! యొకమాటు కన్నులఁ జూచి
యెందుండి వచ్చితి రేమని యనఁడు
మందుఁడో జడుఁడో సోమరియొ హెగ్గడియొ

యన విని శ్రీరామయని కేలు చెవుల
నొనరంగ సవరించి యోసి పో వినవె
వీరివారలఁ బల్కువిధమునఁ బెద్ద
వారల ని ట్లనవచ్చునే నీకు
మందుండు:జడుఁడు సోమరియు హెగ్గడీయు
నిం దుండునే? యున్న నిట్టి తేజంబు
గలుగునె? కమలసంగముఁ గోరు తేఁటి
యిలలోన నుమ్మెత్త కేల యాసించు
రంగేశకైంకర్యరతుఁ డైనయాతఁ
డంగనారతిఁ గోరునా యెందునైన
నని పలుకు మనున్నయక్కతో మగుడ
ననియె గద్దించుచు నాదేవదేవి
గాలియే కుడుపుగాఁ గైకొని కాలు
నేలమోపక సూది నిలిచియున్నట్టి
శాండిల్యుఁ డలపరాశరుఁడు కౌశికుఁడు
నుండిరే యింతుల నొనఁగూడఁ కిలను
ఉప్పు నీరును జొచ్చియున్నట్టిమనుజుఁ
డప్పరో లోనుగా కతఁ డేల యుండుఁ
గలవి లేనివి కొన్ని గడియించి వట్టి
బలిమి చూపుచు లేనిపౌరుషం బెన్ని

కోనల కెక్కించెదు గోంచిబాపనిని
అనుడుం గోపించి యిట్లనియె సోదరికి
సోదరీ! వినవె యీయోగినాయకుని
నీదైనరూపంబు నెఱపి చొక్కించి
వలపులు పచరించి వలపించి తేని
దొలంగక నేను నీతొత్తు నయ్యెదను
అనుమాట లాలించి యాదేవదేవి
యనియె సంతసమున నాయక్కతోడ
మఱవకే యీమాట మఱవకే నీవు
మఱచిన నేనేల మఱవనిచ్చెదను
అలివేణి నానేర్పు లన్నియుం జూపి
వలపించి పీని నావలలకు లోను
జేసెద నారీతిం జేయకయున్న
దాసి నయ్యెద నీకుం దరళాక్షి యనుచు
నెనుంగుజేడియలతో నగ్రజం బురికిం
బనిచి తా నొకపాదపమునీడ నిలిచి
తొలుతం బెట్టినయట్టితొడవులుం బట్టు
వలువయు సడలించి వనములో నొక్క-
యేకాంతమైయున్నయెడ డాంచి యప్పు
డాకాంత యొకయుపాయము విచారించి

గన్నేరుపూచాయ గల నీరుకావి
వన్నియపుట్టంబు వమలుగాఁ గట్టి
మిడుగుల నొరయ నామీఁదఁ బింజయల
మడిచారుచెరివియామై నేర్పుఁ జోడ
బిగిచన్నుఁగవమీఁదఁ బెరయఁ బయ్యెదయు
దిగిచి నెన్నడుమున దిండుగాఁ జుట్టి
నడిముక్కు నెరయంగ నామంబు వెట్టి
నడుమ హారిద్రచూర్ణపు రేఖఁ దీర్చి
వరుసగాఁ దిరుమణివడములు వైచి
పరమవైష్ణవ ముట్టిపడఁగఁ జూపట్టి
వైకుంఠపురినుండి వచ్చెనో యనఁగఁ
గాక వైరాగ్య మీఁగతి నిల్చె ననఁగఁ
జని తోఁటలో నున్న జగతీసురేంద్రుఁ
గని యాననము వంచి కరములు మోడ్చి
కొమకుచు నొదుగుచు గోలచందమునఁ
బదము లెంతయుఁ దొట్రుపడఁగ నందంద
నిలిచి భ్రమాకులపొంత నిక్కంపుభయము
గలిగినదానిసంగతి వడఁకుచును
దోరంపుఁగన్నులఁ దొరఁగెడుబాష్ప
ధారలు చెక్కుటద్దములమై నిగుడ

నెదురేగునప్పాసి కెదురేగి యతని
పదపంకజములపైఁ బడి దైన్యపడుచుఁ
దొడిబడ రెండుచేతులఁ బదాబ్జములు
విడువక వడి వెక్కి వెక్కి యేడ్చుచును
నర్తకీగ్రామణి నలిఁ గ్రుక్కి గ్రుక్కి
యార్తి రెట్టింపంగ నాయోగి కనియె
నోయార్తరక్షక! యోకృపాచంద్ర!
యోయామునిగురునాథ! యోమునినాథ!
రంగనాయకపాదరాజీవలోల
భృంగ! యభంగనిర్జితదోషకరణ!
పాథోధికన్యకాపతిభక్త! యోగి
నాథ! యనాథను నను గావు మనుచు
మాటిమాటికిఁ బల్కు మట మాయలాఁడి
మాటలు నిజమని మది విచారించి
కరుణాపయోరాశి గాన నయ్యోగి
తరుణి లే లెమ్మని తనకేల నెత్తి
యెందుండివచ్చితి వేడి నీనామ
మిందుబింబానన యేకారణమున
నిటకువచ్చితివి నా కెఱిఁగింపు మనినఁ
దటుకునఁ బాణిపద్మంబుల మొగిచి

యీతఁడే జిక్కెఁ బో యితఁ డంచుఁ జుప్ప
నాతికై వడి యెలనాతి యిట్లనియె
నేమని మీతోడ నే విన్నవింతు
నేమని నానామ మిపుడు సెప్పెదను
ఐనను మీయాజ్ఞ యది మీఱరాదు
గాన నావచ్చినక్రమ మేర్పరింతుఁ
బోడిమి నిలఁ బుట్టుపుట్టువులందు
నాఁడుపుట్టువు హీన మందులోపలను
గంజనందనుఁ డతికష్టమైనట్టి
లంజపుట్టువున నీలాగున నన్నుఁ
బుట్టించె నారోఁతపుట్టువఁ బుట్టి
యట్టె నే గడియించు నతిహీనధనము
తనతల్లి దాఁచి యాధనమెల్ల పిసిఁడి
తనమున నిలదేవతలకు విప్రులకుఁ
జీమంత యిడక తెచ్చినకాసు లెల్ల
వేమాఱు డాపంగ వేసరి యేను
బడయంగవచ్చు నాపసి డిచే నేమి
పడయంగవచ్చు వెంబరవిత్త! యనుచు
రోసి యాతల్లిదండ్రులపొందు వీడఁ
గోసి చంచలకామగుణకవాటంబు

మూసి నీపదపద్మములు వచ్చి డాసి
దాసి నయ్యెద నని తలపోసి యిపుడు
పనివిని మానీంద్ర! భవదీయపాద
వనజముల్ శరణని వచ్చితి నేను
నెరవుగాఁ దలఁపులో నిడక వేవేగఁ
గరుణించి యొకయూడిగంబుఁ గల్పించి
పనిగొను మింక నీపంచనే కాచి
కొని యువ్వనముఁ గాచికొను చుండెదను
భర్తవు సకలసంపదలకు నాత్మ
కర్తవు నీవ యోకరుణాంబురాశి!
యన విని మోదించి యామాయలాఁడి
యనుమాట లెల్లఁ దథ్యము లేయటంచు
మానినాథుఁడు తనమదిలోన వార
మీనలోచన సధర్మిణిగా నెఱింగి
కనకచేలాంగుని కైంకర్యమునకు
ననుకూల మగుసహాయము గల్గె ననుచు
ననిశంబు నారామ నాగామమునకుఁ
బెనుపొందఁ గావలి వెట్టి తా నరిగి
యలరంగధాముఁ డంతంతఁ జిత్తమునఁ
నలరంగ దామంబు లర్పించి మగుడి

చనువెంచి తెచ్చు భైక్ష్యము మనోవీథిఁ
బనుపడ శ్రీరంగపతికి నర్పించి
మును దా భుజించి ప్రమోదంబుతోడఁ
దనప్రసాదము మెలంతకుఁ బ్రసాదించి
యగపడి కావేరియంబుపూరంబు
మొగవాళమునఁ గుంభమున ముంచి ముంచి
యెడపడకుండ నీరెత్త †నానీట
వడి మడమలు చిందు వందు గాకుండఁ
గుసుమమంజరులసోఁకున కోర్వలేని
కుసుమకోమలి వాడిగుద్దలిఁ బూని
నిడుదవాయిగఁ జేసి నీరు నిండార
మడవ గప్పుచు దండ మడవ విప్పుచును
దనసేయుసేద్య నంతయుఁ బరవంబు
కాని తానె సేయ నెక్కొను గూర్మితోడ
నీరీతి యోగీంద్రుఁ డింతితోఁ గూడ
నారామకృత్యంబు లాచరించుచును
నెలమిమైఁ బగలెల్ల నిట్లుండి రేయి
యెలనాఁగ యొకపాదరింటిలో నుండఁ
జనుదెంచి తనపర్ణశాలలోనుండి
దినదినంబును దేవదేవుని సేవ

† నానాఁట

యకలంకమానసుం డై చేసికొనుచు
నొకయేఁడు గడపె నయ్యువిదతోఁ గూడి
యంత నాకాంత యేకాంతంబునందుఁ
జింతించి తనలోన శ్రీరంగవిభుని
దూరి పూఁబోఁదరిల్లు దూరి డెందమునఁ
గూరిననగపుతోఁ గుందుచుఁ బలికె
నిచ్చోటికి కుండుండి యేల వచ్చితిని
వచ్చితింబో యిటువంటిగొంటరిని
గనుఁగొంటి నేలకో కనుఁగొన్నతోవఁ
జనక యీగతి కొనసాగనిపత్తిన
సేసితి నేలకో శ్రీరంగరంగ
నాసరివారిలో నగుబాటు గాఁగ
నని కనుమూయంగ నారంగవిభుఁడు
సనుదెంచి వెలవ కోసారంగనేత్రి
యెల్లి యీపాద్దున కెల్ల నీమనసుఁ
జల్లఁజేసెద నని చనిన మేల్కాంచి
యరుదంది డెందంబునందు సొంపంది
యరవిందసమనేత్రి యారాత్రిఁ గడపి
మఱునాఁడు వనములో మానితోఁ దొంటి
తెఱఁగునఁ గూడి వర్తింపుచున్నంత

గగనయాంత్రికుఁడు లాగపుబంతి డాఁచు
పగిది భానుఁడు గ్రుంకెఁ బశ్చిమాంబుధిని
తెర *నరమొఱఁగి నర్తింపుచునున్న
యరవిందనయనలయందంబు దోఁప
నెఱయ మించులతోడ నీరాళ్ళగొంది
మెఱచెం దళుక్కున మేఘంబు చెంతఁ
గాముకహృదయపుష్కరము నిండారఁ
గామాంధకారంబు గప్పినపగిది
గగన మొక్కింతయుఁ గానరాకుండ
మొగులు గార్క్రమ్ముచు ముంచె నల్గడల
ముంచి నల్గడ నల్లముసురుగాఁబట్టి
మించులతోఁగూడ మేళమై పొదలి
విటపాగ్రములు వెడవెడఁగ నల్లాడఁ
జిటిపొటిచినుకులుచినుక నవ్వేళ
నాకులమీఁద నీ రానక జాఱి
కోకమైఁ బడ వడంకుచు నోదుగుచును
నులికి యాపొదరింట నుండరాకున్నఁ
దలఁకుచు వెడలి యాతన్వంగి వంగి
బలుపువ్వుగుత్తులబరు వానలేక
నలపుష్పలత యసియాడుచందమునఁ

* మోరఁగి

జన్నుఁగొండలవ్రేఁగు సైరింపలేక
చిన్నారికౌఁదీఁగ జివ్వాడుచుండ
జవ్వులిఁ జూపట్టెడు శంపాళికేలి
దివియ లై తనమున్నె తెరువు చూపఁగను
గనుచూపుమించులు కారుమించులును
బెనఁగొన్నఁ దెలియక బెగడొందికొనుచు
తనకొప్పుమొగులునా దట్టంపుమొగులు
నెనసిన వివరించి యెఱుఁగంగలేక
యల్లనల్లన వచ్చి యామహాయోగి
వల్లభుసదనంబు వాకిటియెదుట
దళము లొండొంటితోఁ దార్కొని మిగుల
దళమైన యొకచలదళముక్రిందటికిఁ
జనుదెంచి మరుఖడ్గశాఖయుపోలెఁ
దనరుచు నామ్రాఁకిదండ నిల్చుటయు
వలిపిరిగాలితో వలి మీఁటి మీఁటి
బలువిడి వాన యంపాజాల మైన
యలజడిచేతఁ బాయనియీఁదగాలి
యలజడిచేతఁ దా నందంద వణఁకి
యే రావిక్రిందట నీరీతి నుండ
నేరా విచారింప విభరాజవరద !

యసి రంగవిభునకు నంతరంగమున
ననలోత్తుభక్తి సన్నతిఁ జేయుచున్న
నప్పు డాపర్ణశాలాంతరసీమ
నొప్పుచుం బవళించియున్న యాయోగి
యలవిమీఱిన యమ్మహావృష్టి యిపుడు
*వెలిచెనో వెలవదో వివరింతు ననుచు
మసకలక ద్వారసీమకు వచ్చి హస్త
కిసలయాగ్రమున వాకిలి యూఁది నిక్క
జలదకీర్ణము నాకసముఁ దొంగి చూచి
యలరావికిఁదటియలివేణిఁ జూచి
తొలుత నభ్రంబునఁ దుళగించుమించె
యిల వ్రాలెనో కాక యిది యది యైన
దండనె చలనమొందక రూపుతోడ
నుండునే యనుచు ని ట్లోకకొంతతడవు
తలపోసి తలపోసి తరళాక్షి ! యనుచుఁ
బలుకరింపుచు నిజభావంబుఁ గాంచి
జక్కవకవ వెక్కసపు†వలవాడి
ముక్కుల నొత్తినమురువు దీపింపఁ
బనుపడ నులిపచ్చిపయ్యెదకొంగు
మొనలనానినకుచముల నొప్పుదాని

* వెలిసెనో వెలియదో †వలపాటి

మీఱినచింత నెమ్మోము విలోకించి
తేరి కన్గొని దేవదేవిగా నెఱిఁగి
కటకటా! వానచేఁ గడునొచ్చె దీని
నిటకు రమ్మందునో యేల యివ్వేళ
నేకాంతమునవచ్చి యెలనాఁగ లున్న
నేకాంతులకుఁ గూడునె యని తలఁచి
యీాద యెగతి మాను నే దయమాలి
యీాదెస నుండంగ నిగురుబోఁడికిని
అని యీశ్వరప్రేరితాత్ముఁడై మఱియు
ననబోఁడిఁ గని విప్రనారాయణుండు
తడయ నేటికి రమ్ము తరళాయతాక్షి
జడియక మాపర్ణశాలలోపలికి
నన విని యిదియసం దనుచు నాచక్కి
మును దాఁచియున్నసొమ్ములు నంబరమును
గొనుచు వేవేగ నక్కుటిలకుంతలయుఁ
జనుదెంచి యాపర్ణశాలలోఁ జొచ్చి
యలిబలంబులు వచ్చి యతనితో మున్న
యెలగోలు సేసిన యింపు దీపింపఁ
దల తడియార్చుచందము దోఁప మాని
కులనాథు సోఁకంగఁ గ్రొమ్ముడి విడిచి

జాడించి సీమంతసరణు లేర్పడఁగఁ
గూడదువ్వుచు జారుకొప్పు గీలించి
జోఁకగాఁగనయంబుఁ జొనిపి మై మొగలి
రేఁకు బాగున కొంగుసింగు వోఁ జెరివి
*పాలిండ్లు లజిఁగానుపడ నొకవింత
లీలఁ బయ్యెదకొంగు లేజాఱవైచి
చికిలిచేసినమారుచేకత్తి వోలె
సకలంకమణిభూషణాన్విత యగుచుఁ
గోమలునిక్కఁగ నేయుకుసుమాస్త్రు మనఁగ
బొమలు నిక్కఁగ నోరపులచూపు జూడ
నినుపైనచూపువెన్నెలసోఁగ సోఁక
ఘనమాని హృచ్చంద్రకాంతంబు కరఁగ
మాని వయ్యాదిమపుఁజూపువలను
లోనయ్యె ననుచు నాలోలాక్షి కదిసి
యిదియె సందని యెలుఁగెత్తి తేనియల
చిదురుప ల్చెవులఁ జిలుక నిల్లనియె
నెడపక వనములో నిందాఁక దిరిగి
బడలితి రొక్కింత పదము లొత్తుదునె?
యనుచు నూరులమీఁది కామానిపాద
వనజముల్ కరపల్లవముల రాఁ దిగిచి

* పాలిండ్లరంగానుపడ

యొత్తి కన్నులమీఁద నొత్తి డెందమున
నొత్తి మత్తిలి పల్కె నోమానచంద్ర!
కొండగా నినుఁ జూచికొని వచ్చి యిచట
నుండఁగా ననుఁ జూచి యొక్కనాఁ డైనఁ
బడుచ రమ్మని కేలుపట్టి లాలించి
యొడఁబాటు గావించి యొకమాఱు హితవు
నెరవుసేయక చెప్ప వీరీతి గలదె?
హరిహరీ! యిఁకనైన నానతి మ్మనినఁ
గమలాస్త్రమార్వీటంకారంబుపగిది
సమకొన్న తేఁటులఝుంకార మెసఁగ
నసతేనియలవాన నాని యింపూని
చనుదెంచె నొయ్యనఁ జలిగాలికొదమ
రాగంబుతో నంతరంగము రంగ
ఛోగి పేర్కొప నప్పుడు మానివరుఁడు
పలుగడఁ జొరనేయ నళినాస్త్రపువ్వ
ములుకులు వెలికింత మునుపుచందమున
నలమోహనాంగి చేయంటుటవలన
నిలువెల్లఁ బులకింప నెన రామతింప
హరి కుబ్జ మున్ను నెయ్యంబునం గలయు
కరణి నాలేమ నంగజకేళిఁ దేల్చె

రతి*వేదశిక్షకు రతిరాజు తరఁబు
†గతి వేణి యొప్పు నక్కలకంఠకంఠి
వనములఁ‡గాఢభావజకేలిఁ గొన్ని
దినము లచ్చోట వర్తించినమీఁద
నారామ తనకోర్కె యలరంగ విప్ర
నారాయణుని యోగినాయకోత్తముని
మునుపు విభాండక మునిపుత్త్రుఁ దోడి.
కొనిపోయినట్లు తోకొని యేగుదెంచి
తనయగ్రజాతముందర నిల్ప ననుజఁ
గని మోహనాంగి దిగ్గన వెఱఁగంది
యవునౌనె నీ వాడినట్టి యీప్రతిన
యవగడం బగుమాట లవి నీకె చెల్లు
నోకొమ్మ! నీకుమాటొకటి సేఁ తొకటి
కాకుండ పంతంబుఁ గడ తేర్చికొంటి
వాకొని వేయును వర్ణింప నేల
నీకు నీవే సరి నిఖిలంబులోన
నీదెస మఱి నేర్పు లెన్న నేమిటికి
నీదెపో నేర్పైన నేర్పు తన్వంగి!
యిలలోన నేము నీయందఱిలోన
మెలఁతయూపులఁ బొడమితి మింతెకాక

* వేగ † గతి వేగ నొప్పు ‡ నీడ

నీవంటిచతురత నీవంటిసొబగు
నీవంటిచేర్పు లెన్నిన మాకుఁ గలవె?
మానినీమణులలో మఱియును నాట
దానవైనను నీవ తలిరాకుబోఁడి
మఱియును నీవ పో మఱియును నీవ
మఱియును నీవ యువ్వామ్రాటికి ననుచు
నెన్ని కౌఁగిటఁ జేర్చి యింతి నామాట
లన్నియు నోర్చుకొమ్మని గారవింపఁ
దనచెల్మికత్తియల్ తనుఁ బెక్కుగతులఁ
గొనియాడ నావారకుంకిలకుంతలయు
నలభూసుకేంద్రుతో ననయంబు బత్తి
గలిగినదాసన గతిఁ గొన్నినాళ్ళు
లెనసియుండఁగఁ జూచి యితరు లాసన్నఁ
గని *యప్పనముగ నొక్కనిపాలఁ జిక్కి
తగువైనమగువలం దగులుట రోఁత
తగదని విటులు రాఁ దడసినకతన
వెచ్చసచ్చములకు వెడవెడ యైన
నచ్చపలాక్షిలో యనుఁగు వోఁపడిచి
వసుధలోపల వారవనితలవలపు
పసిఁడితోఁడిద, కాదె? భావింప మఱియు

---

*యెప్పసంబు నొక్కనివల

నెన్న నేటికి లంజ కిలలోనఁ గ్రొత్త
మిన్న లిచ్చినవాఁడె మీనకేతనుఁడు
ఈనియామరుఁడైన హీనవిగ్రహుఁడు
గాన యామముని యున్నగతి యెల్ల నెఱిఁగి
యీఁబుచ్చుకొనకుండు టెఱిఁగి యీపనుపుఁ
బూఁబోఁడి మదిఁ దలపోసి యే వీని
నడి నొంద కేరీతిఁ జయ్యన నిల్లు
వెడలఁగొట్టఁగ నెద్ది వెఱవని తలఁప
నల్లన నది గని యాదేవదేవి
తల్లి పల్లవబాహుతాడితవదన
మంకుదిమ్మరి మటమాయలబండి
డొంకువోయినటక్కొంకుసంకటము
విటుల నిచ్చలుఁ గాఁచి వేఁచుటవలన
విటకంటకిఖ్యాతి వెలసినగబ్బి.
యెప్పుడు తనయింటి కేగువారలకుఁ
దప్పుబాసలు సేసి తప్పినకతన
వెలికురికినపండ్లు వ్రేలాడుచండ్లు
కుళుపవట్టినమేను కోఁతిమొగంబు
తప్పకన్నును బట్టతల గూనివీఁపు
పుప్పిగోళ్లును నీచవోయినకాళ్లు

చీమకండ్లును మొండిచెవి బుఱ్ఱముక్కు
గాముఁ బోలినరూపు గలిగి యుండంద
వెరగైనతనమాట వినినంతలోనె
పొరుగిండ్లకుక్కలు బోరున మొఱఁగఁ
జిలుముచాయలపండ్లు చెడ్డకంపునకుఁ
దలఁకి చట్టామడ దయ్యాలు బెదరఁ
గడుఁగోప మెసఁగ రోఁకలి పూఁపుమీఁద
నిడుకొని దుడి దుడి నేతెంచి పలికె
నోవెఱ్ఱిబిడ్డ! నీ కుచితమే యిల్లు
నీవంటిలంజెల నీవు గన్గొనవె
తాటోటుమాటల తక్కరిగొంటు
తాటదమ్మని నమ్మఁ దగునె యోయమ్మ
కొఱమాలి యున్నవే గొంగబాపనికి
మరు లేల కొంటివే మటమాయలాడి!
గారాబువెన్నెల గలనాఁడె యల్లొ
నేకేళ్ళు గాకయోనీలాహివేణి!
బ్రదుకెల్ల ముదిమిచేఁ బడకుండ నాఁడె
ముడిసినఁ గోరయూనె ముంజ లంజెయును
వయసునం గడిఝంపవలయుఁగా కిరుగ
వయసు రమ్మనినను వచ్చునే మగుడి

యిచ్చట నొక్కకా సిచ్చెనో పీస
మిచ్చెనో వీఁడు దా నింటిలోఁ గలవి
తిని పులిబోఁతుపొందికనున్న లెక్క-
గొన వింటిలోపల నుండ్రించకొనుచు
నేనాఁటిలంజియ లింటిలో వెరఁజి
యేనాఁటిమగలకు నెమరుపెట్టుదురు?
ఎలయించి ప్రియులకు నింపు పుట్టించి
కలకాలమును జేతఁ గలకాసు లెల్ల
వలిపించి వెరఁజుకోవలయును, గాలి
గలనాఁడె తూర్పెత్తఁగాఁ దగుఁగాక
యిన్నాళ్ళు నోర్చితి నిఁక హాని వదలి
యున్న నామాటలో నుండు కాదేని
పూని నీబుద్ధులఁ బోయితివేని
వాని నిన్నును బట్టి వడి నంటఁగట్టి
చంపి చాఁగరగొని సదమదం బాడి
కొంప నుండకయుండఁ గొట్టి పోలుతును
అని వెండియును దన్ను నదలించి కినుకఁ
గనుఁగొని వేయు సంగతుల సాధించి
జనని వేసారంగ సారంగనయన
తనలోనె తాను చింతన సేయుచుండెఁ

దనపట్టి *శాంతియంతయు మట్టుపెట్టి
కనలుచు నావిటకంటకి యపుడు
చేరి యాచెంత భాసిల్లెడువిప్ర
నారాయణునిమీఁద నడతెంచి కదిసి
కడిఁదికోటికి గంట గట్టి నిచ్చలును
బడసి గడించు నాబంగారుకుండ
మక్కువ నెలయించి మాఱు లేకుండఁ
దక్కక మందులు తల కెక్కఁజేసి
యోరోరి నాబిడ్డ యో జెల్లఁ జెఱచి
తీరీతి వెఱ పాకయుం డైన లేక
క్రొత్త లిచ్చెదో పుచ్చుకొనియెదో వట్టి
రిత్తమాటలు నీవు రెంటనుం బస్తు
లోరి నీ వోకచిన్న మోసఁగవు లంజ
వారిసొమ్ములు దిన వారి కేమగును
వీఁగనిమృత్యువు వెస నన్నుఁ జూచి
లోఁగుఁ దామరపాకులో నీరు వోలె
నలజముఁ డైన నాయందంబుఁ జూచి
తలకు నొక్కింతయుఁ దలఁకవు నీవు
మడియఁ గొట్టుదునో దిమ్మరితాటదమ్మ
వెడలెదో మాయిల్లు వేవేగ ననుచు

* సీత.

బెగడొంది తనుఁ జూచి బీరువోకున్న
జగతీసురేంద్రుమహాస్త్రముఁ బట్టి తిగిచి
నిడుసాగిలఁగ నెట్లు నెట్లు వడంగ
మెడ వట్టి ద్రొబ్బి గామిడితొండ యనుచుఁ
దలుపు బిగ్గన మూసి తడయక గడియ
బలువుగా నిడి వెలుపలివానిఁ గూర్చి
మగుడివచ్చిన సిగ్గుమాలుతు ననుచు
జగడాఁగ ముదుసలి సాదింపుచుండె
నంత నామునినాథుఁ డంతరంగమున
నెంతయుఁ జింతించి యే పెల్లఁ దక్కి
జగడించునల బేరజమునకు నోడి
పొగులుచు నిలు సొచ్చి పోవంగలేక
పలుదెఱంగుల మేలుపడి చిక్కియున్న
పొలఁతిపొందులు డించి పోవంగలేక
వకవకలై యింత వ్రతముఁ దక్కినను
సుకము దక్కకపోయెఁ జూచితే యనుచు
ఖిన్నుఁడై వారివాకిట నున్నపంచ
తిన్నెపై నొదికిలి దేవుఁడా యనుచుఁ
దలక్రిందఁ జేయిడి తనలోనతాన
తలపోయుచుండె నంతట వెన్నచాయఁ

జిలుకముక్కులచాయ జేవురించంగ
ఫలితాస్తనగచూతపరిపక్వఫలము
ఇల వ్రాలెనో యన నినుఁ డస్తమించె
నులుకనిమతులతో యోగీంద్రవరులు
హరిపదధ్యానామృతాపారలహరి
నరగన్ను లిడినసోయగము దీపింప
విరిదామరలు వెడవెడఁ గన్ను మొగిచె
గరువంబు దక్కి జక్కవమొత్తమునకుఁ
గుముదినుల్ చంద్రుఁ గన్గొనుచంద మెసఁగెఁ
గుముదముల్ విరియ గ్రక్కున తేఁటు లెసఁగె
నగి కోపమునఁ గాలనరసింహమూర్తి
గగనహిరణ్యవక్షము విదారింపఁ
దొరఁగు రక్తంబునాఁ దులగించుసంజ
నరుణాంశువల్లిక లలరె నభ్రమున
నలరాత్రికోమలియాఁదలఁ గలువ
చెలికాఁడు పెట్టినసేసబ్రా లనఁగఁ
దెలిమించుమించులు దీండ్రింప నభ్ర
తలమునఁ జూపట్టెఁ దారాగణంబు
లున్నతోన్నతమైన యుదయశైలమునఁ
జెన్నొందు నమృతంపుసెలబుగ్గ యనఁగ

నలకాముకులహృదయములలోఁ బంట
వెలిమించె నన నొప్పె విధుమండలంబు
వేదన గలపూనివిరహార్తిలతకు
బ్రోది సేసినరీతిఁ బొదలెఁ జంద్రికలు
రంగనాయకుఁ దోనరంగ నాయంగ
రంగవైభవముల రాజసం బెసఁగ
నప్పుడే కాంతిపాయస మారగించి
చొప్పడుముత్యాలసొంపు దీపించి
క్షీరతరంగంబుచె న్నగ్గలించి
హారపుంజంబుచాయలఁ గ్రిందుపఱచి
కపురంబు చవచవఁగా నాడి మంచు
రపణంబు విడియించు రమణఁ జెన్నొందు
నహిరాజశయనంబునందు నిందిరయు
మహియు నీళయును బ్రేమను దయల్వాఱఁ
గమ్మోవి దలిరాకు గేలించుకేలి
దమ్ములఁ బాదపద్మంబు లొత్తంగ
నొప్పుగా నొకవింతయొయ్యార మొదవఁ
గప్పినహేమాంశుకంబు చూపట్ట
జడిగొన్న ముత్తెంపు జల్లి *గింజెలుల
†విడియంబు డాపలఁ బెంపొందుచుండఁ

*గిఁటొపలఁ †విడియంబు

జెంగావితలిరులజిగి మించు నొక్క
కెంగేలు మస్తంబుక్రింద నమర్చి
యకలంకకంకణోదంచితం బైన
యొకకేలు జానువు నొరయంగఁ జాఁచి
పవళించి యారంగభర్తకె మ్మోవి
చివురుపై వెన్నెలజిగి తేటరవలు
మలయ నకారణమందస్మితంబు
సలుప నచ్చెరు వంది జగదేకమాత
రంగనాథునిపాదరాజీవయుగళి
బంగారుపాలిండ్లపై నొత్తుకొనుచుఁ
బగటున నీవేళఁ బనిలేనిపనికి
నగ నేల చెపుమ పన్నగరాజశయన !
నావుఁడు మిగుల మన్ననతోడ దేవ
దేవుఁ డాయిందిరాదేవి నీక్షించి
యారయ నొండు గా దబ్జాక్షి విప్రి
నారాయణుం డను నాదుభక్తుండు
వెనుకొన్నభక్తితో వేసట * లేక
యనిశంబు సూనంబు లర్పించుచుండు
నతఁ డొకగణికకు నాసక్తుఁ డగుచు
మితమున వారి కేమియు నీనికతన

* శేద

వనురాగశూన్య మై యాలేమతల్లి
చెనఁటి నిరాకరించిన చిన్నఁబోయి
విడిచిపోవఁగలేక వెలయాలిపంచ
నడుకుచు నోడుగంగ నవ్విౘి నిప్పు
డనఁడు శ్రీరంగనాయకునకుఁ బద్మ
వినత మై వినుతి గావించి యి ట్లనియె
వనజాక్ష మీపాదవనజంబు పేరు
కొనినఁ బాపము లెల్లఁ గుందుఁ జేసేత
నీదాసుఁ డైన యీనిర్మలాత్మునకు
నీదెస వాటిల్లు టేమికారణము
మట్టుమీఱనయోగమము లెన్న లేని
యిట్టినీమాయకు నితఁడు లక్ష్యంబె
రవిదీప్తి నంధకారము సోఁకు టెట్లు
భవదీయభక్తుని బాప మే లంటుఁ
గనికరింపవు నీది గాదె యాకీర్తి
తనయునిసౌఖ్యంబు తండ్రిది గాదె
పనుపడ నే విన్నపము సేయకున్న
ననఘశరణ్యా నీ కతనిపైఁ గరుణ
లేదె యెంతైనఁ దల్లికి లేనిముద్దు
దాదికిఁ గలదె యోధవళాక్ష యింక

ననుఁ జూచి హాని మన్ననఁ జేసి నీదు
తనయునిపై నింద తరలింపవలయు
నన విని రంగేశుఁ డరవిందసదనఁ
గనుఁగొని పలికె నోకలకంఠకంఠి !
యతఁడు మహాయోగి యతనికి దృష్ట
రతిరక్తి గలదె యారసిచూచితేని
అతఁడు మల్లీలార్థమై రాగవశుని
గతిఁ జెందియున్నాఁడు గాని యోవనాని
తలఁప నేఁ గృష్ణావతారంబునందు
నలరుబోణులఁ గూడి యట్లయుండితిని
దుద నాకు రాగ మందుల నింత కలదె ?
యది నీ వెఱుంగవె యాత్మ భావింప
నలినాస్య వివరింప నా కెంతశక్తి
గల దంతశక్తియుఁ గలదు నిత్యులకు
నతఁడు మద్వనమాలికాంశంబు గాన
నతనికి దోష మింతైనను గలదె
హితమతి నే మోక్ష మిచ్చెద నన్న
నతఁ డీయఁగలఁ డేరికైన మోక్షంబు
నతులితంబైనట్టి యతనిపూజకును
బ్రతి యేమి సేయుదు భావించి యుక

నైన నీమాట నా కది దోసియరాదు
గాన నే నట్టులే గావింతు ననుచు
దనుఁ జూడ భక్తవత్సలుఁడు గావునను
వనజాక్షుఁ డిది సేయవచ్చు రా దనక
మిసమిస మనుమీనుమీసంబుఁ దెగడు
పసిఁడివన్నియముంజపచ్చసిగోఁచి
సోలిగోఁచుల నొప్పుచూపుదండంబు
కేలికమండలు కృష్ణాజనంబు
చిన్నారుతిరుమణి శిఖయు జన్నిదము
సన్నంపుగాటుక చారులపంచ
గొనబైనకుడివ్రేలికొడియుంగరంబు
పనుపడ మిగులంగఁ బటువైనవటువు
రూపంబు దాల్చి యర్చకుని గేలిగొనుచు
నాపొంత థళథళమనుమించు లోదవు
నలవిభీషణుఁడు మున్నర్పించినట్టి
దళమైనహేమపాత్రంబు కెంగేలఁ
గైకొని వచ్చి లోఁగక దేవదేవి
వాకిట నిలిచి కవాటంబు మీటి
గడియదీయుఁడు పని గలదు నావుఁడును
గడుగోపమున విటకఁటకి పలికె

వలదన్న నేటికి వచ్చెద విఁక
పొలసుపైవఁగ నిదె పో పొమ్ము కొండఁ
దల నెత్తుకొన నీకుఁ దరమె యిం తేలఁ
తొలఁగరా యీమోరతోఁపు లేమిటికి
నటలు చూపకుము చచ్చనమాట లేల
మటమాయలాడ ముమ్మాటికి నీవు
బుద్ధులు కలిగి నేర్పులు చూపవలదు
ప్రొద్దున నెందైనఁ బోకుండి తేసి
గాసి నా కేలిరోఁకలిపెట్టు రెల్ల
నీసొమ్మె యన నవ్వి నీరజోదగుఁడు
నమ్మ నేటికి మీరు నను మీకు నిచ్చి
రమ్మని విప్రనారాయణుం డనిచెఁ
గనకపాత్రం బిదే కాంతోపయంతుఁ
డనువాఁడ పరుఁడఁ గా నతనిశిష్యుఁడను
మఱియున్న జగజోగమాటలు మాని
తెలివ వే చనుదెంచి తెలివవే గడియ
యనవుఁడు బంగార మనుమాట చెవుల
విని బత్తి గలదాసివిధమున నప్పు
డలదేవదేవి యొయ్యనవచ్చి తల్లి
వలదన్న వినక కవాటంబుఁ దెఱచి

తపనబింబప్రభఁ దలపింపుచున్న
తపనీయపాత్రంబు దాల్చినవానిఁ
గని తోడుకొనిపోయి కన్నులఁ గప్పి
కొనుచు లోనింటిలోఁ గూర్చుండఁబెట్టి
గారవింపఁగ విటకంటకి యపుడు
చేరి యెంతయు సంతసింపుచుఁ బలికె
వినవయ్య యోదేవవిప్రపుంగవుఁడ
పసివడి నీచేత బంగారుగిన్నె
యిప్పు డంపకయున్న నింతలో నేమి
దప్పె మాకిది గుఱుతా తానెకాక
యింతకాలము నొకయింటిలోపలనె
యింతయునఱ లేక యొనసియుండితిమి
మక్కువఁ దలపోయ మాలోనఁ దాను
నొక్కఁడై యుండు వేఱొక్కఁడు గాఁడు
కొమరుప్రాయము దొరఁకొని కూడి మాడి
మమతఁ బాయకయున్న మంచె మేలమున
నలసి వేసరి యాడినట్టిమాటలకుఁ
దలఁపున నెరవుగాఁ దలఁప నేమిటికిఁ
జెల్లఁబో యెగ్గెల సేసె నొక్కఁడను
దల్లిబిడ్డలకుసైతము రాదె వాదు

ప నెఱుంగకయున్న యీపాపజాతి
తానైన నీ కిది తగుఁ దగ దనక
యర్మిలి నే ప్రొద్దు నాతనిమనసు
మర్మమెఱింగి యీమాయపుబిడ్డ
యీరీతి నవ్వుల కితఁ డోపఁ డనుచుఁ
జేరి తా నొకమాటు చెప్పకపోయెఁ
జనవున నొకకొన్ని చచ్చనమాట
లని సరసము లాడినంతలోపలనె
యది సందుగాఁ గొని యరిగె మీయొజ్జ
యిదియు మానితి నయ్య యింతటినుండి
యింతవేగిరకాని నెఱుఁగము తనదు
పంతమంతయుఁ జెల్లె పదివేలు వచ్చె
నందుల కనుట కా దయ్య మాపదుచుఁ
గొందలపడుచు లో గుబ్బతిల్లుచును
బగఁగొని లోన నప్పటినుండి సొంపు
డిగి కంట కంట పుట్టెడునీళ్లు కార
*మన్మ నిందాక రంభారూళ్ళ సేసి
లెమ్మన్న లేవక లీల నా కింక
నతనితోడిదె లోక మని కూడు నీళ్లు
మతిఁదలంపక నేలమై శయనించు

* బమ్మెరదాఁక దుంభాభూళిచేసి

నెపమాత్ర నీమాట నెఱిఁ జెవి సోఁక
నిపుడు దా వాకిటి కేతెంచెనయ్య
కనకంబు చూచి తక్కరిమాట లాడె
నని తలంపకు తన కప్పటినుండి
చెడుగుకోపం బింతసేసెఁగా యనుచు
గడుపులోఁ జెయివెట్టికలఁచిన ట్లగుచు
నిలువ సయింపదు నిలిచినచోటఁ
దలఁపులో వెత జెప్పఁ దరము గా దనుచుఁ
గనుదోయి బులుముచుఁ గడలఁ గన్నీరు
కొనవ్రేల మీటి డగ్గుత్తిక వెట్టి
కొంతధైర్యముఁ బెచ్చుకొన్నది యగుచుఁ
గాంతోపయంతనుం గనుఁగొని పలికె
నీచేత నిపుడు గిన్నియ యందుకొన్నఁ
జూచువారలు మనసున నాడకున్న
నీసున నిందున కెంతగావించె
గాసించి యిది యెంతకష్టురా లనరె
నెట్టన నేము గిన్నియ యిప్పు డిట్టె
పట్టకుండిన నెగ్గుఁ బట్టు మీరెుజ్జ
యెవ్విధమునఁ జూడ నెందుఁ బోవచ్చు
నెవ్వరితో సద్ద యేలయ్యె తనదు

మనసువచ్చినఁ జాలు మాకేమి యనుచుఁ
గనకపాత్రము గేలఁ గైకొని మఱియుఁ
దత్తరపడుచున్న తనబిడ్డప్రాణ
మెత్తుకోవలసిన నిపుడె ర మ్మనుచు
మక్కువ వేమాఱు మామాఱు గాఁగ
మ్రొక్కి తోకొనిరమ్ము మొకబంగ మెడయ
ననవుఁగు మిగులంగ నయ్యాదివటువు
తనలోన నవ్వుచుఁ దడయ కేతెంచి
యిమ్ములవారివాకిటితిన్నె మీఁదఁ
జిమ్మచీఁకటిలోనఁ జింతింపుచున్న
యామానిఁ గాంచి యొయ్యనఁ జెంతఁ జేరి
ప్రేమమైఁ జెయివేసి పిలిచి యిట్లనియె
వీరెవ్వ రని చూచి వివరించి విప్ర
నారాయణుఁడ విప్రనారాయణుఁడ
విట నేల యున్నాఁడ వీదేవదేవి
విటకంటకియు నిన్ను వేయుభంగులను
వెనుకొని యూరెల్ల వెదకి కానమివి
ననుఁ బంపి రెచట నున్నాఁడవో యనుచు
వేవేగ నచటికి విచ్చేయుమయ్యా
నావుఁడు విని విప్రనారాయణుండు

చెవులలో నమృతంబు చిలికినట్లైనఁ
జివురుగైదువుజోదు చేబారిఁ జిక్కి
వడి లేచివచ్చి యవ్వాటువు డెందమునఁ
గడువేడ్కఁ జేర్చి యక్కజమందికొనుచు
నీ వెవ్వ రోతండ్రి! నీవు నాపాలి
దైవంబ వగు రంగధామునీపతివో
కాకున్న నోరుల కీకరుణ నామీఁదఁ
జేకూరు టెట్లు చర్చించిచూచినను
అని సంతసించిన సతిని వారింటి
కనిచియంతటిమీఁద నారంగవిభుఁడు
సరగున నిజనివాసమున కేతెంచి
యురగేంద్రశాయి యై యుండె సంతటను
అలతల్లితోఁగూడ నాదేవదేవి
యెలమిసేయుచు మాని కెము రేగుదెంచి
పసనిగద్దియపీఁటపై నుంచి మంచి
పసిడితంబుగ నీటఁ బాదము ల్గడిగి
నిడిపోగచంద్రికనిగ్గు లల్లార్చు
దడిపంబుపావడఁ దడివాయ నొత్తి
మేలిమిపన్నీట మెదిచి కస్తూరి
డాలుగా మైని వాటంబుగా సలఁది

జవ్వాదిపసచేసి సంపంగివిరులుఁ
గ్రొవ్వాడిమొగలిరేకులుఁ జాలఁ దురిమి
పలుచనిపన్నీటిపదనిక్రమునఁ
గులికినబాగాలు కొమరుగా నొసఁగి
వెలఁది వెన్నెలసోఁగవేఁగంబు లాడ
దుళగించు బొమ్మంచుదుప్పటిఁ గప్పి
మొనసినప్రేమనై నెప్పటికంటె
నినుమడించినభక్తి నిరువురుం గూడి
సరసకళావిలాసములచేఁ జొక్కి
మరుకేళిఁ దేలి నెమ్మది నుండి రంత
గగనాంబురాశి బుగ్గలు పుట్టి యడఁగు
పగిది తారలు పలపల గ్రుంకఁదొడఁగె
సహజాంధకారకాష్ఠంబుల నేర్చు
మిహిరాగ్నిఁ బొడమినమిణుఁగురో యనఁగఁ
జొక్కమై వేగురుచుక్క చూపట్టెఁ
గుక్కుటహాటంబు కోవన నార్చె
లలిమీఱి విరహిజాలము నెలయించు
*నిల యించువిలుకాఁడు నేఁటు చాలించెఁ
బ్రియమూర మరుకేళి బిగిసినప్రియుల
ప్రియురాండ్ర కౌగిళ్ళబిగువులు సడలె

* నెలయుంచువిలుకాఁడు నెట్టనఁ జనియెఁ

వలపలియెడదండ వలపులకొండ
సలల గేడించి గొజ్జఁగుల వేడించి
పొలయుతుమ్మెదలపుప్పొడిజాద† రాడి
చలువపూనీట వసంతంబు చల్లి
కెలనఁ దామరలఁ జక్కిలిగింతఁ బెట్టి
కలువలనోళ్ల నొక్కట ముద్రవెట్టి
జక్కవకవల రేజగడంబుఁ దీర్చి
మక్కువ నంచకొమ్మల మేలుకొల్పి
యలరువిల్కానియాహావకేళి నలయు
కలికిపూఁబోణులగబ్బినిబ్బరపు
సిబ్బెంపుఁబొడలరఁ జిలి పసనైన
గుబ్బగుబ్బలుల హైఁ గుప్పించుకొనుచు
రసికులయెదలను రాగంబుఁ జెంద
విసర నొయ్యన నరవిరినాలిగాలి
యలఘు ప్రభాతచైత్రాగమ వేళఁ
దొలుత నాకసపుమోదుగ పూఁచె ననఁగ
విమలన భోద్యానవీధి చిగిర్చె
రమణీయసాంధ్యానురాగంబు లెసఁగ
శ్రుతిలతాంతంబునఁ జూపట్టుఫలము
గతి నంధకారతస్కరుఁడు భాస్కరుఁడు

---

† రాళి

నెనయు కెంజాయల నెలమించు లోదవఁ
గనుపట్టెఁ దొలుచాయఁ గడు సొంపుమీఱి
కాలమృగేంద్రంబు గనలి యాపూర్వ
శైలేభకుంభముల్ జదియఁగొట్టుటయు
నెనయురక్తమున బిట్టెగయుమౌక్తికము
ననువున నుదయించె నంబుజాప్తుండు
కైరవంబులదాయఁ గని తమగతుల
కైరవంబులు డాయ నరిగెఁ జక్రములు
అపుడు శ్రీపాంచరాత్రాగమశాస్త్ర
నిపుణుండు శ్రీరంగనిలయార్చకుండు
మిడుగుల నొఱయుచు మించుబింజియల
బెడఁగుల నెరులు గాన్పించుడోవతియు
నుత్తరీయంబుగా నొకకొంత వైచి
గుత్తంబునడుమ చుంగులువార బిగిసి
పొసఁగఁజుట్టినయట్టిపొత్తిచీరయును
బసమించు సన్నపుఁబట్టెనామములు
మలయునూరుపులకు మాఱుగాననుఁ
జెలువారఁ జుట్టినజిలుఁగుబాగయును
వ్రేలువీనులు దర్భవ్రేలియుంగరము
నీలాహిపిల్లవన్నియ*పిల్లసికయు

*బిళ్ల

వెలఁదిజన్నిదములు వేదమంత్రములు
నలవడఁ బ్రొద్దుది క్కరసిక న్గొనుచుఁ
దాలంబు చేతితోఁ దగిలినకుంచ
కోలయుంగరము చేకొనఁ గీలుకొలిపి
చనుదెంచి గారుడ స్తంభంబుచక్క
ఘనభక్తిమై నమస్కారంబు చేసి
రంగమంటపముచేరంగ నేతెంచి
రంగేశునిలయాంతరద్వారసీమ
నిలిచియుండెడువేళ నీలంపుమణులఁ
బొలుచుతామరపెద్దపూసలపేర్లు
వలనొప్పతిరుమణివడములు వైచి
బలువుగాఁ దిరుమణు లపదిరెండు దీర్చి
గట్టిగా శంఖచక్రములు నామమును
బెట్టినపరుఁజుముప్పిడిఁ గేలఁ బూని
యనులు వోఁ జుట్టిన యరవదుపాగ
గనుపట్ట నొకకొండికాఁడు ముందరును
గొంటరిపాషండకులముపైఁ గనలి
గంటవైచినరీతి గంట నాదింప
రుచికళాశుంభచ్ఛిరోవేష్టనంబు
ప్రచురంపువెన్నెలపట్టుపచ్చడము

మనతరం బైనట్టికపిరాజముద్ర
మొనసిచూపట్టెడుముద్దుటుంగరము
కావిశాటులు గల్గి కాలదండంబు
చేవ యడంచి మించినత్రిదండంబు
విదళితాసురమతవిజయధ్వజంబు
చదురున శిష్యహస్తమునఁ జెన్నొంద
నిఖిలేశుఁ డగురంగనిలయుకోవెలకు
నఖిలంబునకుఁ గర్త యగు పెద్దజియ్య
చనుదెంచి లచ్చనల్ సరవిమైఁ జూడ
మునినాథునమతంబున నంబి యపుడు
బీగంబుచేయిచే బీగముల్ దెఱచి
లాగుగాఁ గుంచెకోలను లోన నిడిన
బలువైనగడియలు వాపి భేళాన
తలుపులు దెఱచి యత్తటి లోని కరిగి
పంచబేరములకుఁ బ్రణుతిఁ గావించి
పంచపాత్రములఁ దప్పక విలోకించి
యందులో నహము గొప్పగుగిన్నెఁ గాన
కందంద వణఁకుచు నాత్మఁ గుందుచును
బరిచారజనము లోపలను వెల్పలను
జరియించువారి నిష్టంబైనవారి

నడిగి కానక నంబు లరు దాదికొనుచు
వడఁకుచు నయ్యతీశ్వరునిసన్నిధికి
నేతెంచి పదములఁ కెరఁగి యాకార్య
మాతని కెఱిఁగింప నక్కజం బంది
సభయుఁడై వేగ మచ్చటియధికారి
సభికులం దక్కనస్థానంబువారి
రావించి శ్రీరంగరక్షునిసొమ్ము
పోవు టెట్లని మనంబునఁ గోప మెసఁగ
బహుపురాణములఁ జొప్పడుదేవదేవు
మహిమ లెఱింగిన మతిమంతులార!
విహితమే యీమాట విన మీకు గర్భ
గృహములోఁ బెట్టినగిన్నె లే దనుచుఁ
బోయెఁ బొ మ్మనుచు నంబులు తారు గొన్ని
మాయల మముఁ గనుమాటి యీరీతిఁ
గల్లలు పచరించి కడపట మనల
బెల్లించి యిదిదక్కఁ బెనఁగఁజూచెదరు
ఎందుఁ బోవచ్చుఁ దా మెఱుఁగ కీసొమ్ము
నందువారలు దాఁచునట్టివారలును
దాము గా కిబ్బంగిఁ దమకన్నుఁ బ్రామి
హేమపాత్రము గొన నెవ్వ రోపుదురు

మున్ను నీకరణి సొమ్ములును వస్త్రవులు
నెన్ని గైకొనినారొ యూనంబు లనుచు
గసిమస హరిసొమ్ము గలకాలమెల్ల
మెసఁగి లేదనిన స్వామిద్రోహులార!
యొల్లినసొమ్మెల్ల నొడచూఱఁ గాఁగఁ
బట్టి లేదను సర్వభక్షకులార!
యనుచు నంబులదిక్కు నందఱదిక్కుఁ
గనుఁగొని యొక్కటఁ గలయంగవాడి
యిమ్మొయి నను నేలు నిందిరావిభుని
సొమ్ము వోవంగ నేఁ జూడలేఁ ననుచు
గన్నీరు గాఱ గద్గదకంఠుఁ డగుచుఁ
బన్నిన దైన్య మేర్పడఁగఁ బల్కుచును
మున్నుగా మొలనున్న మువ్వొలకావి
పిన్నలి వడి మెడం బెనచితగిల్చి
కడువాడి యేకాంగి కత్తిఁ దెమల్చి
యడలుచు మెడఁ బూనునంతలోపలనె
నంబులు నచటిస్థానంబులవారుఁ
బంబినభీతిఁ జేపట్టి గొబ్బునను
బిన్నలిఁ దప్పించి పెనఁకువఁ గేల
నున్నట్టికైదువు నొడిసి కైకొనుచు

నేవెరవులకుఁ దా మింద ఉండంగ
దేవర యిటు సేయఁ దివురఁ నేమిటికి
నని యధికారి యయ్యతిని లాలించి
కనలుచుఁ దనదుచెంగటిభృత్యసమితిఁ
బిలిచి, నంబుల నడ్డపెట్టి యాసామ్మి
నిలిచిననిలువున నేఁడు గైకొనుఁడు
అన విని యర్చకులాముద్రకర్త
కనిరి యేలయ్య యన్యాయంబు నీకు
దుష్టుల మైన యందులకు నీమెదుట
దృష్టిశోధన మమ్ముఁ దెలిసికొమ్మయ్య
యామెడ మేము చీమంత యోడినను
సేయింపు శూద్రులఁ జేయించు నాజ్ఞ
యనవుఁ డయ్యధికారి యాత్మఁ జింతించి
యనిమె వారికి నిశ్చయంబుగా మీర
లచ్చు లైనది ముచ్చు లైనది దెలిసి
చెచ్చెఱ నన్నియుఁ జెప్పెదఁ గాని
యటనుంకుఁ డని వారి నాఁకఁ బెట్టించె
నిట విటకంటికియింటిలో మెలఁగు
మటమాయలాడి ద్రిమ్మరిగబ్బితొత్తు
వటరమై చంచలవాణినాఁ బరఁగు

నావేళ నదియొక్క టక్కఱి గలిగి
దైవవశంబునం దదనుజ్ఞ వడసి
నల్లపూసలపేరు నలి గినకోక
వెల్లనై గడిగొన్నవిచ్చుటాకులును
గొప్పున కందని కుఱుచ వెంట్రుకలు
కప్పారురావాడికప్పుబల్వరుస
కొమరుమించిన బండిగురిగింజతావ
డములు నిట్లుకపవడంపుఁజేకట్లు
పిత్తడికడియముల్ పికిలిపూదండ
మొత్తంబు లగు నల్లముదుకగాజులను
లక్కతామెతులు తెల్లనితగరంపు
ముక్కర సీసపుముద్దుటుంగరము
కాకిబేగడబోట్లు కంచుమట్టియలు
కైకడసంకుటుంగరమునుం గలిగి
జగతాఁగ మై కూడ సందిట నిఱికి
మొగము జొత్తిల బొమముడివెట్టకొనుచు
నణగుల నేలికెసాని లోలోన
గొణిగి తిట్టుచుఁ బలుగొఱికి వేసరుచు
శ్రీరంగనగరంబు చేర నేతెంచి
యారంగవిభునగరాంతంబుఁ జొచ్చి

యెదురుగా నల్లంత నెవ్వాం గన్నఁ
బదపడిపాడుచు బయల నవ్వుచును
బలుదార లెదురుగాఁ బరతేరఁ దెరువు
దొలఁగక గొందులు తొంగిచూచుచును
నరమురి సన్యాసి నైన లెక్కిడక
నోరయుచుఁ బొమ్మన్న నుడిరిపల్కుచును
మణిసహస్రస్తంభమంటపంబునకు
నణిముణి నేతెంచి యచ్చోట్ల నిలిచి
యిసుమకట్టిన వేఁడియొండలో మిగుల
డడియ పేఁపులమీఁదఁ జాపరా లెత్తి
పొగడదండలు వైచి పోసీక యెదుట
పెగడఁ దిట్టుచు నడ్డపెట్టినవారి
నరసి యిదేమొకో యని యధికారి
పరిచారజనులఁ దప్పక విలోకించి
పనివడి వీరి కీపాటేల వచ్చె
నని వారు సేయు నయ్యపరాధ మెఱిఁగి
యందులో మొగ మొఱుకైయున్నవాని
ముందర నిలిచి నెమ్మోము వీక్షించి
కిలకిల నగి కేలు కేలునం బట్టి
లలిమీఱి పలికె నుల్లాసంబుతోడ

నీగిన్నెకై వీరి నీపాటుఁ బఱప
నాగిన్నె తెలియంగ నది యెంతకలదో ?
యనవుఁడు బంటువాఁ డది దొడ్డసొమ్ము
చనుము నీ కిట్టి ప్రసంగ మేమిటికి
నిప్పు డాగిన్నెయ యీపాటి యనుచుఁ
జెప్పి ననేమి యార్చెదవో తీర్చెదవో
చాలుఁ బొమ్మనినఁ జంచలవాణి పలికె
నేలరా మీగిన్నె లిటువంటి విపుడు
వేయైనఁ దాసున వేసి తూఁచినను
మాయక్కగిన్నెకు మఱి సరియగునె
యడిగినంతటిలోన నది గొండసేసి
నిడుసాగిలం బెట్టి నీల్గ నేమిటికి
ననవుఁడు చెంతవారపు డాలకించి
విని దానిమాటలు వెలుచుకో ననిరి
యోగుంటదాసి నీయొడలిసొమ్మెల్లఁ
బోఁగుగా రూకెత్తుపుత్తడి లేదు
నీవున్నసారెకా నీయక్కసొమ్ము ?
పోవె యీపోలనిబొంకు లేమిటికి
నివ్వసుంధరలోన నిటువంటి గిన్నె
యెవ్వరు మీకిచ్చి రెందుండి వచ్చె

నన విని కోపించి యాబేలవరవుఁ
డనియెను మాయక్క యలఁతియే తలఁప
నిచ్చవచ్చినవార లింటికి వచ్చి
యిచ్చిరి వారు మీ కెవ్వరై రేమి
యుదిరి మాయక్కఁ జూపోపక మీరు
పదివేలు న నవేలఁ బాదలా రనుచుఁ
జనుదానిమాటలచందంబు చూచి
యనుమానపడి వేగ నద రంటఁబట్టి
కట్టి తోకొని యధికారిముందరను
బెట్టి యవ్విధముఁ జెప్పిన సంతసించి
యప్పు డాయధికారి యాదాసి డాసి
చెప్పవే వెఱవక చెప్పవే యనుచుఁ
దలఁ జెయవెట్టి పాదము భీతిఁ దెలిసి
చలపట్టి యడుగఁ జంచలవాణి యపుడు
వడవడ వడఁకుచు వాతెఱ మిగులఁ
దడుపుచు మాటలు దడఁబాటు గొనఁగ
నీరీతి నేమియు నెఱుఁగ నీ రేయి
నే పేసుబంధువన్నియ మేనిత్తోడఁ
బలుచని యొకచిన్న బాపనివడుగు
బలిమిమై నింటిలోపలి కేగుదెంచి

యుదిరి బంగరుగిన్నె యొక్కటి దెచ్చి
యది వల దనఁగ మాయక్కచేతికిని
యిచ్చి తాఁ గ్రమ్మర నేగెను డాఁప
నిచ్చెనో తుదిఁ దక్క నిచ్చెనో యెఱుఁగ
నని మ్రొక్కి బాష్పంబు లడరించుదాని
గనుఁగొని యయ్యధికారి లాలించి
కట్టల్క నెండలోఁ గమలంగ నడ్డ
పెట్టిన నయ్యెడ్డపెట్టు చాలించి
రావించి సంబుల రాగిల్లఁ బలికి
కావికట్టణములు గరిమమై నొసఁగి
తాలిమి నిరుమేలఁ దనుఁ గొల్చియున్న
కాలకింకరభయంకరులఁ గింకరుల
చెసఁ గనుఁగొని దేవదేవిచేనున్న
యసరుసాయకుతండ్రిహైమపాత్రంబు
చేకొని దాని కిచ్చినవాని దాని
వేకట్టికొనిరండు వెఱపింత లేక
యని నియోగించిన యాభృత్యసమితి
యనిలవేగంబున నలపురంబునకుఁ
బఱతెంచి యొక్కనిఁ బట్టంగఁ బనుపు
రఱముఱి దానియిల్లటు చుట్టుముట్టి

ఘల్లుఘల్లన గిలుకలతోడి గుదియ
లల్లనల్లన భూమి యదర నూఁదుచును
లోఁగక కొంద ఱాలోనికిం జొచ్చి
తూఁగుటుయ్యాలహంసతూలికమీఁదఁ
బవళించియున్న శ్రీపతికుమారకుని
సవరనిచరణాంబుజము లొత్తుచున్న
చకితకురంగాక్షిఁ జంద్రబింబాస్యఁ
బికవాణి మదనునిబిరుదువారువము
నడయాడుక్రొమ్మించునన దేవదేవి
జడపట్టి కుదిచి భూస్థలి వ్రాల నీడ్చి
తలగడనున్న నిద్దపుఁబైడిగిన్నెఁ
గలయంగ వీక్షించి కైకొని పిదప
నుయ్యాలపైనున్న యోగీంద్రు మున్ను
*పయ్యాడి కరువలిపట్టె దానవులు
పట్టిబంధించినపగిది బాహువులు
పట్టి యాతఁడు గట్టుపంచెచేఁ గట్టి
పురిలోన నీసరిపూఁబోఁడు లెల్ల
దొర పని నినుఁ జెప్పుదురుగదె యెపుడు
నట్టి నీవేల రంగప్పునిగిన్నె
యెట్టు గైకొంటివే యీదొంగచేతఁ

*పయ్యాట

గొల్లఁగా భువి రాచకొడుకులసొమ్ము
లెల్లను గైకొంటి విలుచూఱఁగాఁగ
నందునం దనివోక యాస పెద్దగుచు
నిందున కొడిఁగట్టితే యంచుఁ బలికి
గందంపుగొమ్మలఁ గాలాహి చుట్టు
చందంబునను గరజలజాతయుగళిఁ
బెడమరలఁగఁ బట్టి బిగియుంచి కుదిచి
నిడుదతుమ్మెదకప్పు నెఱివేణిఁ గట్టి
మిగిలినజడ కేలి మొయి*నిండనూలు
సొగపున నిరుమూడుచుట్టులుసుట్టి
యోరి! సజ్జనుమాడ్కినున్నాఁడ విప్ర
డేకేతి లాగించి తీపైఁడిగిన్నె
గడుస! నీకెటువంటి కనుమాయ గలదొ
జడియక పద్మజశంకరాదులకుఁ
దలచూపరాని శ్రీధరునగరంబు
నలవోకఁ జొచ్చితి వౌరౌర దొంగ
నీమేన నిండార నెనయునామములు
నామము ల్గంపు కన్నపుఁగత్తు లరయ
నన విని "నీలీలలా? రంగ! యనుచు
ననిమొ వారలతోడ నాషూనివిభుఁడు

*దండ

వినరయ్య నీతికోవిదులార రంగ
జననాథుసొమ్ము వంచనచేసి యేను
దెచ్చినవాఁడనో దేవదేవికిని
ఇచ్చినవాఁడనో యేలయ్య నన్ను
విడువుండ యనుమాట వినునంతలోనె
కడుఁగోపమున విటకంటకి వచ్చి
యెట్టెట్టురా యోరి యీనడు రేయి
నెట్టన శిష్యుచే నీ వంపలేదె ?
యంపలే దని కల్లలాడెదు ప్రాణ
మింపని బొంకెదిట్లేలరా యనుచుఁ
గెరలి వెన్నెలలు గ్రక్కెడుచకోరముల
కరణి లోచనములఁ గ్రమ్మనశ్రువులు
చెక్కుటద్దములపైఁ జింది క్రిక్కిఱిసి
కక్కసం బగుచనుగవమీఁద నురలఁ
దల వంచి సిగ్గునం దనతోడ మగుడఁ
బలుకనేరక దుఃఖపడుచున్నకూఁతుఁ
గనుఁగొని వరదలై కన్నీరు జాఱ
ఁనెనయఁ గౌఁగిటఁ జేర్చి యిట్లని పలికె
యెప్పుడే వీఁడు దొంగని యేను జాటి
*ప్పన నామాటఁ జెవిఁ బెట్టవైతి

పనిఁబూని తాము చంపము తాఁడు చంపె
ననియెదు పీఁడ్రి నోయమ్మ నమ్ముదురె
ముందర నీరీతి ముదిమాట లాడి
యొందఱిఁ జెఱిపెనో యీకొంపచెఱుపు
గౌళ నేపాళ బంగాళ పాంచాళ
చోళాదిరాజన్యసుతులు నిచ్చలును
కైలాగు సవరింపఁ గైకొనుచేతు
లీలాగు కట్లకు నెట్లోర్చునమ్మ
చెలువలు నేర్పుమైఁ జిక్కుడలింప
బలిమిఁ బట్టుకుమని పాటించి వేణి
నదయులై తలవరు లదరంటఁ బట్టి
కుదియింప నెట్లోర్చుకొంటివే కూన!
కెందలిరాకుసోఁకినయంతలోనె
కందెడుమేను కర్కశపాణు లిపుడు
తొడిబడ మెడవట్టి ద్రొబ్బంగ నెంత
యడలుచు *నేగెదో యమ్మ! నాగుమ్మ!
యందఱు నిటకు రమ్మని గారవింపఁ
జెందనిసభలకుఁ జెల్లఁ బో నేఁడు
కట్టిడిదొంగని గాసించి విఱిచి
కట్టికొంపోవ నేగతి వేఁగెదమ్మ!

*వోఁగదె

యని బిడ్డఁ గౌఁగిట నలమి పోనీక
మునుకొనిదుఃఖించు *ముదియ నీక్షించి
రావె దొంగలనంపి రాత్రి వేవేగ
దేవదేవునిసొమ్ము దెప్పించునపుడు
నవ్వను బిమ్మట నగరివా రెఱఁగి
యివ్విధిం బట్టిన నేడ్వవా? త్యాఁగ!
కృపవుట్ట బిడ్డఁ గౌఁగిటఁ జేర్చి చేర్చి
యిపుడు సెప్పెడు బుద్ధు లెటఁబోయె నప్పు
డని తిట్టి పొమ్మన్న నంతటఁ బోక
తనకూఁతు వెనువెంటఁ దగిలి నాపోవ
నొక్కట వడిఁ †దలాయొక పెట్టు పెట్టి
కుక్కఁగొట్టినయట్లు కొట్టి చీకొట్టి
తలవరు లప్పు డంతటఁ బోకయున్న
దొలఁగంగ నిల వ్రాల ద్రొబ్బి నవ్వుచును
ఆకోమలాంగితో నామునివరుని
దోకొనిపోవుచోఁ ద్రోవ నున్నట్టి
చెలువలు మగలుఁ జప్పించి లోలోనె
తలపోసి పలికి రాదట వారిఁ జూచి
తన వేఁడి తేజ మంతయు డాఁచి పుడమిఁ
జనుదెంచుసూర్యునిసరణి నున్నాఁడు

* ముద్ది † దలనొక

తలకొని నడికంకుఁ దరలించి డిగని
కళలతోఁ జంద్రునికరణి నున్నాఁడు
ఇతఁడు దొంగిలునటే యితఁడు యోగీంద్రు
గతి నున్నవాఁ డేమికర్మమో కాని
దీనిఁ జూచిన సానఁదీసినమరుని
చేనున్ననారఁజిచెలువ్రుఁ జూపెడిని
కన్నియ తుది నెండకన్నును నీడ
కన్ను నెఱుంగనికమ్మపూఁబోఁడి
గోలచూచినరాచకూఁతురువంటి
దీలాగు కట్లకు నెట్లోర్చె నమ్మ
కష్టపువిధి గాక కడపట దీని
దృష్టించి చూచిన దృష్టిదాఁకెడిని
గడపటఁ దమసేయుకష్టవర్తనకు
నొడఁబడకున్న నీయురుపుణ్యనిధుల
కోవఁజాలనివార లొక్కొక్క నింద
పైపైవ నీదెస పాటిల్లెఁ గాని
వీరు దొంగలు కారు వివరింప ననుచుఁ
జేరి యెబ్బాసైన సేయుంగవచ్చుఁ
గంటు తెల్లంబుగాఁ గానక యొరుల
నిందింపవచ్చునే నిర్ణిమిత్తంబ

యనువారు కొందఱు నటఁ దోఁచినట్ల
యనువారు నై యుండి రప్పుడు భటులు
వారిఁ దోకొనిపోయి వనజాక్షుగిన్నె
యూరయరాదా యె నని *యాత్మలోన
నందంద చింతించు నయ్యధికారి
ముందర నిడి కేలు మొగిచిన నతఁడు
గాసించి వీరి నిక్కడ నాకు నేన
చేసేతఁ బట్టి శిక్షించితి నేని
ఈజాడ తన కేల యెఱిఁగింప వనుచు
రాజు విన్నను నపరాధంబు వచ్చు
నని వారివారిచే నగపడినట్టి
కనకపాత్రింబు దిగ్గనఁ గొనిపోయి
రుచిరసింహాసనారూఢుఁ డైయున్న
నిచుళేందుగ్రిఁ డగుచోళనృపతిముందరను
ఇరువుర నిడి మొ్రక్కి యాకార్య మెల్ల
నిరవొంద నెఱిఁగించె నెఱిఁగించుటయును
విని భూవరుండు సవిస్మయుం డగుచుఁ
గనలి వారలదెసఁ గాంచి యిట్లనియె
నారంగపతికి ద్రోహముసేసినపుడు
చేరి వీరల నాజ్ఞసేయుటే తగవ.

* యాత్రిపకుచు

ధైన న్యాయంబున న్యాయంబుఁ దెలిసి
కాని మిమ్మిట నాజ్ఞఁ గావింపఁ దగదు
హెచ్చినకడఁక రంగేశ్వరునగరు
సొచ్చినచందంబు చొచ్చి యాగిన్నె
తెచ్చినబాగును దెగువమై మీకు
వచ్చినలాగును వలవ దున్నట్టి
రవళిసేయక, పదరక, యొక్కరొకరె
వివరంబుగా మాకు వివరింపుఁ డనిన
దిట్టయై యాదేవదేవి దా వీణె
ముట్టి నాదించినమురువు దీపింపఁ
జుక్కలతో నొప్పుసోముచందమునఁ
జిక్కటిల్లెడుబాష్పబిందుపూరములు
నొప్పెడియాననం బొకయింత యెత్తి
యప్పు డిట్లనియె దైన్యము పొడకొనఁగ
ఓసార్వభౌమ! లోకోన్నతచరిత!
నాసేయునేర మంతయు విన్నవింతు
నవధరింపుము పరాకది చిత్తగించి
వివరంబుగా నాదువిన్నపం బిపుడు
మునుపు *దేవరపాదములు గాంచి మగుడ
ననిపించుకొని పోవునపుడు మార్గమున

* మీదున్న సములు

నోకతోఁటలో నితఁడున్న మాయక్క
వెకలియై తనుఁ జూచి వెగ్గంబు లాడి
లలితంబు లైనవిలాసముల్ చూపి
వలపింపఁ గలవె యీవటువేషధారి
నని యని పంతంబు లాడునాయక్కఁ
గనుఁగొని యేనును గండగర్వమునఁ
గడనున్నగొడ్డలిఁ గాలిమీఁదటికిఁ
దోడిఁబడవైచుకోఁ దొడరినయట్లు
లారీతిఁ జేసెద నని చలపట్టి
మారీచువంటియీమాయావిఁ దగిలి
పిలిచి తోడ్కొనిపోయి పెరిమె మాయింట
నెలమిమై నుంటి మనేకకాలంబు
కనలి మాయమ్మ యొకానొకనాఁడు
తనమీఁద వేసరి తనుదిట్టుకొనిన
న్నది తన్నుఁ దిట్టెఁ బొమ్మని యెగ్గు గాఁగ
మదిఁబెట్టుకొస తమమై మచ్చరమున
నేచందమున నెటకేగెనో యేగి
తెచ్చి యీగిన్నియందిచ్చి వెండియును
దారాకశిష్యుచేఁ దనయింటికనుప
నారయ బంగారమని యడియాస

నూని నే మందిన యొక్కదోషంబె
కాని యొండెఱుఁగము కడపట నొకటి
మును* పారఁ డీగిన్నె ముచ్చిలి తెచ్చె
నని యేనెఱుంగ రంగప్పయే యెఱుఁగుఁ
గడముట్ట నిది లెస్సగా విచారించి
చెడుగునైనను నాజ్ఞ సేయుంపు మనుచు
నాదట నాదిమధ్యావసానములు
మేదినీశ్వరుని కిమ్మెయి నెఱింగింప
వసుమతీశ్వరుఁడు క్రేవల నున్నగిన్నె
దెసఁజూచి యాయింతిదెసఁ జూచి వగచి
మానీంద్రుకడఁ జూచి మాకుఁ దెల్లముగ
దీనిమాటలలోని తెఱఁగెల్లఁ దెలిసె
నీవుచెప్పెడిమాట నిక్కంబు చెప్పు
మావిప్ర! యనుఁడు నమ్మానివల్లభుఁడు
దిచ్చరియగునట్టి దీనిమాటలకు
వచ్చె నానిలువెల్ల వఖుకులపుట్ట
తానాడినటువలె తనయింటికడకు
నేను వచ్చుటయును నెనసియుండుటయుఁ
గలదు తానును దనుఁగన్నతల్లియును
వెలిమీఱఁ దమయిల్లు వెడలఁగొట్టుటయు

*వోరు

వకటకటా! యంచు నడలుచు నరిగి
యొకపంచ తిన్నెపై నొదిగియున్నంత
నారాత్రిఁ దముదామె యనురక్తి గలుగు
వారికై వడిఁ గైతవబ్రహ్మచారిఁ
బనిచి రమ్మని పిల్వఁబంచిన మగుడి
చనుటయె కాని యాజలజాక్షుసొమ్ముఁ
దెచ్చుట లేదు నేఁ దెచ్చి వీరలకు
నిచ్చుట లేదు రంగేశుఁడే యెఱుఁగు
ననవిని యాబోటి యద్దిరా! రేయిఁ
బనివడి నీవనుపవె శిష్యుచేతఁ
బూని యీసభలోన బొంకుటకాక
యానలు గొన్నియే యనిన నాతపసి
చెనఁటిరో! యెక్కడిశిష్యుండు లేని
యనుచరుం గల్పించి యాడ నేమిటికి
నని వితర్కింపంగ నవనీశ్వరుండు
గని వారికలహంబు కలయవారించి
మత్తుండు కామినీమదదృష్టిచలిత
చిత్తుండుఁ గాన నాతఁడిపుఁ డజ్ఞతను
దనకొల్వులోనివిద్వాంసులు నృపులు
వినుచు నచ్చెరువంద వివరించిపలికె

నెన్నైతైన నితఁ డింక నిదిదొంగిలింప
నెంతటియది చూడ నితఁ డెంతవాఁడొ
వచ్చిపోయెడువారు వలయునర్థములు
తెచ్చి యేమిచ్చినఁ దేతెమ్మటంచుఁ
గోరి వేవేగఁ గైకొనుకొల్ల లంజ
వారికిఁ దగవె యేవలనఁ జూచినను
వీరిమాటలబాగు వింటిరే మీర
లేరివంకది నేర మెన్నిచూచినను
బూఁచి యీమాటలఁ బోలింపఁ దనకుఁ
దోఁచినగతిఁ జెప్పుచును వినుఁ డనుచు
నీతలోదరి వమ విచ్చినాఁ డనియె
నీతఁడు తను వమవే పిల్చె ననియెఁ
దలపోయ వపువుచందంబు బిరుపురుసను
గలుగంగఁ జెప్పిరి గతి విచారింప
రీతిగా బ్రహ్మచారియొ యేల యితనిఁ
దోతేర నీరింటితొత్తులు లేరె?
యొంటిమై నవసేయి నోడక వీరి
యింటికి వడువు రా నేమికారణము
అన్నతాదొంగిలి యది పోలబొంక
కున్నమై నపరాధ మొదవెను ననుచుఁ

బులిమినం డెలియదే భూసురమాట
*పొలుపుబొంకుగఁ దలంపున మీకు లేదె?
యని విప్రవరుని దొంగగనిశ్చయించి
వనజాక్షి నైఁ దప్పు వారించి కరుణ
విమఫుఁడ యని కల్లు విడిపించి దాని
కుడుగర లొసఁగ నయ్యుడురాజవదన
బళిరె! నాయేలిక! బాపురే! భూధ
వులశిరోమణి! తగవులచక్రవర్తి!
దొంగనినంత కట్టుఁడు కొట్టుఁ డనక
సంగతి కల్ల నిజంబు లేర్పఱచి
యీరీతి మన్నింప నిది నీకె చెల్లు
నో రాజదేవేంద్ర! యుర్వీశచంద్ర!
యనవిని భూపాలుఁ డాపైఁడిగిన్నెఁ
గొనిపోయి శ్రీరంగకువలయేశునకు
నర్పింపు మని యప్పు డారంగవిభుని
తీర్పరిం బిలిచి చేతికి నిచ్చి కనలి
యీచోరునకు నాజ్ఞ యేది శాస్త్రంబు
చూచి సేయింపుఁ డచ్చుగ మీ రటంచుఁ
దెలియ విద్వాంసులదిక్కు వీక్షించి
పలికిన పలుకులోపలనె యబ్రమునఁ

*పొలసుబైదగ తలంపున మీకు లేవె!

దమ్మికెంగేలు గదాపాణితలము
గ్రొమ్మించుకెందమ్మి గుంపులసీన
వలనొప్పు పదియాఱువన్నెలదట్టి
ధళధళల్ దశదిగంతంబులం బొదువ
డాలైన మకరకుండల చకచకలు
*వాలుఁజెక్కులను దువాళముల్సేయఁ
బూసిన సిరిగందవొడిబుగబుగలు
డాసి పంకజభవాండము చోదుముట్ట
మిండతుమ్మెదలకామెతలుగావించు
దండినెమ్మొవిచెంతల గొండ్లిచూప
నెలమించుదీవల నెలయించుమేని
చెలువ యురోవీథిఁ జెన్నగ్గలింప
నురుతరకౌస్తుభద్యుతిపల్లవములు
దొరసి వక్షోవీథిఁ దుళగింపుచుండ
నెమ్మోముదాసుర నెరయునెత్తావి
కమ్మకస్తురితిలకపుఁదేఁటి గ్రోల
రంగనాథుఁడు తనరంగ విహంగ
†పుంగవు నెక్కి వేల్పులుఁగొల్వ వచ్చి

---

*పాలుచెక్కుల మరువాళముల్ సేయు
†పుంగవనాయకాద్భుతవాహుఁ డగుచు

యతులితగతి జను లరుదంది చూడ
నతనికిం బ్రత్యక్ష మయ్యె నవ్వేళ
మును వైనతేయుసమ్ముఖమునం జెగడి
యనిరుద్ధబంధంబు లరిగినపగిది
ననవిల్తుతండ్రిముందర నిల్చినంతఁ
దనుదానె యూడె నత్తపసిబంధములు
జను లెల్లఁ జూచి యాశ్చర్యంబు నంద
వనజాక్షుఁ డాయోగివరుఁ జేరఁ బిలిచి
భక్తిమోక్షంబున భవరోగపాశ
ముక్తుని లాలించుమురువున నతని
గారవింపుచుఁ జోళకాంతునిఁ జేరి
యోరి! నీ కిటుసేయ నుచితమే తలఁప
నీగతి నిల నటియించినవాఁడ
నీగిన్నె నీరల కిచ్చినవాఁడ
నేను నీవెవ్వాఁడ వితఁడు నాబిడ్డఁ
డేను గూర్చినధనం బితనిది గాదె?
చేకొని లంజ కిచ్చినయట్టిసొమ్ము
కైకొందునే యేను గడు నీతిదక్క
వారి కిచ్చినసొమ్ము వారికే యొసఁగి
నారీతి నయ్యోగినాథు నాతనయుఁ

దలఁపోయు మనుచు నాతాపసోత్తముని
తలఁపునెత్తమ్మి నత్తఱిఁ బ్రవేశించి
తలయూఁచు నమ్మహీనాథవుఁడు డెందమునఁ
దలఁకొని భీతితోఁ దనవారుఁ దాను
నచ్చెముఁటి సాష్టాంగ మతనికి నెరఁగి
యెఱుఁగక సేసితి నీతప్పిదంబు
కావవే శ్రీరంగకాంతుండ వీవ
కావవే నను నేలు కరుణాంబురాశి
నీవ శ్రీరంగేశునిజకుమారుఁడవు
దేవర సుతుఁడ నైతిని యే నటంచు
నావేళ నతసి సింహాసనారూఢుఁ
గావించి తత్పాదకమలము ల్గడిగి
తనపట్టమహిషులుఁ దాను నందంద
ఘనభక్తిమై నూడిగంబులు సేసి
యోజపెంపున వివిధోపచారములఁ
బూజించి యాయోగిపుంగవుం గొలిచి
యాసక్తిఁ జతురంతయానావరోహుఁ
జేసి కైసేసి విచిత్రవైఖరులఁ
బటహభేరీతూర్యపణవాదివాద్య
చటులఘోషంబులు జగమెల్ల నిండ

భజనఁ జూపట్టు నాపలకికొము
భుజమున నిడుకొని పురవీథులందు
మెరయింప నప్పారమీనలోచనలు
పరమైన యపరంజిపళ్యెరంబులను
ఘనసార దీపముల్ కడువింత లెసఁగ
నొనరించి యారతు లొసఁగ నచ్చరలు
దేవకామినులు భూదేవకామినులు
సేవించి దీవించి సేసప్రా లిడఁగ
నీరీతి పురమెల్ల నేగింప మగుడి
ధారుణీవిభుఁడు సద్మమున కేతెంచె
నారాజుమై నప్పు డామౌనిరాజు
చారుకృపామృతాసారంబు నించి
యతని వీడ్కొని రంగహర్మ్యసన్నిధికి
నతివేగమునఁ బోయి యవనతుం డగుచు
దనసేయునట్టికృత్యము నీచమైన
ఘనతరభోగ్యంబు గాఁగఁ జేకొన్న
యీసర్వసులభుని నిందిరానాథు
వాసుదేవునిఁ దండ్రి వాత్సల్యజలధి
యేమని వినుతింతు నిభరాజవరద !
నీమహామహిమ వర్ణింప శక్యంబె ?

యని వినుతింప రంగాధినాయకుఁడు
మునినాథుఁ జూచి ప్రమోదించి పలికెఁ
దనయ! నీవరసుమధామకైంకర్య
మునకు మెచ్చితి వరముల నభీష్టముల
నడుగు మటన్న నీదగుభక్తజనుల
యడుగుదమ్ముల రేణు వనుపేరు నాకు
దయసేయుమా శాశ్వతంబుగా ననిన
దయసేసి యారంగధవుఁ డట్లయొసఁగి
తనసేయు గోపకాంతావిహారంబు
వినుతించువారి కెవ్విధి ఫలం బొదవు
నారీతి సౌభాగ్య మబ్బు నీచరిత
ధారుణి నొకమాఱు దలఁచువారలతు
నని యానతిచ్చిన నదిమొది గాఁగ
జననుతుం డగుచుమాని జనవరేణ్యునకుఁ
బనుపడ భువిలోన భక్తాంఘ్రిరేణుఁ
డనుపేరు విలసిల్లె నమ్మహాయోగి
పరమవైష్ణవనుతపదపద్ముఁ డయ్యు
హరిభక్తపద*పద్మ మాత్మఁ గోరుచును
బరమవిరక్తుఁడై పద్మజముఖ్య
సురశిరోన్యస్త విస్ఫురితాంఘ్రి యగుచు

*తీర్థ

పరసమృద్ధి వహించి భవను లడంచి
హరిభర్త తాఁ గాంత ననుచు భావించి
తనతోటిగతి సుముధామకైంకర్య
మొనరించుకొనుచు సర్వోన్నతుం డగుచుఁ
దావనమాలికాత్మజుఁ డైనకతన
నావనమాలికి నంకితంబుగను
లాలితవేదజాలప్రసూనముల
మాలిక గాఁగ శ్రీమాలిక యనెడు
కృతియును బ్రాబోధికీఖ్యాతి దనరు
కృతియును నవరించి కృతకృత్యుఁ డగుచు
నిరతంబు హరిపదాన్వితచిత్తుఁ డగుచు
బరమయోగానందభరితుఁ డైయుండె
నాదేవదేవి రంగాధీశ్వరుండు
భూదేవబాలురూపున దూతకరణిఁ
దనయింటి కేతెంచి తనజాతినీతి
యునికిఁ గన్గొనక సర్వోత్తముం డయ్యు
మునివరేణ్యునికతమున సర్వభాగ్య
మనువొందెఁ దనకని యాత్మ నుప్పొంగి
పరమయోగీంద్రుకృపాదృష్టివలనఁ
బరమవిరక్తుమై భవముక్త యగుచుఁ

దనసకలోత్పత్తి ధవళాక్షుఁ డొసఁగు
కనకపాత్రంబునఁ గైకొనివచ్చి
శ్రీరంగవిభుని కర్పించి తత్పాద
నీరజభావననిరతయై యుండెఁ
బరమపావనమైన భక్తాంఘ్రిరేణు
చరితంబు భక్తి నిచ్చలు నెవ్వరేని
వినిన వ్రాసినఁ జదివినను వాక్రుచ్చి
నను వారి కెపుడు వైష్ణవులసత్కృపయు
హరికృపామృతము. ననంతమై పొంగి
పరిపూర్ణమై యుండుఁ బ్రతిలేక యనుచు
నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి కబ్జపాణికిని
యతిలోకమతికి శేషాచలరాజ
పతికి నగోముఖ్యభక్తసంతతికి
నంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్ళ*పాకాన్నయార్య
తనయ తిమ్మార్యనందన రత్నశుంభ
దనుపమశ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ

---

*పాకన్నయార్య

సదనావధూలబ్ధసరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగివిలాసకృతిని
యతులితంబుగఁ జతుర్థాశ్వాస మయ్యె.



# పరమయోగివిలాసము.

## పంచమాశ్వాసము.



హైమసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
మునిశాలికాసారముఖ్యభక్తాళి
వనమాలి! యవధారు వరదానశీలి!
యవిరళశ్రీలచే నమరుదేశంబు
రవణించు బాండ్యమండలమధ్యమమునఁ
బొగడొందు శ్రీవిల్లిపుత్తూరు నాఁగ
నగర మొక్కటి యొప్పు నవ్యవైఖరుల
నవ్వీటిసౌధచంద్రాననామణుల
నవ్వువెన్నెలసోగననల నిచ్చలును
విలసిల్లుతావుల విన్నేటిలోని
కలువలు వికసించుఁ గమలముల్ మోడ్చు
నలపురివీథుల ననిశంబు మెలఁగు
జలజనేత్రలకటాక్షంబులవలన

మట్టుమీఱిన పుష్పమయతోరణములు
కట్టకట్టినగతి నొప్పుచుండు
నట నొప్పు శేషపర్యంకంబునందు
వటపత్రశాయి నా వసుదేవసుతుఁడు
తనయపాంగామృతధారలచేత
వినుతతాపత్రయవిపులార్తి నార్చు
ననుపమం బైనట్టి యప్పట్టణమున
వనజలోచనముఖవనజవంశమున
సిరిమించుకళలతో జ్యేష్ఠమాసమున
వరలగ్నమున గంధవహతారయందు
నక్షీణవేదమయాంగుఁ డైనట్టి
పక్షీంద్రునంశంబు ప్రభవించి జగతి
నెట్టన సురగురు నిరసించుపేర్మి
భట్టనాథుం డనఁ బరఁగి వెండియును
నరయంగ సకలకళాశ్రయుం డగుట
నిరుపమకారుణ్యనిధి యైనకతన
వైష్ణవపూజావివర్ధనుం డగుట
విష్ణుచిత్తుం డనవిఖ్యాతి నంది
యచ్చటివటధాము హరికోటిధాముఁ
బచ్చవిల్తునితండ్రి భక్తిఁ గొల్చుచును

ఈసరోజాక్షున కెట్టిపూజనము
సేసి చిత్తంబు రంజిల్లఁజేయుదునొ
యని రమావిభునిదశావతారములు
మనములోపలఁ బలుమాఱుఁ జింతించి
నందనందనుఁ డైన నందకపాణి
నందితకథల నానందించుకొనుచు
మథురలోఁ దొలుత మన్మథవైరి కంసు
వధియించుకొఱకుఁ దీవ్రత నేగి యేగి
హాగిపుష్పలావకుండగు వానియింటి
కరిగెఁ బుష్పలకునై యాత్మ నొండెడక
కావున ధవళపంకజలోచనునకుఁ
గావించు సకలయోగంబులకంటె
నరయంగఁ గడుమనోహరమైనపూజ
విరులపూజన మని వివరించి తెలిసి
భావించి వటధామభర్త కే నట్ల
కావింతు సుమదామకైంకర్య మనుచుఁ
జందన చాంపేయ శారద వకుళ
కుంద మాకంద ముకుంద మందార
కరవీర ఖర్జూర కరక జంబీర
కురువ కరంట కాకోల నారంగ

కేసరి కింసుక కేతకి నాగ
కేసరము ఖవరక్షితిజవల్లికల
సురరాజువనము, నసురరాజువనము
నరపాలువనము, వానరపాలువనము
నగుచు గేలింపుచు నంటుసేయుచును
బొగడుచు జగతి కద్భుతము దీపింప
లలితసంతతచైత్రలక్ష్మిచే మిగుల
నలవడ నారామ మభిరామముగను
నొనరించి యమ్మహాయోగీంద్రచంద్రుఁ
డనయంబు భక్తితో నరవిరుల్ గోసి
దామములు గట్టి నిత్యము వటపత్ర
ధామమూర్తికి నర్పితంబు సేయుచును
పరవిధారకముఁ బోషకము భోగ్యంబుఁ
గరిరాజవరదుకైంకర్యంబు గాఁగఁ
దలఁపుచు నితరచింతలు గట్టిపెట్టి
యలఘువిద్యాసంగతాత్ముఁడై యుండె
నాకాలమున నొప్పు నగణితశ్రీలఁ
బ్రాకటం బగు మధురాపురం బనఁగ
నురుతరం బగుచు సర్వోత్తరం బగుట
నరయంగ రాజరాజాన్వితం బగుట

నలకాపురముఁ బోలె నమ్మహానగర
మలరు నచ్చటిమేడలందుఁ జరించు
నేణాంకవదనలముఖచంద్రబింబాలు
లేణాంకబింబాలు నెదురుతాకైనఁ
దమపతి యితఁడంచుఁ దలఁపంగలేక
భ్రమసి తారాళి యేర్పఱుపరాకుండు
నాపట్టణాధీశుఁ డమరేంద్రుఁ డొడరి
యాపట్టణాంబేలు నమృతాంశుకులుఁడు
దీపకవల్లభదేవుండు ఘనుఁడు
భూపచంద్రుఁడు పాండ్యభూవల్లభుండు
జనులెల్ల జయలిడ సకలరాజ్యంబు
బనుపడ నెంతయుఁ బాలించుచుండి
తనయేలుపురమునందలిసర్వజనుల
యునికియు వారాడుచుండువాక్యములుఁ
గన వినం గోరి యొక్కఁడ యొక్కనాఁట
వనయుంబుఁ గార్కొమ్మ*నట్టిరేరేయి
భృంగకాంతుల జళిపించువన్నియల
గొంగడి ముసుఁగిడుకొని యుల్లువెడలి
పీటలోపల వీథివీథులఁ బారు
లాడువాక్యంబుల నాలకింపుచును

*నట్టినడురేయి

అరిగి పురంబెల్ల నంతయు నరసి
తిరిగి యింటికి నేగుదెంచుచునుండి
యొకపంచతిన్నెపై నొక్కండ యలసి
నికటభాగంబున నిద్రించుచున్న
భూసురవరుఁ జేరఁ బోయి యూఁచెంత
నాసీనుఁ డగుచు నొయ్యన మేలుకొలిపి.
యొకనేర్పుమైఁ బ్రసంగోచితోక్తులను
వికసింపఁ జేసి కైవీడియం బొసఁగి
యెందుండి వచ్చితి వీరీతి నొంటి
నిందేల నిద్రించె దీవు నావుఁడును
బనివడి దివ్యసంపద లొసఁగంగ
మునుమిడి ఘనదోషముల మోసఁగంగ.
మహితవిజ్ఞానంబు మదిబొసఁగంగ
నిహపరసౌఖ్యంబు లెసగంగ, జడిసి.
దుసికిలిలోనిశత్రులు విసుకంగ
వెసగంగ కరిగి వేవేగంబ మరలి
చనువాఁడ నగుచు నిచ్చట *నెండవడిని
వెనుకొన్న బడలిక విశ్రమించెదను
అన విని భూనాథుఁ డవనీసురేంద్రుఁ
గనుఁగొని పలికె. నక్కడఁ బెద్దలైన

* నెంతవడిని

సదమలజ్ఞానుల సంగడి మీరు
చదివివచ్చినవిశేషము గల్గెనేని
యానతిమ్మన విని యాత్మ నస్పొంగి
భూనాథుతో విప్రపుంగవుఁ గవుం డనియెఁ
గడునేర్పుమై వానకాలంబుకొఱకుఁ
గడమ యెన్మిదినెల లగడియింపవల్లయు
వగపడురాత్రికై యాత్మఁ జింతించి
పగలె వస్తువుల సంపాదింపవలయు
మునువచ్చువార్ధకమునకునై నరుఁడు
తనయౌవనమున యత్నము సేయవలయు
భాజనీయం బైనపరకారణంబు
నీజననమునందె యెఱుఁగంగవలయు
ననునర్థములు గల్గి యఘుదూర మగుచుఁ
జనగ వర్షార్థ మష్టాప్రయ తేత
మాసాననెడుశ్లోకమహిమఁ దా నప్పు
డాసార్వభౌముతో ననువదించుటయు
నాలించి విభుఁడు తదర్థ మంతయును
జాల డెందంబులోఁ జర్చించి చూచి
కోరక కర్మానుగుణముగా నెపుడు
వారక సంపద ల్వచ్చుచున్నవియు

కలదె యదృష్టంబు గలిగించువెరవు
తెలియంగవలయు నింతియ యాత్మ కనుచు
నగరికి నంతఁ గ్రన్ననఁ జేగి కలువ
పగదాయ పొడుపుగుబ్బలిమీఁదఁ బొడమ
నుచితసంధ్యావిధు లొనరించి రత్న
రచిత సభామందిరమ్మున కేతెంచి
యింపుమై భూనాథు లిరుమేలఁ గొలువ
సంపదం డనుపేరఁ జనుపురోహితుని
రావించి తనయంతరంగంబులోని
భావమంతయుఁ దేటపడఁ జెప్పఁదొడఁగెఁ
గలయంగ ధర్మార్థకామసౌఖ్యములఁ
దెలిసి యవ్విధుల వర్తించి చూచితిని
బోలింప నంతిమపురుషార్థసిద్ధి
యేలీలఁ దెలియుదు నెఱిఁగింపవలయు
ననిన రాజేంద్ర! నీ వడిగినసూక్ష్మ
మనిమిషులకు నైన నది యెన్నఁ దరమె
యైన మహాత్మ! శ్రీహరిపాదమతివి
కాన నీ వెఱుఁగంగఁగలవు చెప్పెదను
నిగమాంతవిధులచే నిశ్చితం బైన
నిగమార్థ మాత్మలో నిలిపి నమ్మినను

గానంగవచ్చు మోక్షముత్రోవ యెల్ల
భూనాథ ! యన మనంబున విచారించి
కనకముల్ పెక్కు సుల్కంబు గావించి
తనసభాస్తంభమధ్యమునఁ గట్టించి
యలయంగఁ దనలోనియనుమాన మెడయ
ధర నెవ్వరేఁ బరతత్త్వనిర్ణయముఁ
జేసి యీశుల్కంబుఁ జేకొనుం డనుచు
రాసికి నెక్కుమర్యాద గావించి
ప్రకటవివేకసంభరితులచేత
సకలదిక్కులయందుఁ జాటంగఁ బనిచెఁ
బనిచినఁ గపిలాక్షపాదభట్టాది
ఘనశాస్త్రవిదు లైనఘను లేగుదెంచి
యారాజుసన్నిధి నాసీను లగుచుఁ
జేరి యొండొరులు చర్చించి చర్చించి
యది మృష యిది మృష యనుచు గర్వంబు
లదరంగ హాస్యవిన్యాసంబు లెసఁగ
వినుఁడు పల్కులు గర్వించి మామొకట
వనర నేమిటికి సర్వము మిథ్య మాకు
వనయంబు నిశ్చయం బగు నె మీచేత
ననుమానములదొంతి యాకార మెల్లఁ

గారు లేటికిఁ బుట్టు కర్ము లైనట్టి
మీర లీయర్థ మెమ్మొయి నెఱుంగుదుగు
పెలుచ మాటలరాసిఁ బెట్టనేకాని
తెలియునే మీకు నదృష్టకారణము ?
ఆగమబాహ్యుల రయినట్టిమీకు
నాగమాంతార్థంబు లవి యేల తెలియు
ననుచు నన్యోన్యమతాభిమాషణము
నొనరింపుచును జేరి యొండొరులనును
సారెకు నిగ్రహస్థానంబు లిడుచు
నీరీతి నిశ్చయం బెందును లేక
పెరుగు వస్లుచు గలిపినరీతి నుండ
నరనాథుఁ డంతె చింతాస్వాంతుఁ డయ్యె
నట ధన్వినగరవరావాసుఁ డైన
వటపత్రశయనుండు వాత్సల్యజలధి
తనకు నిచ్చలు పుష్పదామసంపదలఁ
గొనివచ్చి యొసఁగుభక్తుని విష్ణుచిత్తుఁ
గని వత్స ! పాండ్యభూకాంతునిసభను
గనుపట్టుకనకశుల్కంబుఁ గైకొనుము
అన విని యరుదంది యయ్యోగివరుఁడు
వినయ మేర్పడ విన్నవించె శౌరికిని

వేదమో శాస్త్రమో వివరించిచూడ
వేదార్థసాధ్యమై వెలయుశుల్కంబు
పాయక గుద్దలిఁ బట్టినకేలి
కాయలు చూపి యేఁ గైకొను టెట్టు
లితరవిచారంబు లెవ్వియు నెఱుఁగ
మతి నీదుపాదపద్మము లెఱుంగుదును
అన విని కరుణా కటాక్షామృతంబుఁ
జినుకుచు నావిష్ణుచిత్తుని కనియె
నీకడ సందియం బేటికి వలదు
నీ కేమిభార మిన్నిటికి నే నుండఁ
దలఁప నీహృదయపద్మములోన నేన
నెలకొని నిగమాంతనిశ్చితార్థంబు
పలికించువాఁడను బలికెడువాఁడ
నలమహాశుల్కంబు హరియించువాఁడ
నేన నీ వటఁ బోయి యిటకు రమ్మనుచు
నానతిచ్చిన యంత నాయోగివరుఁడు
పరమసంతోషసంభరితుఁడై యాది
గురుని యోగమున మిక్కుటపువేగమునఁ
జని యాంజనేయుండు జానకీనాథు
ననుమతిఁ గడలిఁ జయ్యన దాఁటినట్టు

లతులగ్రహాదిసమంచిత, వేగ
వతి యనునొకమహావాహిని దాఁటి
మధువైరి కుమతుల మర్దించుకొఱకు
మధుర సొచ్చినరీతి మధుర సొత్తెంచి
వాటమై మిగుల విద్వత్కదంబముల
బేటాడు నారాజుపేరోలగంబు
నల్లంత వీక్షించి యటకు నేతేర
వల్లభదేవుఁ డావనజాక్షుచిత్తు
నకలంకమతి యైనయభిమన్యుసూతి
శుకయోగి గనుగొన్న చెప్పునఁ గాంచి
గ్రక్కున సింగంపుగద్దియ డిగ్గి
యెక్కుడుభక్తిమై నెదు రేగుదెంచి
తనపురోహితుఁడును దానుఁ దత్పాద
వనజయుగంబుమై వ్రాలి యగ్గించి
తోకొనివచ్చి బంధురరత్నపీఠిఁ
జేకొని యాసీనుఁ జేసి సద్భక్తి
భ్రాజితంబుగ నర్ఘ్యపాద్యాదివిధులఁ
బూజింపఁ జూచి యప్పుడు చెంతనున్న
పరమతవాదులై పరఁగుపాషండ
ధరణీసురులు చూపుదాళ కిట్లనిరి

బహువేదవేదాంతపఠనాదివిధుల
మహి నెన్నఁదగు మహామహు లైనవారి
నజ్ఞులుగాఁ జూచి యతఁడునుం దానుఁ
దజ్ఞులపోలె నీధారుణీశ్వరుఁడు
బినుఁగుదాసరి నొకపెద్దగాఁ జేసి
కొనివచ్చి పొడవునం గూర్చుండఁబెట్టి
పలువిధంబులఁ బాలుపడి మాపుదనకఁ
జలివిషంబులు గొన్ని సేయుచున్నాఁడు
పట్టెనామంబులు ఫాలభాగమునఁ
బెట్టిన వచ్చునే పెద్దటీకంబు ?
ఆరాజుచేసినయది కొంత కాక
యీరీతి నేమిటి కీనుంచ కాయ
వైదికుఁడై యుండి వ్రాత్యచందమున
నీదెసఁ దాఁ బురోహితుఁ డైనవాఁడు
వల్లభదేవుండు వందనం బిడినఁ
జెల్లఁబో ! తా నేల సేసె వందనము
లంపటఁబడఁగఁ దాళ్ళకుఁ దలబంటి
యొంపటిచెట్లకు నిఁక నెంతబంటి ?
యనునీతిశాస్త్రంబు లందలికొదవ
లొనర దిద్దెడునట్టియోగ్యులచేత

నెక్కడఁ దీరని యీబీరకాయ
చిక్కదా నితనిచేఁ దీరుటయెట్లు
పన్ని యసూయయేర్పడఁ బలుమాఱు
నిన్నియు నన నేల యిందె చూచెదము
అనువారు కొందఱు నతఁడు మహాత్ముఁ
డనువారు కొందఱు నై యుండి రంత
హితవుమీఱఁగఁ బురోహితుఁడు భూధవుఁడు
నతు లొనర్పుచు భట్టనాథు వీక్షించి
యాదట మోహశాస్త్రావనీస్థలుల
భేదింపరాక యభేద్య మైనట్టి
యనుపమపరవస్తు వనువిధానంబుఁ
గనఁజేయువిద్యాపరీక్షాంజనమునఁ
బడపడి యెన్నేని బలుమాఱు నిచటఁ
దుద మొద లెఱుఁగక దుష్టవాక్యములు
నుడివెడువీరలనోళుల ముద్ర
లిడినట్లు వేవేగ నిఁక జాగుమాని
దాసవత్సల ! పరతత్త్వనిర్ణయముఁ
జేసి మమ్మిటు దయసేసి రక్షింపు
మనవుఁడు మోదించి హరిచిత్తుఁ డపుడు
తనలోనివటపత్రధాముఁ బ్రార్థింపఁ

బరమేష్ఠియనుమతిఁ బ్రాచేతసునకుఁ
బరిపూర్ణవిజ్ఞానపద మొందినట్లు
ఘనపాంచజన్యసంగంబున ధ్రువున
కనుపమసకలవిద్యలు వచ్చినట్లు
అఖిలేశుకృపను జిహ్వారంగసీమ
నఖిలశాస్త్రములు నృత్యములాడుచుండ
ననఘుఁ డాహరిచిత్తుఁ డనియె నవ్వేళ
జనపతి భూమినిర్జరులును వినఁగఁ
బ్రకృతిజీవులకు లోపలను వెల్పలను
సకలశాస్త్రముల నిశ్చలత దీపింప
నాది యంత్యము లేక యధికుండు సముఁడు
నేదెస లేక సర్వేశ్వరుం డగుచు
సర్వనియంతయై సర్వజ్ఞుఁ డగుచు
సర్వంబుఁ దనకు శేషంబుగా మెలఁగు
కాంతిఁ బాయనిమణికరణి నాదివస
కాంతుఁ బాయనిరుచిగతిఁ బద్మఁ గూడి
మిగులవేదములాడి మిథునం బటంచుఁ
బొగడఁ బెంపొందు శ్రీపురుషోత్తముండు
పరతత్త్వమని పల్కుపల్కులోపలనె
పరగునం దత్సభాస్తంభమధ్యమున

ఘనపాశములఁ గూడఁగట్టినముడుపు
తనుదానె యతనిపాదములపై వ్రాలెఁ
దోడనే మొఱసె దుంధుభులు రంభాదు
లాడిరి కొనియాడి రఖిలభూసురులు
సురలు మోదించిరి సొరిది నందంద
విరివాన గురిసె గావిరియెల్ల విరిసె
నప్పు డారాజేంద్రుఁ డంతరంగమున
నుప్పొంగి పొంగి యయ్యోగినాయకుని
బదపద్మముల వ్రాలి పరమానురక్తిఁ
బదివేలతెఱఁగులఁ బ్రణుతిఁ గావించి
యోపావనాత్మ! యోయోగీంద్రచంద్ర!
నాపాలిదైవంబ నను గన్నతండ్రి!
యనుచు నానందబాష్పాంబుపూరములు
దినుపార నాయోగినీరజమిత్రుఁ
బ్రచురమాల్యాంబరాభరణముఁ గావించి
రుచిరదంతావళారూఢుగాఁ జేసి
బహుతరచతురంగబలపుత్రమిత్ర
సహితుఁడై యనుచరుచందానఁ గొలిచి
తనపురంబెల్లఁ బ్రదక్షిణగతుల
నెనలేనివేడుక నేగించుతఱిని

ఆలోకపావనునఖిలవోత్సవము
నాలోకనము సేయునట్టివేడుకను
గమలాసనుఁడు చండకరశీతకరులు
నమరేంద్రసిద్ధవిద్యాధరుల్గొలువ
శ్రీహరి కలిమినెచ్చెలువతో గరుడ
వాహనారూఢుఁడై వచ్చి యవ్వేళఁ
దనయుఁడు బ్రహ్మరథంబుపై మెఱయ
జననియు జనకుండు సంతసం బొదవఁ
గనుఁగొనుగతి గజస్కంధంబుమీఁద
దనరారువిష్ణుచేతను గటాక్షింప
విష్ణుపదంబుపై వెలుఁగొందుచున్న
విష్ణు సేవించి యవ్విష్ణుచిత్తుండు
నరయ నకాలదేశాస్పదం బైన
పరవస్తు విపుడు చూపట్టెఁ గన్నులకు
ననిభక్తిపరవశుం డై శంబరారి
జనకునిఁ గాంచి యాజగదేకనాథు
సర్వజ్ఞుఁడును సర్వశక్తియుం దాన
సర్వంబు ననుచుఁ గ్రిచ్చర భక్తిపరత
జలజాక్షులావణ్యసౌందర్యముఖ్య
ములకె మిక్కిలి చిక్కి మోహించి యప్పు

డీమాహానాంగున కీదృష్టిదోష
మేమియు లేక సొం పెసఁగుఁ గాకనుచు
జంటలై మొఱయు కుంజరములై పసిఁడి
గంటలు తాళముల్గ్రాఁగఁ జేఁబూని
నవరసరాగవర్ణములఁ బెంపెసఁగ
సవరించి మంగళాశాసనం బపుడు
శ్రీమాల్యకారునిచే దివ్యపుష్ప
దామముల్ దాల్చి యుద్ధత రంగసీమ
జాణూరమల్లుని సమయించి మిగుల
రాణించుశౌరిదోర్దండంబులకును
వలపల రవికోటి వడఁకించుకాంతిఁ
దలుకొత్తుచుండుసుదర్శనంబునకు
నలచెంత నని దైత్యు లగలునాదములు
నలుపుచుండెడు పాంచజన్యంబునకును
నపరంజిబొమ్మరో యన నొప్పు మేన
నుపమింపఁ దగి యెద నున్నయిందిరకుఁ
గెందామరలపస గిలుబాడఁ పసల
యందంబు గలుగు నీయడుగుఁదమ్ములకుఁ
బూనికతోడ నిప్పుడు బంట నైన
యేనును నీవును నెర వింత లేక

యొనఁగూడియుండెడియునికి కెంతయును
నెనసియుండఁగఁ బెక్కొండ్లు మంగళము
మంగళం బని పలుమాఱు ననంతు
సంగతి మంగళాశాసనం బిట్లు
సవరించి మఱియు నాశౌరినందనుని
యవతారములయందు ననయంబుఁ జిక్క
దామోదరుని యవతారాదిలీల
లామోదమాలిక లై యొప్పుచుండఁ
బ్రామాణికోక్తిగర్భంబు లై యొప్పు
దాౌమిణోక్తులఁ బ్రబంధంబుఁ గావింప
ననయంబు హర్షించి యారమావిభుఁడు
తనదివ్యశక్తి యాతనియంద నిలిపి
శ్రీవల్లిపుత్తూరఁ జెన్నొందుచున్న
యావటదళధాముఁడై యనుమోంద
నరుదెంచి యప్పు డాయవనీశతిలకుఁ
డిరవొందఁ బురమెల్ల నేగించి పిదప
ననురాగ మిగురొత్త నావిష్ణుచిత్తు
ననుపమసింహాసనాసీనుఁ జేసి
మండితకాంచనాంబరభూషణముల
మెండియుఁ బూజఁ గావింప నయ్యోగి

వరనాథుఁ బెక్కుచందముల లాలించి
కరివరారూఢుఁడై క్రమ్మఱ మరలి
తనపురి కేగునత్తఱిఁ బౌరజనులు
వినఁ గ్రొత్తయైన యవ్వృత్తాంత మెల్ల
విని పురిఁ గైసేసి వేవేగ నెదురు
చనుదెంచి ప్రణతు లర్చనలు గావింప
భూరిరత్నాంబరభూషణావళుల
వారి సంభావించి వారనివేడ్క
వారునుం దాము నావటధాముఁడైన
నీరజనేత్రుసన్నిధికి నేతెంచి
యతనిపాదంబుల కందంద వ్రాలి
నుతి సేసి భక్తి కన్నుల నానతింప
నోతండ్రి! నాలోన నుండి వేదార్థ
జాతంబు భువిలోని జనులెల్ల వినఁగఁ
బలికించువాఁడను బల్కు శుల్కంబు
వలనొప్పఁ గైకొనువాఁడను నేన
యని యానతిచ్చితి రారీతి సమ్యో
ధన మిదే భద్రదంతావళం బిదియె
యని సమర్పించి నిజావాసమునకుఁ
జనుదెంచి యొప్పటిసరవి నిచ్చలును

నతులితం బగుభక్తి నారమాపతికి
నతనియుత్సవబేరమై ప్రకాశించు
నలఘువిద్యాపూర్ణుఁ డౌమురారికిని
నలరుదామంబుల నర్పించికొనుచుఁ
బరఁగువిరక్తిఁ బ్రబంధయుగ్మంబు
విరచించ లోకైకవిదితుఁ డైయుండె
నెన్న శక్యముగాక యిలలోన నున్న
తోన్నతం బైన యియ్యోగీంద్రుచరిత
ననలోత్తుకూర్మినై నరు లెవ్వరేని
వినిన వ్రాసినఁ జదివిన నుతించినను
భయములు దార్చు శోభనములు చేర్చు
జయముల నిచ్చు దుర్జయము లడంచు
నట ధన్వినగరవరావాసుఁ డైన
వటధామపాదజీవనమట్పదంబు
చిరతపోనిధి విష్ణుచిత్తుఁడు వారికిఁ
గరమర్థి సుమధామకైంకర్యపరత
ననిశంబుఁ దనసేయు నారామమునకుఁ
జనుదెంచి యవ్వనస్థలిఁ బాదుకొన్న
పొన్నమ్రాఁకులకెల్ల బోదిగావించి
కన్నియ ముగలిమోకల సేద్యపఱచి

గొజ్జంగిపొదలకుఁ గుదురు లమర్చి
గుజ్జుమొల్లల కాముకొన నీరుగట్టి
కరవీరములదండఁ గాలువల్ దీర్చి
విరవాదిపాదులు విరివి యొనర్చి
కలయంగ మరువంబుకల పేర్పరించి
యలవిమీఱినమల్లియల కంటులొత్తి
పారిజాతములకుఁ బాదు లమర్చి
యీరీతి మఱియు ననేకవైఖరుల
నారామసీమ సొంపారెడుపువ్వు
భూరుహావల్లికాభూరిసంతతికి
నవవసంతుఁడపోలె ననలొత్తఁజేసి
సవరగా నచట నేచక్కిఁ జూచినను
మిసిమిగా నల్లడ మిట్టు బల్లంబు
కసవుఁ గట్టియు డాయుఁ గంప లేకుండఁ
బస మించు కన్నులపండువు గాఁగ
వసుమతీసతికన్నువలె నుండఁజేసి
పరిమళమిళితపుష్పంబులు గోసి
కరమర్థి నించిన కరఁడిచే బలసి
పనుపడ మనురాజపరనచే వెలసి
మనమున సంతోషమగ్నుఁడై తులసి.

పొలుచు క్రొన్ననలతోఁ బొలుచు నెత్తావిఁ
గలసి వన్నియమరకతముల సొలసి
వరపుష్పములసౌరభంబులఁ గలసి
సిరిమించు తులసి వేంచేయింపవలసి
తొలఁగెడు బహుపుష్పధూళిమధూళి
బెరసి పంకముగఁ జిప్పిలుచోట్ల దాఁటి
తవిలి యావనదేవతలు వనశ్రీకి
సవరించుదీపికాస్తంభంబు లనఁగ
మొగశిరోమాణిక్యముల పాపరేలు
తగిలి వేడించుచందనములు గడచి
ప్రవహించుచున్నమరందవాహినులఁ
దివుటమై దాఁటి యెంతే వేడ్కతోడఁ
గట్టిగాఁ బువ్వులకరఁడి యొక్కెడను
బెట్టి గుద్దలిఁ గేల బిగ్గ నమర్చి
ననుపారఁ దులసీవనంబు నల్గడలఁ
దనరఁ ద్రవ్వుచునుండి తన్మధ్యమునను
శుచిమాసమునఁ బుణ్యశుభముహూర్తమున
రుచిరగారుత్మతరుచిరేఖ వోలెఁ
దోరమౌ నొకమంచితులసిమూలమున
ధారుణియంశ యుద్భవమై చెలంగి

బాలమై యెదుటఁ జూపట్టు నయ్యోగి
చాల నక్కజమంది సంతసింపుచును
బ్రతిలేనిశృంగారరాశియో యనఁగ
రతిరాజుకేలికైరవబాణ మనఁగ
లలిమించు నవ్వనలక్ష్మియో యనఁగ
నెలకొన్న విదియక్రొన్నెలపోఁగ యనఁగఁ
గనుపట్టు నాకన్యకరపల్లవములు
నినుమడించినకూర్మి నెత్తి ముద్దాడి
తలపోయ నిచట నీతామరకంటి
తులసిమూలంబునఁ దోఁచు టద్భుతము
మానవబాలికామాత్రంబు గాదు
జానకిసరిఁ బోల్పఁ జను నీలతాంగి
యనుచు వెండియు వెఱఁగంద నందఁదఁ
బనుపడ నశరీరి పలికె నభ్రమున
హరి పూర్వమున వరాహావతారమున
ధరణిఁ గొమ్మున సముద్ధరణంబు సేసి
యెనయఁ గౌఁగిటఁ జేర్చి యెలమిఁగావింపఁ
దనపతిఁ జూచి యాధాత్రి యిట్లనియె
ననిశంబు నీ కిష్టు లగువార లెవ్వ
రనిశంబు నీ కిష్ట మగుపూజ యెద్ది

యానతి మ్మనఁ బ్రియురాలి నీక్షించి
శ్రీనాథుఁ డనియె నోశీతాంశువదన!
పాలుపార నమఁ గూర్మిఁ బొగడెడువారు
నలరులదామంబు నర్పించువారు.
నిష్టులు మిగుల నాకీపూజనము లె
యిష్టముల్ వారికి నెనలేనియట్టి
చెడనిసంపద లిచ్చి చేసేఁత నపుడుఁ
గడువేడ్కఁ బ్రోతు నోకల్యాణి! యనిన
విని యదిమొదలు నవ్విపులావధూటి
తనపతిమాట యొంతయు మది నాట
నిలలోన జనియించి యీపూజనంబు
జలజోదరునకు నే నవరింపవలయు
నని యెన్ని నీవు మహాయోగివరుఁడ
వని నీకు నందన నయ్యెద ననుచు
నీతోఁటలో జనియించెఁ బూర్వమున
సీతాంతరంబున సీతావధూటి
జనియించి జనకునిసత్పుత్రి యైన
యనువున నీకు నీయరవిందనయన
నందన యయ్యె నీనాళీకవదనఁ
బొందుగాఁ గొనిపోయి పోషింపు మింక

సకలంకశుభములు నభిమతార్థములు
సకలసిద్ధులు నీకు సమకూరు ననిన
నుప్పొంగి యప్పు డయ్యోగీంద్రచంద్రుఁ
డప్పయోరుహనేత్ర నక్కానం జేర్చి
కొని యింటి కేగి మక్కువతోడఁ బిలిచి
తనభామచేతి కాతన్వాంగి నొసఁగి
యలకన్య వాడమినయట్టిచందంబు
వెలయంగ నశరీరి వివరించుపలుకుఁ
వెలిపినప్పుడు మ్రోసె దేవదుందుభులు
వెలువక జడివట్టె విరివాన మింటఁ
గీర్తింపఁ దొడఁగిరి కిన్నరాంగనలు
నర్తించి రప్సరోనలినలోచనలు
నయమార నింద్రాదినాకలోకంబు
జయజయశబ్దముల్ సవరింపఁ దొడఁగె
సనకసనందనసన్మౌనిముఖ్యు
లొనరించి రభినుతు లుపనిషత్తులను
ఆవిష్ణుమానసుం డాబాలఁ గన్న
యావార్త విని వెఱఁగంది యంతటను
సకలశోభనవస్తుసంతతితోడ
సకలబాంధవులు నచ్చోటి కేగుదెంచి

భట్టనాథునిఁ బ్రేమఁ బ్రణుతించి యతని
పట్టి వీక్షించి సంబరము రెట్టింప
నీవాలుఁగంటి నీవిటఁ గన్నయపుడె
యీవు ధన్యుఁడ వైతి విదికారణమున
నేము ధన్యుల మైతి మిందఱ మిప్పు
డోమహాభాగవతోత్తంస! యనుచు
నాడుచు నయ్యోగి నందంద పొగడి
పాడుచు నేతులం బసపునూనియలఁ
గపురంపుఘనాళులఁ గమ్మపన్నీట
గపురమించిన యరగనువిచ్చువిరుల
నాడుచు సరసంబు లాడుచుం జల్లు
లాడుచు వడిఁ బ్రేటు లాడుచుఁ జెలఁగి
యొండొరుం దమలోన నుప్పొంగి యిట్లు
దండిమై నందనోత్సవముఁ గావింప
సిరితోడునీడ నెచ్చెలి తనయింటి
కరుదెంచినప్పుడే యఖిలసంపదలు
తముదామె వచ్చి నర్తనమాడఁ గతనఁ
బ్రమదంబుతోడ నా భట్టనాథుండు
బంధురభూషణాంబర కాంచనముల
బాంధవమిత్రాళి సంభావించె నంత

భట్టనాథునిదేవి పరమానురక్తిఁ
బట్టి హస్తంబులఁ బట్టి నేరుపున
జగములఁ బొడమించు జలజసంభవుల
నగణితంబుగ బోరుకాడింపుచున్న
జగదేకమాతహస్తపుటంబునీటఁ
దగబోరుకాడించి తడియాయ నొత్తి
జడియక బ్రహ్మాండజాలంబు లెపుడుఁ
గడుపులో నిడునట్టు గరిత నొక్కరిత
విలసిల్లుసేవంతివిరులచందమునఁ
జెళగించుచిన్నిపొత్తులలోన నుంచి
ప్రియమునఁ జన్నిచ్చి పెంచి లోకములు
నయమారఁ బోషించు ననుఁ గన్నతల్లిఁ
జన్నిచ్చి పెనిచె నీసరవి నయ్యోగి
కన్నియ కట జాతకర్మముల్ దీర్చి
యీదేవి హరి నెన్ను నిటమీఁద ననుచు
గోదాభిధాన మాకొమరితె కొసఁగి
యాకన్య నిజసవ్యహస్తంబు చూచి
యీకొమరిత జగదీశ్వరుం డైన
రమణుని పట్టంపురాణియై యుండు
క్రమమున ననుచు నాకలకంఠకంఠి

పల్లవాంబుజరాగపాటలపాద
పల్లవంబుల నున్నభాగ్యచిహ్నములు
గని సర్వగీర్వాణకామినీమణుల
మినుకారునెరుల తుమ్మెదలవేడించు
పదపంకజములఁ జొప్పడ నంచుమిగుల
మది సంతసించి ప్రేమమున నాబాల
బాలకైరవమిత్రఫాల, గోపాల
బాల వక్షోగంధ పటలజంబాల
జనకుండు వైదేహి, శరధి యిందిరను
బెనుపుచందంబునఁ బ్రేమ దైవాఱఁ
బెనుప రాగాములం బెరుఁగుచుఁ దమ్మి
ననబోఁడి కిలకిల నవ్వంగనేర్చి
యొయ్యన నుయ్యాల లూఁగుచున్నెడను
నెయ్యంబుమైఁ దల్లి నిదురబొమ్మనుచుఁ
బాటించి వేడ్కజోకపాట వాడినను
బాటించి వినక మెప్పాటఁ బోరిడుచు
బలసోదరునిమీఁదిపాటఁ బాడినను
గిలకిల వాయెత్తి కేరినవ్వుచును
అంత నొయ్యన డొంగి యాడంగనేర్చి
సంత బంగరుగజ్జియలు నందియలును

గలకల రవణింపఁ గారుమెఱుంగు
పిలుప నానింటిలోఁ బిలిపిలినడల
మెలఁగఁచు మోముదమ్మికి మూఁగుకొన్న
యలకభృంగముల నొయ్యన కరాబ్జమునఁ
జక్కనొత్తుచు డాలు జళిపించుమణుల
నక్కులమించు సన్నపురావిరేక
నునుపారువేల్పుటేనుఁగుపిల్లకొమ్ము
లను గట్టులొనరించులాగున నొప్పు
పుత్తడిబొద్దులుఁ బువ్వుదండలును
గుత్తంబుగా వలగొను తేఁటిజాలు
లాగైనయుఁదనీలంపుగాజులును
బాగైనతరపనిపవడంపుసరులు
విలసిల్లు తేనియవిరిదమ్మి దొరఁగు
చెలువున లాలగెఁజిగిమోవి జార
నల్లన లోకసంహాతిఁ గన్నతల్లి
తల్లిదండ్రులపేరు తాఁ జెప్పఁదొడఁగెఁ
గరమద్ధి దాదిచెంగట చేరఁ బిలిచి
కరతాళగట్టసల్ గావించుగతుల
విన నవ్వుకొనుచు గోవింద! ముకుంద!
యనుచు వేడుక నృత్యమాడు నీకీలి

నింతయై యంతయై యెదిగి నానాఁటఁ
గుంతలంబులగురుల్ గూడుప్రాయమునఁ
దనయీడుచెలులును దాను ప్రేమమున
నెనసి యొక్కెడ బొమ్మరిండ్లాట లనుచు
జగములు నందుల సాగరగహన
నగనగరాదు లున్నతి లిఖింపుచును
నంతంతఁ జిత్రంబులగు నజాండములు
దొంతు లటంచు సంతోషించుకొనుచు
వరుస గుజ్జనగూళ్ళు వండుద మనుచు
నరవిరిదాసనం బనలంబు గాఁగఁ
బూనిక నొకకల్వప్రోయి యమర్చి
పూనీటియెసరునం బొలుపారుచున్న
యొక్కతమ్మిపూఁగుండ యునిచి సన్నంపు
టకరువు లనుబియ్య మందులో నునిచి
కన్నగేదంగిని గలయఁబెట్టుచును
గన్నియల్ వొగడ నిక్కరణి నాడుచును
బుదుడింపఁదగు రెండుబొమ్మలు దెచ్చి
హారిఁగును వైదర్భి యని సమకట్టి
కూరిమి నేఁ బెండ్లికూఁతురిదానఁ
గోరి మీరలు పెడ్లికొడుకువా రనుచు

సారచంద్రికల మైచాయలం దెగడు
చారుపటీరంపుఁజవికెమీఁదటను
పవడంపుటనలుదీపై క్రమంబునను
సవరనిగందంపుసమిధ లమర్చి
జాతిముత్తియపులాజలు వేలుపించి
జాతిగా హోమంబు సవరించి మఱియు
మనము పన్నిదపుటమ్మనము లాడుదము
మనమునఁ గపటంబు మాని రమ్మనుచు
నోడక చెలు లాడుచున్న చందమున
నాడలేకున్న వా రద్దిరా యింకఁ
జిక్కితి పతిపేరు సెప్పుమటన్నఁ
జక్కనివటపత్రశాయి నామగఁడు
అనిచెప్పి వారల నారీతి గెలిచి
యనయంబు మగలపే రడిగి చెప్పించి
యీలీల మఱియు ననేకమార్గముల
బాలికాలీలలం బ్రబలుచునుండి
యెలజవ్వనము మేన నిగురించుతఱిని
నలినాక్షి యాభట్టనాథతనూజ
తనతండ్రి వరసుమదామంబు లచటి
వనమాలి కర్పింపవలసి నిచ్చలును

గట్టిగా మాలికల్గట్టి పూసజ్జఁ
బెట్టి యావేళ నర్పించెద ననుచుఁ
జనినపిమ్మట నలసౌమదామములు
తనకొప్పునం బూని తనకొప్పుఁబోడ
మించులు జలదంబుమీఁద వేడించు
సంచున నొసపరి సవతుగాఁ జుట్టి
యొకసావిగాఁ జూచి యింటిలోనున్న
నడబావిలోనఁ గ్రన్నన నీడఁ జూచి
చూడ నొప్పెడు తనచూడ నున్నట్టి
జాడయంతయుఁ గని సంతసింపుచును
వెండియుఁ దొల్లింటివిధమునం బువ్వు
దండ లాకరఁడిలోఁ దనరార నునిచి
యాడుచుండెడుసమయమున నేతెంచి
వేడుక నవి తెచ్చి విష్ణుచిత్తుండు
నేర్పున వటధామనీరజోదరుని
కర్పింప నిరతిశయానందుఁ డగుచుఁ
గల్పసూనంబులకంటె మాసీందర్రి
కల్పితవినుతులకంటె దేవతలు
నెడపకయుపహార మిచ్చుటకంటెఁ
గడపట నేమిటికంటె భోగ్యముగఁ

దలఁచుచు వటపత్రధాముఁ దుష్పొంగి
తలఁపులోపలఁ గొండఁ దాఁకుచునుండె
నీలీల మఱియు ననేకకాలంబు
బాలిక ముడిచినపరిసవమాలికలు
హరిచిత్తుఁ డనిశంబు నాబాల ముడుచు
టరయక శౌరికి నర్పించుచుండె
ననయంబు దాను నయ్యరవిందనేత్ర
జనకునితోఁగూడఁ జని తోఁటలోన
విరులుగోయుచు నవి వింతవింతలుగ
సరులుగా సవరించుఁ జాటున కరిగి
తా మున్ను ముడిచినదామముల్ పిదపఁ
బ్రేమమైఁ దండ్రిచేఁ బ్రియుని కంపించు
నీరీతినటియించునెడ నొక్కనాఁడు
కూరిమితోడ నాగోదావధూటి
జనకుండు వటపత్రశాయికై యిడిన
ననగూడలోనిగ్రొన్ననదండ లెత్తి
యొనఁగూడుకొప్పున నొప్పుగాఁ జుట్టి
నినుపారుబావిలో నీడ చూడంగ
నేమరిపాటుగా నేతెంచి తండ్రి
కోమలిదిక్కుఁ గన్గొని తల్లి! యిట్లు

హారిసమర్పణమున కమరించుపుష్ప
సరములు నీకు శేషముఁ జేయఁ దగునె
యనుచు వేఱొకకొన్ని యలరులు గోసి
చని నాఁటి కావటశాయి కర్పింప
నప్పు డాగోవిందుఁ డానెచ్చెవిరుల
నొప్పక యంతయు నొల్లంబు సేసి
కడుఁ బ్రేమ నీచిన్నికన్నె క్రొమ్ముడిని
ముడువనివిరుల నే ముడువ నెంతైన
నీకన్యకామణి నెరితావి లేని
యీకుసుమములు నా కితవుగా విపుడు
కువలయనేత్రి కైకొని *చేతఁ గొన్న
యవియె తెచ్చితి వేని యంగీకరింతు
నన విని వెఱఁగంది యనురక్తి నరిగి
తనుజాత ముడిచినదామము గొనుచుఁ
దనయఁ దోకొనుచు శ్రీధవునిసన్నిధికిఁ
జనుదెంచి కరజలజాతయుగ్మంబు
మొగిచి దేవరచిత్తమున కింతయిష్ట
మగుట నేనెఱుఁగ నయ్యబ్జాక్షి యిదియె
యీలేమ కొప్పున నెనయించినట్టి
మాలిక లివె గోపమానినీవరద!

---

* దాత

యన విని గోవిందుఁ డాదండ లంది
మెనలేసి వేడ్కతో నెదమీఁదఁ జేర్చి
నుదుటఁ గీలించి కన్నుల నొత్తుకొనుచు
ముద ముప్పతిల శిరమునఁ జుట్టికొనుచుఁ
నీమానినీమణి నిటమీఁద నేన
ప్రేమ వైవాహికంగఁ బెండ్లియాడెదను
ఈకోమలాంగి నీ వెప్పటియట్ల
తోకొనిపొమ్ము నీతోఁగూడ ననిన
సంతసింపుచుఁ దనుజాతయుం దాను
నంతట హరిచిత్తుఁ డరిగె నింటికిని
ఆచెల్వ కదిమొదలై చూడికుడుత
నాచారి యనియెడునామంబు గలిగె
నానాఁట నాభట్టనాథతనూజ
మేనఁ దారుణ్యంబు మించి రా నంత
నెలనాఁగ చెలువంపుటేటిలో మెలఁగు
వలుదజక్కవ లన వలిగుబ్బ లమరె
వనిత జవ్వన మనువనములోఁ బొడము
ననటులగతి నూరు లమరె నెంతయును
హరిని మోహించుచు హరమనోధైర్య
హరమోహనాస్త్రంబు లనఁ గన్ను లమరెఁ

గలకంఠికనుదమ్మి కవఁ జేరియున్న
యలిపంక్తు లనఁగఁ జెన్నారె భ్రూయుగము
ప్రాయంపుఁగడలిఁ జొప్పడుతరంగముల
చాయల బాహుపాశములసొం పెసఁగ
వలరాజురాచిల్క వయ్యాళిబయలు
తెలివిమైనసముఁ గాదీవ చూపట్టెఁ
గారుమొఱుంగుపైఁ గనుపట్టునీల
ధారాధరం బనం దనరారెఁ దుఱుము
మరునిపట్టపుదంతిమస్తంబుకరణిఁ
గర మొప్పు జఘనచక్రము తేటపడియె
లాలితరోమాళిలతికజనించు
నాలవాలం బన నసలారె నాభి
తగముఖపద్మయంత్రం బిరుగడలఁ
బొగడొందు శ్రీలునాఁ బొలుపారె శ్రుతులు
కాముకుం డగుసోము గాడి చూపట్టు
కాముసంపఁగితూపుగతి నాస యమరెఁ
బంకజోదరునిశోభనపల్లవముల
పొంకంబునను బదంబులు చెన్ను మీఱె
ననబోఁడి కిట్లు నానాఁట నమ్మైన
ననలొత్తు నెరజవ్వనము *దయివాఱ

*కైలువార

నందనంద గోవిందుఁ డగుచిదానందు
నందు మిక్కిలి చిక్కి యాసక్త యగుచుఁ
గమ్మవితావులు గలుగుమాలికలు
నెమ్మితో వటధాముని కి సమర్పించి
చనుదెంచుతండ్రి కిచ్చలు నుపచార
మొనరించి యాతనియొద్దఁ గూర్చుండి
మురిపంబు నొయ్యారమును దళ్కుకొనఁగ
నోరయుముద్దులు గురియుచు నొక్కనాఁడు
కడుమనోహరము లౌ కమలాక్షుకథలు
కడపట నీ వెఱుఁగని వెవ్వి లేవు
ధరలోన నర్చావతారరూపముల
హరి యున్నవిలయంబు లవి యెన్ని కలవు
అపరిమితంబు లౌ నందులో జగతి
నిపు డెఱింగినవి నీ వెన్ని ? తెల్లముగ
వెన్నవికథవిన వేడు కయ్యెడిని
యన్న నా కెఱిఁగింపు మనిన నుపొంగి
కన్నియఁ జూచి క్రేగంట నవ్వుచును
మన్నన నెమ్మోనిపై కేల నిమిరి
కురులు గూడఁగదువ్వి క్రొన్నెలసరుల
వరుస దిద్దుచు గారవంబు దైవాఱ

నమ్మ! చెప్పెద వినవమ్మ యింపార
నమ్మాధవునినిలయములుఁ దత్కథలు
ననయంబు మానివేద్యము లైననూట
యెనిమిదితిరుపతు లిలలోనఁ గలవి
యీయెడలందు నయ్యిందిరావిభుఁడు
పాయక యుండు నభంగవైఖరుల
నరయ నీకథ వినునట్టివారలకుఁ
గరతలామలకంబు కైవల్యపదము
అనుచు వేంకటపతియాదిగా నూట
యెనిమిదినెలవుల నెసఁగుమూర్తులను
వినుపింపఁదొడఁగె వేర్వేఱ చిత్రముగ
జననుతవైభవసంయుతం బగుచు
నిచుళలో శ్రీధరానీళలం గూడి
యచలుఁడై యుండుఁ దోయజసూతితండ్రి
తంచాపురంబున తంచదైత్యారి
యంచితమనుజపంచాస్యుఁ డై యొప్పుఁ
గటిగదాదరచక్రకలితహస్తుండు
కిటిమూర్తిదండకు గెడపినవాఁడు
శ్రీమణిమౌక్తికసింధుశోభితుఁడు
శ్రీముష్ణపురమునం జెన్నొందియుండుఁ

దొలుతఁ దాఁ దన్నిసదోషంబు వాయ
నలహాని తపము సేయఁగ మెచ్చినట్టి
పేరిమాలయాఖ్యుండు పృథుభోగశాయి
కాముని గన్నచక్కనితండ్రి యొకఁడు
హరిపితామహసేవ్యుఁ డగుచుఁ గదంబ
పురమున శేషతల్పుఁడు చెన్నుమిగులు
దేవియాజ్ఞలకు విధేయుఁ డైయుండు
దేవుండు విశదాద్రిధీరుఁ డొక్కరుఁడు
శ్రీపక్షిభూతపురీపతి గాథ
చాపాఖ్యుఁ డగురామచంద్రుఁ డొక్కరుఁడు
అప్పాలకుండలో హస్తంబు చాఁచి
యప్పాలవెల్లికన్యకఁ గూడియుండు
ననిలాశనేంద్రపర్యంకపలాశ
వనగుహాపురవాసి వనజోదరుండు
అండజనాథవాహనుఁ డారునూర
నుండు వేడుకతోడ నురగేంద్రుమీఁద
భాసిల్లు రథమగ్నపట్టణంబందు
గోసహాయుం డనుకుసుమాస్త్రితండ్రి
పొలఁతుక యలవ్యాఘ్రపురిని యపూర్వ
జలధినామంబున శౌరి చెన్నొందు

గంగ మించినశక్తి గలుగంగ వనము
చెంగటం దప మొనర్చినక వేరజకుఁ
గాడకట్టి శ్రీసారభూపురిసొంపు
లడరంగ శిసునాథుఁ డన నుండుశౌరి
సవరణై యొప్పుమ స్తకశంఖపురిని
నవచంద్రుఁ డనురమానాథుఁ డింపొందుఁ
గోమలవల్లి చన్గొనలపాదంబు
లామతి గొల్పి హేమాబ్జినిచెంత
నగధారి కుంభఘోణమ్మునఁ జాదు
నగు నత్యప్తామృతనాథుండు వెలయు
హారు బ్రహ్మహత్య నాయంగఁ జేసి జగతి
హరశాపమోచనుం డనుపేరఁ బరఁగి
నగరాజకుచ ! ఖండనగరంబునందు
నగణితభుజమూర్తి యచ్యుతుం డొప్పు
జపితశైరోమశాష్టావక్రమునులు
తపము సేయంగఁ బ్రత్యక్షమైనట్టి
శ్రీమించి యపు డంతరిక్షాఖ్యపురిని
వామనుం డనుపేర వనమాలి యుండు
నరుదార*శబరి రాజనఁగ శ్రీకృష్ణ
పురమున నెంతయుం బొలుపొందుచుండుఁ

---

*శారి

బరిరంభపురమునఁ బద్మాయతాక్షి!
మురవైరి కేదారమూర్తినాఁ బరఁగు
ఘననాగపురమున కడలిచెంగటను
దనరు సుందరుఁ డనుదనుజమర్దనుఁడు
మణిముక్తికానదీమణిసమీపమునఁ
బ్రణుతింపఁదగు గంధపట్టణంబునను
అనురక్తి మేధావి యనుమౌనివరుని
తనయుఁ గైకొన్న శ్రీధరుఁడు శ్రీమించు
నందిపురాంబరనగరంబునందుఁ
గందర్పగురుఁ డుందుఁ గడుచిత్రగతుల
వనజాక్షి సచ్ఛీలవల్లభాఖ్యునకుఁ
దనయుఁడై శశికిఁ బ్రత్యక్షమైనట్టి
భువనసన్నుతుఁ డిందుపురమున నెప్పు
డవిరళశ్రీలచే ననుపొందియుండు
గురుతిల్వవనచిత్రకూటంబునందు
హరుఁడు నర్తించు నృత్యము చూచికొనుచు
నురగేంద్రశాయియై యుండు గోవిందుఁ
డరయ నాతేఁడు సంకు నాత్మసంభవుఁడు
రవితేజుఁ డగుచు శ్రీరామాభ్రపురిని
నవనీతచోరుండునా వెన్నుఁ డొకఁడు

కమనీయమూర్తి సంగమపురి, లోక
రమణుండు లోకాభిరక్షణం బ్రబలు
నర్థికల్పకము శ్రీహరి కృష్ణపురిని
బార్థసారథి యనం బరఁగు నబ్జాక్షి
శ్రీపార్థసఖమహీశీపట్టణమున
శ్రీపరతంత్రుఁడై సిరులు పైపైని
దనరంగ సకలభక్తప్రాణనాథుఁ
డనియెడు గరుడవాహనుఁడు సొంపొందు
జననుతం బగుకపిస్థలపట్టణమున
వనజాక్షి యొప్పు దేవకికూర్మిపట్టి
పాదుగా నిల రౌప్యపట్టణంబునను
గోదండరాముఁడై కొమరుదీపించు
శ్రీనాగపురమునఁ జిగురాకుఁబోఁడి
శ్రీనాథుఁ డెసఁగు నాశ్రితకల్పతరువు
ఆపట్టణమునకు ననతిదూరమున
నేపారుసిరులతో నెనసియున్నట్టి
మణిధామపురమున మధువైరి చెలఁగు
నణిమాదిసిద్ధినాయకుఁడు బింబోష్ఠి !
ప్రసవసాయకపుంఖపట్టణంబునను
ప్రసవాస్త్రగురుఁడు చూపట్టును జెలువ !

యోతలోదరి ! పురుషోత్తమనగరి
నేతయై వెలుఁగొందునిగమవేద్యుండు
హైమధామపురంబునందుఁ జెన్నొందు
హైమాంబరుఁడు కాంచనామలదేహ
బలుఁడు శ్రీసత్త్వసభాపురినాథుఁ
డలరువిల్తునితండ్రి యలరు తన్వంగి !
యనవాప్యగగనపురాంతరసీమఁ
గనుపట్టువిష్ణుండు కలకంఠకంఠి !
కలికి వైకుంఠపుష్కరమనుపేట
నెలకొని యుండుఁ గ్రొన్నెలప్రొద్దుకంటి
ధవళపుష్కరిణినాఁ దనరుగ్రామమున
ధవళాక్షుఁ డరుదారు ధవళాయతాక్షి !
యలనూపురాపగాప్రాంతంబునందుఁ
జెలఁగువనాద్రిమైఁ జెన్నొందు నంద
సూనుండు మలయధ్వజునకుఁ బ్రత్యక్ష
మైనట్టివాఁడు భక్తామరతరువు
సుందరవల్లి వక్షోవీథి నొప్ప
సుందరుఁ డనుపేరఁ జూపట్టు నమ్మ !
శ్రీగోష్ఠిపురమున శేషపర్యంకుఁ
డాగమేశుఁడు నైన హరి గలం డబల !

సత్యపట్టణమున శారద మామ
సత్యనాథుండునాఁ జను గీరవాణి !
జలధిఁ గట్టగ దర్భశయనంబునందు
వెలయుఫుల్లాటవీవిభుఁ డిందువదన !
కనకాంబరుఁడు సితకాసారతిలకుఁ
డనఁనొప్పు మున్నీటియల్లుండు తల్లి !
యాలోలనేత్ర ! మోహానపట్టణమునఁ
గాలమేఘుండునాఁ గంసారి ప్రబలు
మనసిజజనకుండు మధురాపురమునఁ
దనదేవితోఁడఁ బ్రత్యక్షమై మున్ను
చేడియ కూర్మి నాచేతఁ బల్లాంగు
పాడించుకొన్న శ్రీపతి సొంపుమీఱు
వటపత్రశాయినా వాసుదేవుండు
వటఫలాధరి! యుందు వలనొప్పుచుండు
నలవడుం గురుకసౌమ్యస్థితాధీనుఁ
డలివేణి! మీతండ్రి యలపరాంకుశుని
యతులకావ్యామృతం బనిశంబుఁ గ్రోలుఁ
చతురుఁ డందఱిలోనఁ జక్కనివాఁడు
అరవిందలోచనుఁ డనుపేరఁ బరఁగి
యరవిందభవుని గన్నట్టి దైత్యారి

మఱి తిరుత్తులవెల్లిమంగళపురిని
చెలువ! సోయగములఁ దెలిఁగొప్పుచుండుఁ
గలికి! నక్రాయతకర్ణపాశాఖ్యఁ
దలఘుదక్షిణపురి ననువొందుచుండు
వైకుంఠపురిఁ జోరవరుఁ డనుపేరి
శ్రీకామినీపతి సిరిఁ దేలుచుండు
ధర చక్రధరుఁడు కైతవనటాహ్వాయుఁడు
తరుణి దక్షిణకుళిందపురిరాజిల్లు
నమరనాయకుఁడు వారాంగనాపురిని
గొమరారుచుండు నెక్కొనిపువ్వుబోఁడి
నాతి చించాపురినాథుఁడు నిత్య
మాతతశుభమూర్తి యై ప్రతాపించుఁ
దగుగుణవతి సతీధవుఁడు మాధవుఁడు
మృగశాబనేత్ర శ్రీమెఱయుచునుండు
నెలకొని విత్తమానిధియును విభుఁడు
పొలఁతుక! సూచకపురి యేలుచుండు
వీరలు కురుకాధివిభునిసమీప
ధారుణీస్థలి నున్న ధవళలోచనులు
వనిత! వామనపురీశ్వరుఁ డైనదీర్ఘ
కనకవర్ణాఖ్యుండు కంసనంహారి

తనచెంతఁ బార్వతీధవశాపమోక్ష
మొనరించి పెక్కేఁడు లుర్విభాగమునఁ
బన్నిడెబ్బదిపద్మభవులచేఁ బూజ
గొన్నవాఁ డెంతయుఁ గోమలగాత్రి!
యతివ యనంతపురావాసుఁ డురగ
పతిశాయి యొప్పు శ్రీపద్మనాభుండు
వరదుండె యలతిరువణ్బ్వారశార
పురమునఁ గృష్ణుండు పొలఁతుక చెలఁగుఁ
దవిలి దక్షిణమరుత్తటపురి*లోక
ధవ్యుఁ డైనయప్పుడు తనుమధ్య! యొప్పు
శ్రీమూళిధామపురీ సీమశౌరి
కోమలి! విఘటవర్తకుఁడునా నుండుఁ
బ్రోదిమై శార్దూలపురిరమానాధుఁ
డాదినూహ్వాయుఁడునా నలివేణి వెలయు
నారాయణాఖ్యుండు నా పురస్థలిని
నీరజోదరుఁ డొప్పు నీరజగంధి
లలన! శ్రీవళ్ళనాళపురంబునందు
బలిచిరశ్రయమాణపతి యనం గలఁడు
శ్రీసారభృంగపురీవాసుఁ డైన
యాసారసాక్షుఁ డోయమ్మ భాసిల్లుఁ

---

*లోన

ప్రతిలేనినిద్రాణపట్టణేశ్వరుఁడు
చతురుఁ డోపడఁతి! కేశవుఁ డనఁ దగును
సకియ పరుష్ణిహేశ్వరనగరమున
సకలాధిపతి దనుజద్వేషి మెఱయు
నాతి విద్వద్రధనగరంబునందు
మాతంగుం డనుపేరి మరుతండ్రి యొప్పు
శ్రీకపిస్థానపురీవాసుఁ డగుచు
నోకొమ్మ! తాతనా నొప్పు శ్రీవిభుఁడు
మాయమ్మ సద్వల్లిష్టి మత్పురం బేలు
నాయార్తసంహారుఁ డసురజనారి
యతివ శ్రీదేవనాయకుఁ డైంద్రనగర
పతి యైనవాఁడు గోపాలపాలకుఁడు
తలపోయ మీపెదతండ్రు లైనట్టి
యలసరోభూతమహాయోగులకును
ప్రత్యక్షు మైన గోపాలశేఖరుఁడు
సత్యసంధుఁడు జగజ్జనవశ్యకరుఁడు
శ్రీవామనుండు దక్షిణశంఖధరుఁడు
భూవినుతుఁడు గోపపురవల్లభుండు
శ్రీమంతుఁ డైన హస్తిగిరీశుఁ డజుని
హోమగుండంబులో నుదయించినట్టి

వరదుండునా నొప్పు వనమాలి కాంచి
వరుణపల్లవపాద! యఖిలైకవిభుఁడు
ధీరుఁడు వేగవతీతటాహ్వయుఁడు
సారసాక్షుఁడు శేషశాయి భూవిభుఁడు
పడఁతి మీపెదతండ్రి భక్తిసారుండు
చిడిముడిఁ దనుఁ బిల్చి చెప్పినయట్ల
యొనరించినట్టి యథోక్తకారిసుఁ
డనుపమకరుణాకటాక్షుఁడై యుండు
నిరవొందఁగాఁ బరమేశ్వరవిణ్ణ
గరమునంగలఁ డబ్జకరుఁ డెలనాఁగ!
చూపట్టు పాటకేసుండునాఁ బడఁతి!
యాపాండవులదూత యై కృష్ణసఖుఁడు
శిశిరోపవనపురిఁ జెన్నొందుచుండు
శిశిరాంశుబింబాస్య! శిశుపాలవైరి
కామపురంబునం గనుపట్టుచుండు
శ్రీమంతుఁ డనిశంబుఁ జిలుకలకొలికి
సురవంద్యుఁ డెలమితో జ్యోత్స్నేంద్యుఖండ
పురమున నొప్పుఁ గప్పురములచాయ
నీరధిశయనుండు నీరఘుపురిని
నోరామ! పాయకయుండుఁ బెంపెసఁగఁ

బడఁతి వర్షాకాశపతిసాఁగ నందు
కొడుకు సంపదలమైకొని బిత్తరించుఁ
గామపురంబునం *గల్వరయనఁగఁ
గామిని విలసిల్లుఁ గామునితండ్రి
కలకంఠరో! త్రివిక్రముఁ డూరకంబు
నెలకొని పాలించు నిగమవేద్యుండు
పురవైరినుతుఁ డష్టభుజకరుం డనఁగ
వరభోజనాది యెంతయు నొప్పు బాల
తిరునిన్నయూర వర్తిలుచక్రవర్తి
కరమర్థితోడ సైకతనిభశ్రోణి!
కూరిమి శ్రీపత్మికుండంబునందు
వారిదవర్ణుండు వామాక్షి మెలఁగఁ
†తోయమహీంద్రనాథుండునా జగతి
వేయుభంగుల నొప్పు వీణావినోద
మానినీ! వినుము శ్రీమస్థలేశుండు
నానొప్పు నవదాత నలినలోచనుఁడు
కనకాంబరుండు సాగరమల్లనాథుఁ
డనువాఁడు విలసిల్లు హరిరాజమధ్య!
మనుజసింహుఁడు మున్ను మహిసప్తమునులు
పనిబూని గడియ దరంబు గావింప

---

*గల్పితనంగ †తోయమహీంద్ర

నటవచ్చి పరిత్యక్తు మైనట్టివాఁడు
ఘటికాచలేశుండు కలహంసగమన!
వీరలు తుండీరవిభులు కల్యాణి
చారుగుణోదారసౌభాగ్యయుతులు
కోమలీ! భక్తులం గూడి మాటాడు
స్వామి పుష్కరిణీపజ్జనె చెన్నుమిగిలి
యానందనిలయమై యనువొందుచుండు
యానందనిలయాఖ్య మగుమేడ నుండు
భూలోకవైకుంఠమున వేంకటాద్రి
నీలోకములనెల్ల నీడేర్పఁగోరు
నలమేలుమంగ బాహాంతరసీమ
నెలకొల్పి నిఖిలావనీస్థలిలోన
శరణని వచ్చినజనులకు నిష్ట
వరము లిచ్చుచు గారవమున వెండియును
బంధురకరుణతోఁ బాగున పంగు
నంధున నంధుగా నలవరింపుచును
వనయంబు వనపత్యు సాపత్యు గాఁగ
ధనహీను ధనదుగా దయసేయుచుండుఁ
దరుణులు వలచు టందఱకును గలదె
పురుషులు వలతు రప్పురుషోత్తమునకుఁ

దెలియంగ నిచట ముక్తిని గదుఁ జూడఁ
గలవారిలోఁ జూడఁ గలవాఁడు వాఁడె
గోదాసతీ! వాఁడెగో! దానవారి
వేదగోచరుఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
లతికాప్రహ్లాదంబున లావణ్యమూర్తి
లతికాంగి! యొప్పు నీలామనోహరుఁడు
అలగండకీ నదీప్రాంతంబునందు
లలన! యింపొందు సాలగ్రామవిభుఁడు
ఘనభుక్తి ముక్తులం గడిబెట్టి యమ్మ
ననవిల్తుతండ్రి మానారాయణుండు
తొయ్యలి ఘనవియత్పురిసేంద్రుఁడనఁగ
నయ్యచ్యుతుం డసురారి యొప్పారుఁ
దొలుత ధర్మములు సూతునికి సర్వంబు
దెలిపిన నైమిశాధిపుఁ డైనవాఁడు
యోగముద్రాకరుం డుత్పలనేత్ర!
నాగారిగమనుండు నలువొందుచుండు
*గంగాతటాక్రాంతఖండపురీశుఁ
డంగన! కలిదోషహారి యైయుండు
నరయంగఁ బురుషోత్తమాంధీశుఁ డనఁగఁ
గర మొప్పు ముద్దియ! కాళియభేది

*గంగాపుర

రాజాస్య! యష్టాక్షరము మానివరుల
కోజమై నుపదేశ మొసఁగినగురుఁడు
శౌరి శ్రీబదరికాశ్రమవాసుఁ డైన
నారాయణుఁడు జగన్నాథుండు వెలుఁగు
గరుడాద్రివాసుండు కాంచనకశిపు
హరణుండు యోగముద్రాసనాయతుఁడు
నరసింహుఁ డనయమానవభక్తవరదుఁ
డిరవొందు నెంతయు నిభరాజగమన
కీరవాణిరో! విను కేరళపురిని
వీరరాఘవుఁ డన వెలయుచునుండుఁ
బూరిఁబూరి శ్రీపతిపురమధ్యమునను
నరసింహుఁ డనువొందు నరసఖుఁ డబల!
త్రిదశులు వెఱఁగందఁ దృణగుల్మలతలు
మొదలైనవానికి ముక్తి యొనర్చె
దానవాంతకుఁ డయోధ్యావల్లభుండు
జానకీపతి రామచంద్రుఁ డేపారు
మధురలో నెపు డష్టమహిషులంగూడి
మధువైరి కనుపట్టు మధుకరచికుర!
వ్రేతలతోఁగూడ వ్రేపల్లెఁ శకట
పూతనాదుల నల్లఁ బొరిగొన్నవాఁడు

నలచింతయంతికి నపవర్గ మొసఁగి
నెలకొన్నసిరులకన్నియ బిటారించు
షోడశసాహస్రసుందరీమణులఁ
గూడి ద్వారక నెలకొనియుండు నెపుడు
కందర్పకోటిసంకాశమోహనతఁ
జందనగంధి! వాసవవంద్యుఁ డొప్పు
బలసోదరుఁడు నిచ్చ బాయకయుండుఁ
గలశాబ్ధిలో హేమకలశవక్షోజ!
వైకుంఠపతి పరవాసుదేవాఖ్యుఁ
జేకొని వరముక్తిసీమఁ బాలించు
వ్యూహాదు లైన పద్మోదరమూర్తు
లాహరితనువున నవతారమొందు
మానుగా నలమేలుమంగావిభుండు
తానయై శ్రీరంగధామంబునందు
నజునకుఁ బ్రత్యక్షు మైనట్టివాఁడు
భుజగపుంగవతల్పమునఁ బవ్వళించి
వెలుఁగొందుచుండుఁ గావేరినెన్నడుమ
సలలితచంద్రపుష్కరిణిచెంగటను
మగువ కల్హారదామకశోభిభుజుఁడు
మృగమదపుండ్రముఖేందుచిహ్నుండు

కంతుకంతుఁడు జగత్కల్యాణమూర్తి
కాంతోపయంతనాఁ గరమొప్పు ననుచు
వినుపింప వారల విభవచరిత్ర
మనువొంద విని విని హర్షించి మిగుల
నభిరామనాయకుం డగుశౌరి సిరుల
కభినవోత్సవలీల నలరి యుప్పొంగి
సుందరనాథునిసోయగంబునకు
నందంద వెఱఁగంది యతనికిఁ జిక్కి
శ్రీవేంకటేశ్వరుచెలువంబుకలిమి
భావించి పులకించి భావంబు కరఁగి
యంగన నయనమోదాశ్రుపూరములు
తొంగలి రెప్పలతుది నాటుకొనుచు
నరుదందితన్మయయై పెద్దతడవు
పరిమమానియుఁ బోలెఁ బరచింత లుడిగి
సర్వంబు నెఱుఁగు నాజగదేకమాత
సర్వేశుఁ దగులు టాశ్చర్యమే తలఁప
నావంటిపామరునకు నైన నతని
సేవింప నతనికిఁ జిక్కు డొదంబు
అంత నాలలితాంగి యంతరంగమునఁ
గొంతధైర్యము దెచ్చుకొన్నది యగుచు

రంగేశువైభవరాజసంబులకుఁ
బొంగి యాతనికి నబ్బురమంది చిక్కి
ముదమునఁ దనతండ్రిమోము వీక్షించి
విదితంబుగా రంగవిభు చరిత్రములు
విన విన వీనులవిందు లయ్యెడిని
వినుపింపు నాకు సవిస్తరంబుగను
అన విని భట్టనాథార్యుఁ డాతనయుఁ
గనుఁగొని పలికె నగ్గలమైనకూర్మిఁ
బద్మాసనుఁడు మున్ను పాలమున్నీటి
పద్మాక్షు గుఱించి తపంబు గావించి
బహువేదశృంగంబు ప్రణవాత్మకంబు
మహితంబు నైన విమానంబుతోడఁ
బంకజాక్షుఁడు శేషపర్యంకుఁ డగుచుఁ
బంకజాసనునకుఁ బ్రత్యక్ష మయ్యె
నైన నయ్యసమాన మగువిమానంబు
తోనఁ గైకొని వేగ తోయజసూతి
సత్యలోకమునకుఁ జని నిజవసతి
నత్యంతసంకలితాత్ముఁ డై నిలిపి
యోజ దప్పక వివిధోపచారములఁ
బూజ సేయుచు నుండి పుష్కరాత్మజుఁడు

సత్రంబు సలుప నచ్చటికి దేవతలు
ధాత్రిఁ గల్గినయట్టితపసులు సనఁగ
వారితోఁ గూడ నిక్ష్వాకుండు నేగి
సారసాసనుమేటిజన్నంబుఁ జూచి
యతనియింటను విమానాంతరసీమఁ
బ్రతిలేని యారమాపతిని సేవించి
చలపట్టి యతనిఁ బ్రసన్నుఁ గావించి
యిలువేల్పుగాఁ గొల్తు నిలతోన ననుచుఁ
గనకగర్భునిచెంతఁ గ్రిమ్మఱి నిలకు
ననిపించుకొని వచ్చి యతిఘోరతపము
నొనరించి యారమాయుతునిఁ బ్రత్యక్ష
మొనరించికొని యంత నుల్లసింపుచును
దనయేలు నాయయోధ్యాపురంబునకుఁ
గొనివచ్చి నిజభక్తిఁ గొలిచె నంతటను
గ్రమమున నలదశరథునిపర్యంత
మమితభక్తిని గొల్చి రతనివంశజులు
ఆవిష్ణునిజరూప మగు రామవిభుఁడు
రావణుఁ జంపి వారనివేడ్కతోడ
ధరఁ గిజతో నయోధ్యకు నేగుదెంచి
సరసాత్ముఁడై విభీషణుని మన్నించి

తానైన యాశేషతల్పుని నొసఁగి
మానుగాలంకకు మగుడఁబంపుటయుఁ
గోరియాదేవుఁ గైకొని విభీషణుఁడు
బోరన నిజపురంబునకు నేగుచును
బగలింటిసంధ్యఁ దీర్పఁగఁ బూని యమల
యగునట్టి సహ్యకన్యకతటంబునను
సైకతభూమి నాజగదీశు నునిచి
యాకవేరజను సంధ్యావిధుల్ దీర్చి
యత్తటంబున నున్న యాదేవు మగుడ
నెత్తిన నెంతైన నెత్తరాకున్న
ననయంబు శోకించు నాభక్తుఁ జూచి
యనియె శ్రీహరి మింట నశరీరివాణి
నీ వెడ శోకింప నేటికి వలవ
దివ్వేటినడుమ నా కింపుపుట్టెడిని
జటులవైఖరుల నీచంద్రపుష్కరిణి
తటమున ననుగూర్చి తప మాచరించు
వరగుణోన్నతు ధర్మవర్మఁ బ్రోచుటకుఁ
బరమపావనము లై పరఁగు నిచ్చోటి
నవతీర్థములనుండి ననుఁ గూడి మౌని
నివహంబు నెల్ల మన్నించుట కిచట

ముదమున లంకాభిముఖుఁడనై శేష
మృదులభోగమున నర్మిలి యోగనిద్ర
నుండెద నీలోన నుడివోనికరుణ
నుండెద వెఱవకు మోవిభీషణుఁడ !
యని యమ్మహాత్ముఁనిజావాసమునకు
ననిచి యచ్చో నిల్చి యారంగవిభుఁడు
కరమర్థిఁ జంద్రపుష్కరిణి చెంగటను
సొరిది లోకములఁ బ్రోచుచు నున్నవాఁడు
ఆతఁడు చోళకన్యకరమాంశజను
బ్రీతిమై నచుళలోఁ బెండ్లియై జనులు
జగతిమైఁ దను సౌమ్యజామాత యనుచుఁ
బొగడంగ మిక్కిలిఁ బొలుపొందువాఁడు
సరవి నవగ్రహచక్రంబులోన
నరుణకైరవమిత్రులను బొందుపగిదిఁ
బ్రతిలేని యీతిరుపతులలో నాగ
పతిశైలరంగముల్ భాసిల్లుచుండు
మెలఁగెడు నూటయెన్మిదితిరుపతులు
నలరంగ విభునివిహారసౌధములు
వెలఁగైన యారంగవిభుమహామహిమ
మఱి వేల్పులకు నవాఙ్మనసగోచరము

అని తండ్రి రంగనాయకునివైభవము
వినుపింపఁగా నీలవేణి మోదించి
రవికాంతి గనినసారసముచందమున
నవిరళానందమయాంగయై పొగడి
యంతరంగంబున నారంగవిభుని
జింతించి ధ్యానంబు సేసి వేమరును
నఖిలంబు తన్మయం బనుచు భావించి
యఖిలైకమాత తదాసక్త యగుచు
జనకునిఁ గాంచి హస్తంబులు మోడ్చి
యనియె నీయిలఁ బుట్టినట్టికన్యలకుఁ
బ్రతిలేనిశ్రీపతిఁ బతిగా వరించు
గతి యెద్ది యనుఁడు నాకల్యాణిఁ జూచి
యక్కాంతుజనకునకై కంతుబారిఁ
జిక్కి వ్రేతలు మార్గశీర్షవ్రతంబుఁ
గావించి కృష్ణునికాంతలై రీపుఁ
గావించితేని నిక్కంబుగా నిపుడ
శ్రీవధూనాయకుఁ జెట్టఁబట్టెదవు
నావుఁడు జనకునానతిఁ బూని గోద
తనలోన నెంతయుఁ దద్వ్రతాచరణ
మున కుపాయము గ్రమమున వితర్కించి

మానసంబున రంగమందిరుం జేరి
యానోము తానోమి యానోముకరణిఁ
బనుపడ గోపికాభామను దానె
యని తలంచుట యని యాచరించుటయు
వెలయు ముప్పదివాట విశదమై మిగులఁ
దళుకొత్త నొకప్రబంధంబుఁ గావించె
మఱియు నాతనిమీఁదిమచుత పెల్లొదవఁ
జెఱకువిల్తునితూపుచెరకు లోఁగాక
నలినాక్షుపై నూటనలువదిపాట
వలనొక్క కావ్యంబు వరుసఁ గావించి
వెండియు శ్రీరంగవిభునిపైఁ బ్రేమ
కొండలై కొల్లలై కొలఁదికి మీఱఁ
దలిదండ్రు లెలమిమైఁ దనుఁ బిల్వ మాఱు
పలుక నత్తఱి రంగపతి యంచు ద్రుక్కుఁ
గనుఁగొన్న యదియెల్లఁ గావేరి యనుచుఁ
గనుగొలనబ్జపుష్కరిణియటంచుఁ
గనకచేలాంకువిగ్రహముల వేలిఁ
గనుఁగొన్న శ్రీరంగకాంతుఁడ యనుచుఁ
గనుగొల నేయిల్లు గన్న విమాన
మనుచు నెక్కడఁ గన్న యది రంగ మనుచుఁ

దలఁపుచు మది నన్యథాబుద్ధితోడ
నలరంగధామునియందునే తవిలి
శ్రీరంగనిలయుండు చెలిమిమై నన్నుఁ
జేరంగవచ్చి మచ్చికతోడ ముద్దు
గారంగఁ దనుఁ దనకరముల నింపు
గూరంగ నెలమి పైకొనునొక్క నన్ను
హత్తి నాజవ్వన మనునిధానంబు
రిత్తపుచ్చక తనరించి కైకొనునె
యని తదాసక్తయై యలరులసెజ్జఁ
గనుమూసి నిద్రింపఁగా నొక్కనాఁడు
శ్రీరంగపతి కృపాసింధుఁ డేతెంచి
సారంగనయన ముచ్చటవాయఁ గదిసి
సరసకళావిలాసములఁ బెంపెసఁగ
మరుకేళిఁ దేల్ప నమ్మానినీమణియు
నసఁగి పెనంగి ప్రత్యక్షమాదేవు
నొనగూడినటువలె నుండి మేల్కాంచి
కలగా నెఱింగి వెగ్గలమైనరంగ
జలజాక్షువిరహంబు సైరింపలేక
దారుణకందర్పతరవారిదారి
బారికి నోడి నిబ్బరమైన తమిని

హారంబుమీఁద నాహారంబుమీఁద
నారామకేళీవిహారంబుమీఁదఁ
బ్రియ మోసరించి పొంపిరివోవుమేని
భయదకందర్పతాపము నీఁదికొనుచు
నవరనిమందారశాఖయాఁదమున
నవచంద్రరేఖచందమున దీపించి
యిజ్జాడఁ బెరవార లెఱిఁగెద రనుచు
లజ్జించి తలిదండ్రులకుఁ జెప్ప నోడి
కమలాక్షు చామరగ్రాహిణియైన
కమలకోమలి యనుగ్రహపేరి తనదు
నెచ్చెలి తనతోడ నెఱి నేగుదెంచి
యచ్చట మనుజకన్యావేష మంది
యున్నట్టిచెలియు నెయ్యురాలైనయట్టి
కన్నియ గొలువ నాకాకకోర్వమిని
మాకందతరుసుషమాకందకుంద
శాకోటనటవికస్వరపికస్వరము
పూగపున్నాగకర్పూరనారంగ
నాగరంగోత్తుంగనాగకేసరము
రాజితచంపకారామంబుఁ జొచ్చి
రాజీవలోచనారాజితోఁగూడ

మెలఁగుచు వనములో మెలఁగుచునుండి
కలకంఠమధుకరకలకంఠసమితి
కోలాహలంబు దాకొన్న సైపమిని
హాలాహలం బని యాలింప నోడి
చెలులు గానుక లిచ్చు చెంగల్వతావి
యలగులు మరుతూపు లని యంట నెఱచు
విరిదేనియలఁ జూచి వికచాంబుజాస్త్ర
కరహతవిరహిరక్తము లని యలికి
కాళింది మును గోపకాంతల శౌరి
పాలించుచందంబుఁ బడఁతి భావించి
తాను నాగోపకాంతాభావ మంది
పూని తదంబరంబులు ముచ్చలించి
మును కుందతరుశృంగమున యున్నయతని
గనుఁగొని శిరముపైఁ గరములు మోడ్చి
యియ్యెడ మాచీర లిమ్మ వేవేగ
నెయ్యమారఁగ నని నిక్కి మొక్కుచును
జెలిమిమై నెపుడువచ్చెదవు నీ వనుచు
నెలనాఁగ హరిరాక కెదురుచూచుచును
గోరికి ముత్తెంపు కొలుచుమీఁదటను
సారెకు జానకీచక్రంబు చూచి

వెండియుఁ దనవనవీథిలోనుండు
గండుగోయిలఁ బెక్కుగతుల నంకించి
తనపతియగు రంగధాముఁ డిచ్చటికిఁ
జనుదేరఁ గొల్చినజాడతో నుండు
కాకున్న నీకన్నగతిని వేవేగ
నేకాన్తమైన నీవిప్పుడు పొమ్మనుచుఁ
బలుమఱు హరిబాళిఁ బడి తాప మొంది
యలయుచు నిదురించు నలకలలోనఁ
బాంచినతమి వేయుభంగులతోడ
నంబుజోదరుఁ బెండ్లియాడు మేల్కాంచి
తలఁపులో వెండియుఁ దన్మూర్తిఁ దలఁచి
బలసోదరునికేలి పాంచజన్యంబుఁ
గనుఁగొని శ్రీరంగకాంతునిమోవి
యనిశంబుఁ జవిచూతు వాయధరంబు
కపురంబుతావియో కమలవాసనయొ
యుపమింపఁ దియ్యనై యుండునో చెపుమ
యని మెన్ని యతనిబింబాధరామృతము
మనమునం గ్రోలి నెమ్మదినుండు మఱియు
ముంగలి తొలుకారుమొగులు వీక్షించి
యంగన తను నేలు మని చెప్పు మనుచు

నావేంకటాద్రీశుఁ డగుశౌరికడకు
వేవేగ ధూత గావించి తా ననుపుఁ
జిగిరించుకోర్కి నెచ్చెలుల వీక్షించి
యొగి నన్ను మరుబారి కొప్పింప నేల
ఖగరాజశైలరంగద్వారకాదు
లగునట్టితిరుపతులందు నింపొంద
భావజాలము తాపముఁ జెందకుండ
వేవేగ నను మీరు విడిచిరం డనుచు
గట్టిగా హరి తనకరపల్లవంబు
పట్టి కంకణమందు పతిగాఁ దలంచి
తన కేల మిగుల నిద్దపుశంఖ మలర
తన కేలిశంఖంబు తన కేల యనుచుఁ
గేలిమై బలిదైత్యు కేలికంకణము
చాలక నాదుహస్తంబుకంకణము
నడిగెడి నితఁ డేమి యని చాల నవ్వి
నుడివి బాష్పములు కన్నుల నిగిడించు
రాముఁడైనట్టి శ్రీరంగనాయకుఁడు
రామకై పూని వారాశి బంధించి
ప్రళయకాలమునఁ గోల్పడిపోవు భూమి
నలమహాకిటిమూర్తి యై యుద్ధరించి

తనుఁ గోరియున్న వైదర్భికై మున్ను
మొనసిన శిశుపాలముఖుల దండించి
పరచింత లుడిగి నిర్భరవృత్తిఁ దనదు
చరణపద్మంబులు శరణొందునట్టి
దంతిపాలస్త్రీగౌతమసతీవిహంగ
కౌంతేయసుతులాదిగాఁ గలవారిఁ
బాలించినట్టి శ్రీపతి రంగనాథుఁ
డేలకో నను నింత యెరపుగాఁ జూచె
నలకలలోన నన్నంగజకేళి
నలుకలు దీర్చి నాయలుకలు దీర్చి
యెనసి నిమేషంబు నెడఁబాయ నిన్ను
నని బాస యిచ్చి తా నరిగి రాఁడయ్యె
డక్కులలేనిమాటలు పల్కువార
లెక్కడఁ గల రతం డేమికావించుఁ
దహాతహా లేల యాతనిసద్విజిహ్వా
సహావాస మీరీతి సవరించెఁ గాక
యని యుట్లు దూరుచు నాకోమలాంగి
మనసిజువేడిఁ గ్రుమ్మరుచున్నయపుడు
వెడవిల్తునెరప్రొద్దువిరహంపుటొండ
వడదాఁకి యున్నచెల్వను విలోకించి

చెలువెల్ల వెలఁగంది చేర నే తెంచి
పలుమఱు నాయింతిభావంబుఁ జూచి
యేమొకో యీచంద మేటికి మున్ను
రామొకో వచ్చి యారామకోణముల
రామకోరికలు వారకతీర్చి మగుడఁ
బోమొకో యేటి కీపాలఁతి కీవేళ
నాటలు మనతోడ నాత్మ వేఱొకటి
మాటలు మనవంక మన సొకవంక
దగిలియున్నది యెట్టిధవునిపై మనసు
దగిలియున్నదియొ యీతరుణికి ననుచుఁ
గోమరొంను చెంగల్వకొలని చెంగటను
సమకొన్నగొజ్జంగిచవికె నెన్నడుమఁ
బన్నీటికాల్వడాపలఁ గప్పురంపుఁ
దిన్నెమై నెలచుట్టుతిన్నెమీఁదటను
బలుచగాఁ బుప్పొడిపరు పొనరించి
చలువగాఁ దలిరుపచ్చడ మప్పళించి
చెలగెడు నాపూవుసెజ్జమైఁ జెలువఁ
జెలువార నునిచి నెచ్చెలులెల్లఁ గూడి
పన్నీటికేల రెప్పలమీఁదఁ దుడిచి
చెన్నారు వలిసంపుఁజెంగావి గట్టి

కలయుంగఁ బన్నీటఁ గపురంబుతోడఁ
గలపనసేసిన కలపంబు మెత్తి
తుళకింప నునుటఁ గస్తురిబొట్టుఁ దీర్చి
వెలిదమ్మిపివన పీవ నావేళఁ
జిలుకవారువము కెంజిగురునారంజి
తళుకుగల్వలజోడుతమ్మిబొమ్మికము
చెఱకుసింగిణియు గొజ్జంగి కేవడము
దరమైనవిరియంపతరకసంబులును
నలవడ నంగజుం డయువెంచి పొంచి
నిలుపుగన్నులవిల్లు నరినెక్కుఁ ద్రోచి
చిమ్మచీఁకటినింపు శింజిణిదండి
తుమ్మెదగరిపూవుతూపు సంధించి
నెలవులనైదింట నిలిచి నేరుపున
లలిమించి కదిసి వోలము ముంచి పొంచి
తీయుగాఁ దెగనిండ దిగిచి తొందంబు
దూరి పారఁగనేసి త్రోన యార్చుటయు
సకియపాలిండ్లపైఁ జందనచర్చ
తుకతుక నుడుకంగఁదోడఁగెఁ దాపమున
నువిదకుఁ గనుదోయి యొప్పె నావేళ
రవి దేరఁగొన్న కైరవములభాతి

సురుఁగులై చూపట్టె సూనంబులెల్ల
సరులెల్ల నీలంపుసరులజాడయ్యె
నప్పుడాసఖులెల్ల నాపువ్వుఁబోఁడి
తప్పక చూచి యెంతయు విన్నఁబోయి
కనుఁగొంటిరే కల్పకంటి యున్నట్టి
యునికి యిందఱుఁగూడి యొనరించినట్టి
యుపచారవిధుల నెయ్యురు బగసేయ
నిపుడు క్రమ్మఱ మన మేమిసేయుదము
వెడవింటివాఁడు గర్వించి యిప్పాట
నోడ తెఱుఁగక మెఱయుచున్నవాఁడు
పెలుచఁ గోవెల యన్నఁ బెంపుడుఁ బేయ
కెలయు గీరంబు మిక్కిలి వాతరట్టు
తలపోయ నీతుమ్మెదలుగూడ గొట్టు
మలయమారుతము దిమ్మరిదిప్పకాయ
యెవ్వరి మన మింక నిట వేఁడుకొంద
మివ్వాలుగంటికై యేమిసేయుదము
అని శీతలక్రియ లాచరింపుచును
గనకవిగ్రహ యనుగ్రహ చేరవచ్చి
కన్నియ లాలించి కరపంకజమునఁ
గన్నీరు డించి యంగములెల్ల నివిరి

జాఱినపయ్యెదఁ జక్కఁగా నొత్తి
మీఱినతాపంబు మెల్లంబుసేసి
యీతఱి నీమది నెనఁగినకోర్కి
నాతోడఁ జెప్పవే నాతోడ! నీవు
ఎక్కడఁబొడమింప నేల కొంకెదవు
నిక్కంబు చెప్పవే నీయానయట్ల
కాక బొందులు వేఱె కాని ప్రాణంబు
లేకంబు లైయుండు నిద్దఱి కెపుడు
నని కూర్మిఁ గొసరి యొయ్యన నొత్తియడుగ
నునుసిగ్గు వాలుగన్నుల నామతింపఁ
జెప్పనుంకించు లోఁ జిప్పిలునానఁ
జెప్పనోడుచు నరచెప్పి గ్రుక్కుచును
దనుదానె యొకకొంతతడవున కిందు
కొని ప్రియసఖి దేరకొని యేకతమున
నీతోడునీడనై నీమాట మీఱ
* నేతఱి నెర నే నెంతగానైన
వినవె నాకలలోన వెన్నుఁ డేతెంచి
ననుఁ గూర్మి నాలింగనమున లాలించి
మరుకేళిఁ దేల్చి వేమఱుఁ జెప్పరాని
సరవులు నీరానిచనవులు నొసఁగి

---

* నేఱు నేయొంతైన నీలాహివేణి.

యనిశంబు నన్నుఁ బాయ నని తలం జేయు
యొనరింపఁ గడునమ్మియుండి మేల్కాంచి
యడపక యది మొదలై వానిబాళిఁ
బడి చిత్తజునిబారిఁ బడి యింటిలోన
నెక్కడ నింటివా రెఱఁగెద రనుచుఁ
గ్రుక్కుచు లోలోన గుబ్బతిల్లుచును
నుండితి నిన్నాళ్ళు నొకరీతి నింక
నుండు టేగతి వాని నొనగూడ కింతి
యని చకోరములు నీరాడి జాడించు
ననువునం గన్నుల నాను బాష్పములు
తొంగలి రెప్పలతుద జాటి మీఁటి
పొంగారుకుచకుంభములమీఁదఁ దొరుఁగ
నున్నకోమలిఁ జూచి యూరార్చి పిదపఁ
దిన్నని పలుకులం దెలివి నొందించి
యింతమాత్రమునకు నేటికి నీకు
వంతలఁ బొంద నోవనజాయతాక్షి!
నీవునోమిననోము నిక్కమై నీకు
భావింప శ్రీరంగపతి పతి యగును
ననుచు నూరార్చి యయ్యతివఁ దోడ్కొనుచు
ననుఁగుఁజేడియలతో నరిగె నింటికిని

యంతట నొకనాఁడు హరిచిత్తుఁ డాత్మ
జింతించి రంగేశు సేవింపఁ గోరి
ఆసతిఁ జతురంతయానాధిరూఢఁ
జేసి యెంతయువేడ్క శ్రీరంగమునకుఁ
జనువేళ నాకన్య జనకునిం బిలిచి
యనియె శ్రీరంగనాయకునిగోపురము
నెచటికిం గనవచ్చు నేవేళ నప్పు
డచటఁ బల్లకి డించు మన సమ్మతించి
ఘననదీశైలసంఘంబులు గడచి
చనుదెంచి నిజశిష్యసహితుఁడై యంతఁ
దుదలువిప్పక విప్పఁదొడఁగురుమ గడలు
మృదులకోరకముల మెదలుతుమ్మెదలు
నించువిల్తునికేళి నెలదమ్ముయుప్ప
నించువేడుక రమియించి చంచువులఁ
జించి కొమ్మలకుఁ గొంచెపుమృణాళములు
కొంచక యొసఁగెడుకొంచలంచలును
లోలంబులైన కల్లోలడోలికల
నోలి నూఁగుచుఁ గేలి నొలయుచోటులకు
నవలచెందొవలలో నలరుతేనియలఁ
దవిలి యందిచ్చు నిద్దంపుజక్కవల

వలగొన్న నల్లగల్వల వాలుమీలు
పొలయంగ వెలయు పుష్పాళ్ళతెప్పలు
పలుమఱుం దరులఁ జొప్పడు నాగపూగ
మలయజంబులతావి మలయుతెమ్మెరలు
కాకమైఁ బోకమోఁకల నూఁకి దరుల
నీఁకమై గోరాడు ద్విరదదంతములు
తాఁకుల నంతరాంతరము లైనట్టి
వ్రేఁకంపునెలచల్వ నెడదవిచ్చెనల
జలకేళి సవరించి సఖులతోఁ గూడ
విలసిల్లి యేగెడు వేల్పుబైదలులు
కలకలమను పాదకమలమూలముల
మలకలసొమ్ము లుమ్మడి నొప్పమిగుల
వలవెలువడుజక్కవలరీతిఁ బయ్యె
దలఁ బాసి కుచపర్వతములు గీఁటాడ
నాలోలకర్ణభూషావళుల్ గండ
పాలికాతటములఁ బంజళ్ళు ద్రొక్కఁ
దరణిబింబము లభ్రతలముల నొప్పు
కరణి గ్రొమ్ముళ్ళు బంగరుబొట్టులమరఁ
బసనైన తమమించుపాలిండ్లఁబోలు
పసిఁడికుండలు పట్టి పరతెంచుచున్న

॥ద్రావిడాంగనల నెంతయు నొప్పనొప్పు
కావేరి దాఁటి రంగపురంబుఁ జేరి
తఱచైనద్రవిడవేదముల వేదములఁ
బెఱమాట వినరాని పెనువీథిఁ గడచి
మలయజయుతమైన మంచిపన్నీటి
కలయంపి గలగృహాంగణములు దాఁటి
యారయ దామోదరాహ్వయుం బగుచు
శ్రీరమాయావనశ్రీలఁ జొప్పడుచు
నుడురాజకలశమై యొప్పారుచున్న
పొడవైన తూర్పుగోపురము సొత్తెర
నంతకుమున్న యయ్యాలివేణి రంగ
కాంతునిచెంతకు గగనమార్గమున
నరిగియుండుటఁ దెలియక భట్టనాథుఁ
డరుదారఁ దనపట్టి యనుమాటఁ దలఁచి
పల్లకి డింపించి పరమానురక్తి
నల్లనఁ దనుజాత నంకించి పిలిచి
పంజరం బెత్తి లోపలఁ జిల్క లేని
పంజరంబునుబోలె పట్టి లేకున్న
యానంబుఁ గనుఁగొని హా యంచుమూర్ఛ
నూని తెప్పిరి మఱియును విచారించి

మదిలోన రంగేశుమాయఁగా నెఱిఁగి
గుడిగొన్న నెవ్వగం గ్రుమ్మరిల్లుచును
పాయనికూర్మిచే బాష్పంబు లురులఁ
దోయజోదరు నాత్మ దూరి యిట్లనియె
నకలంకనిజకీర్తివై నీతి దొరఁగి
యకట! నీకిట్టు తగునయ్య రంగేశ!
యీరీతిఁ దొంగిల నీకొమ్మ గోప
నీరజాక్షులనవనీతమే తలఁప?
బలిమిఁ గైకొన రాజబాలికామణులె ?
తలపోయ కిట్టు సేయఁ దగునె? గోపాల!
మున్నుగా జనని యీగ్రముచ్చిలువిద్య
వెన్నతో నిడినదే వివరించి చూడ
వనజాక్షివలసినవాఁడ వైతేని
ఘనతమై మాయింటికడ కేగుదెంచి
యడగి చుట్టఱిక మేపారంగ సేన
ఋడి నీవు గొనిపోవు టెంతియకాక
జగదేకసాక్షివై సర్వనాయకుఁడ
వగునట్టి నీవ యన్యాయంబు సేయ
మితిలేని మున్నీరు మేరమీఱఁగ
నితరులు వారింప నెట్లు లోపుదురు?

అనుచు శ్రీరంగనాయకునిసన్నిధికి
జనుదెంచి పాదాంబుజములపైఁ ద్రాలి
తొరఁగెడి కన్నులతోయపూరములు
చరణాంబుజముల మజ్జన మాచరింప
వనజాక్షునాజ్ఞ శ్రీవరచిత్తకన్య
తనతండ్రిశోకంబుఁ దరియింపఁ దలఁచి
యమలనాగేంద్రశయానుఁడై యున్న
కమలాక్షు వామభాగమునందు నుండి
కడునొప్పు నీలమేఘములోనున్నడి
వెడలుశంపాలతవిధమున వెడలి
కంకణము-లెనుచు గ్గడలుకొనంగఁ
బంకజానన పాణిపల్లవం బెత్తి
యన్న! నీ కేటికి వడల నిచ్చోట
నున్న నన్నిటు చూడు; మోతండ్రి! యనినఁ
దోన శ్రీరంగనాథుఁడు తెలిగన్ను
గోనల నమృతంబు గులుక నిట్లనియె
వడలకు నీవన్న యట్ల నీయింతి
కడకుఁ బసిఁడిరెక్కల తేజి నెక్కి
ననుపార సకలసన్నాహంబు మెఱసి
చనుదెంచి నీకూఁతు జలజాతనేత్ర

సురలు నచ్చరలును జోద్యంబునంద
వరియింతు నీచెలువను సొంపు మీఱ
నలవనిశోకంబు వలదు క్రమ్మఱను
బొలఁతుకఁ దోడ్కొనిపోయి రమ్మనిన
నలరి శ్రీరనిగనాయకుపాదపద్మ
ములకు సద్భక్తిని మ్రొక్కి యగ్గించి
కూరిమింతోఁ దనకూఁతుఁ దోడ్కొనుచు
భోరున నిజపురంబున కేగుదెంచి
యనఘు భూమీశు లోకైకపం కేజ
దినమణివల్లభదేవు రావించి
యరవిందలోచనుం డాత్మసంజాత
వరియింతు ననుటయు వరుసతోఁ దెలిపి
యెన్నిక మఱియు నేమేమి గావలయు
నన్నియు సమకూర్పు మని సమకట్టి
పనిచిన నరిగి యాపాండ్యభూనాథుఁ
డనుపమకనకరత్నాదివస్తువుల
రమణీయమాణిక్యకరంగవల్లికలఁ
గమనీయకాంచనకదలికాతతుల
సిరిమించుపురముఁ గైసేయించి మగుడి
యరుదెంచి యెఱింగింప హరిచిత్తయోగి

పనిఁబూని సకలశోభనవస్తువులును
నొనర నాయితపఱచుచుండె నున్నంతఁ
జక్కని వేంకటశైలనాయకుఁడు
చొక్కించుమాపులసుందరేశ్వరుఁడు
మెపుఁడు గోదాసతియెద నుండు నరుమఁ
దప మొనర్చినవటధామమూర్తియును
నొకటియై యొంతయు నొప్పారుచుండఁ
జికిలిలేనగవుల శ్రీరంగవిభుఁడు
తెలిపాపసమకట్టుతేజినెక్కి
కొలఁగక నిత్యముక్తులు చేరి కొల్వ
ఫణమణిద్యుతులు దిక్పటలంబుఁ బొదువ
ఫణిపతి ముక్తాతపత్రంబుఁ దాల్ప
మఱి గంధవాహుండు మకరవాహుండు
ముఖ్యులైన చామరములు పూని వీవ
చెలరేఁగి భానుండు శీతభానుండుఁ
దళుకొత్తు తాళవృత్తంబుల వీవ
హరుఁడు శచీమనోహరుఁడు మునుగలిని
దరమిడి తోత్రవేత్రములందు నడువఁ
గేలి నాసురరాజు కిన్నరరాజుఁ
గాళాంజిహడపంబుఁ గైకొనినడవఁ

బెక్కుచందంబులఁ బెక్కుచందములు
గ్రక్కున వందిమాగధ*వృత్తి గొలువ
నరసురాసురయక్షనాగగంధర్వ
వరులు సేవింప నావనజలోచనుఁడు
నేతేర నపు డెదు రేగి యాయోగి
యాతతభక్తిమై నడుగుల కెరఁగి
సకలోపచారము ల్సవరించి భక్త
నికరంబుతోఁగూడ నిజగేహమునకు
నాకంజలోచను నతిసంభ్రమమునఁ
దోకొనిపోయి బంధురపీఠ నునిచి
యలవడ సోపానలయిన వల్లాడఁ
జెలు లంత నాహరించి తప్పత్రికిని
గుంకుమ నలుగిడి గొజ్జంగినీరు
పొంకంపుఁబసిఁడితేంబుగలచే ముంచి
సరగున మంగళస్నానమాడించి
తరుణికి జిలుగారుదడిసుసు లిచ్చి
వెలఁది చుక్కల వికవిక నవ్వుచుండఁ
దెలిమించు మెఱుగుముత్తియపు గొండెముల
గనకంపుఁజెరఁగులఁ గనుపట్టుపట్టు
జినుగుదువ్వలువ కుచ్చెలవట్టికట్టి

---

*వరుల్

మొగముగబ్బునగూర్చి మొగిసినదిశల
భుగభుగమను గందవొడి మేన నలఁది
నొగినల్లమొగులులో నొదిగి తారకల
పగిది క్రొవ్విరులు లోఁబడ భిటారముగ
మినుకారుగండుతుమ్మెదఱెక్కముబ్బఁ
దని కెమ్ముకురుల బిత్తరముగాఁ దురిమి
వెన్నుపై. నెడమించు వేడించుకరణిఁ
క్రొన్ననవిరిదండఁ గ్రొమ్మిడిం జుట్టి
పొగరారు నెరనమ్మిపురివిచ్చుపగిది
మొగలిరేకులు వింతమురువుగాఁ జెరివి
యసమానవదన చంద్రాంకురం బనఁగఁ
బసనిముత్తియపుఁ బాపటచేరుగిల్చి
సారెకుఁ దనుమించి చనుకాంతిఁ బొదలు
నీరసంబును వదనేందుబింబమును
గచభారరాహువు గబళింపకుండ
రచనఁగాఁపిడినచక్రంబులో యనఁగ
మూలలెన్మిదియైన మొగమానికముల
డాలించువిమలతాటంకముల్ పూని
తెలిదమ్మికొనలను దేఁటినూగెసఁగు
కలికిబాగులసన్నకాటుకఁ దీర్చి

మదనుండు ముక్కుసంపఁగిలాలమున
నొదవించుకపురంపుటుండయో యనఁగఁ
గరిరాజవరదుని ఘనకీర్తిఫలము
కరణి నింపొందుముంగరఁ గీలుకొలిపి
యలసయానమ్ముల రాయంచలం గెలిచి
పెలుచఁ బెట్టినవాదు పెండేర మనఁగఁ
గమలాప్తబింబంబుగతి నొప్పుమణుల
రమణీయ మగునూపురముఁ బొందుపఱచి
కమలమూలములఁ గంకణగణం బమరు
క్రమమున రత్నకంకణములు దొడిగి
ఘనతరశైలశృంగంబులమీఁదఁ
గనుపట్టు సెలయేటికాలువ లనఁగ
ననుకుగాఁ గస్తూరి యలఁదినగుబ్బ
చనుదోయిమై *బన్నసరములు వైచి
నలినారిమైతారనకరాంక మొప్పు
నలువునం గస్తూరినామంబు దిద్ది
చెలులు నేరుపునఁ జూచినకల్పలతిక
చెలువున నిట్లు గైసేసి తోతేర
దినకరచంద్రులు తెరవట్టిరపుడు
తనుజాత నయ్యోగిధవుఁడు తోతెంచి

*పంచ

మకరకుండలునకు మధుపర్క మొసఁగి
సుకుమారి నిచ్చె కృష్ణునకు నవ్వేళ
సురలోకవరుమంత్రి సుముహూర్త మనిన
నిరువు రొండొరుమోము వీక్షించుతఱిని
జలజాక్షి మున్నుగా సగుడజీరకము
చెలఁగి రంగేశ్వరుశిరమున నిడియెఁ
గవమొగుళ్ళను జంద్రికలు పర్వినట్లు
తవిలి యొండొరులమైఁ దలఁబ్రాలు నించి
కరకల్పశాఖలం గనుపట్టువిరుల
సరవిముత్తియపుసేసలు దోయిలించి
గట్టిగా నాగమోక్తపరికారమున
గట్టిరి హస్తకంకణము లొండొరులు
వలవధూవరులఁ జయ్యన దివ్యరత్న
సలలితం బగుపెండ్లిచవికెమీఁదటను
బనుపడ గొనబు చూపట్టునుత్తరపు
కొనలుగా వేయుచుంగులచేలవఱచి
చెలువొందుపీఁట నాసీనులం జేసి
జలజసంభవుఁడు శాస్త్రపరికారమున
ననలుని నెలకొల్పి సాంగంబు గాఁగ
మనమార లాజహోమములు సేయించి

యలవహ్నానగులు హోమాగ్నికిం బ్రేమ
వలచుట్టిరాఁగ నవ్వనమాలిఁ జూచి
పనుపడ నిడ సప్తపదులు మెట్టింపు
మనిన గంగాధరుం డమరనాయకుఁడు
నలఁతినవ్వొలయ నేమయ్య యీవేళ
శిలవనిసి గ్గేల వనజాక్షిపదము
గట్టిగా నీనాల్గుకరములఁ బట్టి
మెట్టింపరాదె యగ్నిలి నన్న నగుచు
భామినిచే సప్తపదులు మెట్టించి
హేమాంబరుఁడు తొంటియొకవ్వన నున్నఁ
గలికిలాగులయక్షగంధర్వసతులు
సోలపులు మీఱంగ సోబానపాడ
ముత్తెంపుబొగడల మొనయుబాసికము
నత్తఱి నజుఁడు గాయజుఁడు గట్టంగ
వాణి శర్వాణి సౌవర్ణపాత్రికల
రాణించురత్ననీరాజన లొసఁగ
హరిదీశముఖులును హరిచిత్తముఖులు
విరివిగాఁ దమలోన వీఁకులు జదువఁ
ద్రిదశార్యముఖ్యులు దివ్యసంయములు
పొదవి యాశీర్వాదపూర్వంబు గాఁగ

సకృతులైన యయ్యాదిదంపతుల
కకృతంబులు వెట్టి రాగమోక్తముగ
హారియాజ్ఞ నవనిధు లట కేగుదెంచి
కర మర్థితో నూడిగంబులు సలుప
శ్రీరంగనాథునిసేనావిభుండు
కారినందనుఁడాదిగాఁ గలవారిఁ
గమలసంభవుఁ డాదిగాఁ గలవారి
బ్రిమదంబుతోడ సంభావించె నపుడు
వల్లభదేవుండు వరుసతో భూమి
వల్లభులను గారవమునఁ గావించె
నీవిధి రంగమహీనాయకుండు
వినైు నలవధూటిని వరియించి
మోదించి కాసారముఖ్యయోగులకు
గోదనెచ్చెలులకుం గురుకాధిపతికి
వలయువారికి నిష్టవరముల నొసఁగి
యలరుచు నుండి నాలవనాఁటిరాత్రి
యురగతల్పమున నయ్యుడురాజవదనఁ
దిరమొుంద మరుకేళిఁ దేల్చి తేలి
యోగనిద్రాసక్తి నుండఁ బూర్వాద్రి
జేగురుసెరసినచెలువు దీపింపఁ

ప్రౌఢసారథిపాదుపులచాయ లెసఁగఁ
దద్దయుఁ బ్రేమ నత్తఱి నేగుదెంచి
యలపరాంకుశముఖ్యు లగుయోగివర్యు
లలరి గోదాయుక్తుఁ డగురంగవిభుని
పారిదిఁ బ్రాబోధకీస్తుతిఁ బాడఁదొడఁగి
రరుణబింబా బుదయాద్రిపై నిలిచెఁ
బలపల వేగి వీక్షాడ మబ్బు లడఁగె
నలరుచుఁ బూదేనియలసోన గురిసెఁ
బాలించి కరుణదొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కొనవె
ములముల వికసించుమొల్లక్రొన్ననల
వలపులఁ దూర్పువీవలు లెచ్చరింప
మంచుగుబ్బలుల వేమరును గేలించు
నించురెక్కల మించులెసఁగ జాడించి
నత్తావియిండ్లలో నిదురించుచున్న
మత్తహంసలు నంచమగలు మేల్కనిరి
పాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కొనవె
చుక్కలపుచి డొంకె సోముండు గ్రుంకెఁ
దిక్కులరవికాంతి దీప్రడింపఁ దొడఁగెఁ

ఖోఁకపూబాళల బోదిగొన్నతావి
సోఁకులవలిగాలి సోలయుంగఁ దోడఁగెఁ
చాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి మేల్కనవె
వ్రేపల్లె గోపుల వేణునాదంబు
లేపారె రవళించి వృషభసంతతుల
గాటంపుమేతల గబ్బులు మీఱెఁ
దేఁటిదాఁటుల మ్రోఁత దెసలఁ బెల్లొదవెఁ
చాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె
రాత్రి దొలంగె నారామభూజములఁ
బత్రులు వికసితపత్రంబు లయ్యె
నలరె నంబుధిఘోష మమరబృందంబు
దళుకొత్తు పెక్కుపూదండకానుకలు
పూని సీపదపద్మములసేవఁ గోరి
యూనినవేడ్కతో నున్నారు వీరెఁ
చాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె
తేరులనిలిచి యాదిత్యవర్గంబు
లారూఢవృషభేంద్రు లై పశుపతులు

కమనీయశిఖి నెక్కి కార్తికేయుండు
నమరులఁగూడి నృత్యములు సేయుచును
వినుతించి నిన్ను సేవింప నీవేళఁ
జనుదెంచి నీదుమోసలనున్నవారు
పాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె
యమర గంధర్వ విద్యాధర దైత్య
సముదయయుక్తుఁడై సంక్రందనుండు
కరి నెక్కి ఘనమునిగణమును దాను
దొరసి ద్వారమునఁ దోదోపులాడెదరు
పాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి మేల్కనవె
సిధులు సంబుధులును నిర్జర కపిల
బుధులు నప్సరలుఁ దుంబురునారదులును
మునులు నీముందర మొనసియున్నారు
వనజాప్తుకాంతి తీవలువాఱె దెసలఁ
బాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె
కరమర్థిఁ గిన్నర గరుడ సిద్ధాను
లరిది మృదంగవీణాదివాద్యముల

సరవిమై నీమీఁది సంకీర్తనములు
పరిపరిలాగులఁ బాడుచున్నారు
పాలించి కరుణం బొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి మేల్కనవె
తమ్ములు వికసించెఁ దరణియుం బొడమెఁ
గొమ్మలు పసపాడి కోరి నీరాడి
కట్టిరి పుట్టముల్ కావేరినడుమఁ
బుట్టక పుట్టిన పూసెజ్జ నున్న
నీలనీరదవర్ణ ! నీయోగనిద్రఁ
జాలించి శ్రీరంగశాయి ! మేల్కనవె
శ్రీరఁగనాథుఁ బూజింపంగవలసి
పూరించియున్న యీపూవులకరఁడి
నందంబుగాఁగ భుజాంతరసీమ
యందుఁ గైకొన్నభక్తాంఘ్రిరేణుండు
గావించె నీదశగాథలచేత
భావినుతముగఁ బ్రాబోధకీర్తనివి
అనుసర్థముల నొప్పు సలభక్తపాద
వనజాతరేణు కావ్యంబుఁ జొప్పడఁగ
గురుభక్తి సలపరాంకుశముఖ్యులెల్లఁ
గరమర్థి మంగళగానంబు సేయ

నురగేంద్రశాయియై యున్న శ్రీరంగ
వరుఁడు మేల్కాంచి యవ్వనితయుఁ దాను
గనువిచ్చుపుండరీకములచందమునఁ
గనువిచ్చి యెంతయుఁ గ్రమము దీపింప
నుచితసత్క్రియలెల్ల నొనరించి భక్త
నిచయంబు దేవతానికరంబు మునులఁ
గరుణాకటాక్షవీక్షణసుధాధార
దొరయించి యెంతొసంప్రీతి రెట్టింప
నారామతోఁగూడ నభినవలీల
శ్రీరంగమునకు వేంచేయంగఁ దలఁప
ననుగు రెట్టింపంగ హరిచిత్తుదేవి
తనపట్టిఁ జేరి యెంతయు బుజ్జగించి
యమృతంపు బెల్లంపు టచ్చులు మంచి
యమరేంద్రమనెలదోఁటయరఁటిపండులును
గడుమించు నపరంజికమ్మదోపులును
నొడి బియ్య మిడి కూర్మి మొలయఁ గౌఁగిట
నలమి యానందబాష్పాంబుపూరములు
తళుకుచెక్కులజార తనయ నీక్షించి
ననబోఁడితో రఘునాథునివంటి
పెనిమిటి నీకు నబ్బెను నోఁచినట్లు

మనమార విను పిల్చి మగఁడు నెయ్యమున
ననయంబుఁ జేరిరమ్మని చన వొసఁగి
మేలమిచ్చిన నుండె మేలంబు మాని
తాలిమితోడ నాతనిచిత్త మెఱిఁగి
సవతుగా నీతోడిసవతులు చూచి
యవునౌనె యని కొనియాడ నెల్లపుడుఁ
గనలక భూదేవిగతి నుండుమమ్మ
మనసిచ్చి మీలోన మగఁ డేరి నైనఁ
దలమీఁద నిడికొనఁదలఁచిన నిన్నుఁ
దలమీఁద నిడికొన్నదానిగాఁ జూచు
మిరవొంద నురముపై నిడికొన్న భక్తి
నరసి నీవున్నట్ల యాత్మ భావింపు
తరలకు మఱికొకదాక పోకాకు ?
తరవాత మది నెల్లిదము వలదమ్మ
తనయను మగనిడెందములోన నుండు
మని బుద్ధిచెప్పుచో హరిచిత్తయోగి
యాకన్నె రంగనాయకునిచెంగటికిఁ
దోకొనివచ్చి సంతోషంబుతోడ
నురుతరపీఠిపై నునిచి కట్టణము
లిరువుర కొసఁగి యోగీశుఁ డావేళ

మఱియు నావంటిపామరుల నీడేర్చ
గురుగాఁగఁ జేపట్టికొనఁగఁ దలంచి

*　　*　　*　　*

యలవడ నిత్యముక్తాళి సేవింప
నలవిష్ణుచిత్తకన్యకతోడఁగూడఁ
జిక్కనిఁతోలుబల్కు-సెకలింపుతేజి
నెక్కి- సొంపెక్కి- యాఋక్షమార్గమున
రాజిల్లుశితచామరముల వారముఁ
భ్రాజితరత్నదీపముల ధూపములఁ
గొనబుముత్తియపుఁగ్రముగ్గులను నిగ్గులను
దనరారువివిధనేత్రముల ఛత్రములఁ
గనకంపుటనఁటిమోఁకలను బోఁకలను
ననుపారుపుష్పగంధముల గంధముల
విలసిల్లు నారాజవీధి నేతేఁ
నలవస్తూవరులపోయగము సేవింపఁ
బరువడివచ్చు సంభ్రమమునఁ బౌర
తరళాయతాక్షు లెంతయు వేగపడుచు
సందడిపడుచు లో సంతోషపడుచు
నందంద వీక్షించి యాశ్చర్యపడుచుఁ
గడునాసపడుచు వేడ్కలఁ దడఁబడుచు
నడరుమేడలమీఁద నాయత్తపడుచుఁ

దిలకంబు కామినీతిలకంబు కోసలఁ
దెలివిమీఱఁగఁ దీర్చి తీర్చి యొనెంచి
తివిరి కాటుక కంటఁ దీర్పంగఁ బోయి
శ్రవణావతంసకైరవమునం దీర్చి
చనుదెంచె నొక్కర్తు, చంద్రాస్యయోర్తు
తనకేలినులివ్రుమధ్యమునఁ బొంకించి
యరుదెంచి యొడ్డాణ మఱుతఁ గీల్కొలిపి
పరువడి నేతెంచె; భామయొక్కర్తు
చేచేతఁ దా ముడిచినదండ లొసఁగ
నీచెలిఁ గరుణించె నీరంగవిభుఁడు
సరగున నే నట్లు సవరించి యతని
వరియింతు నని వచ్చ్వవహువున నొర్తు
సిరిమించుకొప్పు గొజ్జఁగదండ రంగ
వరునిచెంగట వీషిక్రవాల నేతెంచె
నీకీతి వచ్చి యయ్యింతు లాచెలువ
శ్రీరంగనాథుప సేవించి పొంగి
కొమరార నిటువంటి కొమరితెఁ గాంచి
కమలభవాదులుం గనలేనియట్టి
ధవళాక్షు నీరంగధవుని నల్లునిగ
సవరించికొన్న యాజగదేకనుతులు

వారెపో మహి భాగ్యవంతులమైన
నారయఁ గన్యకమైన నిట్టిదియె
తోయజాలయసయిదోడు దా నగుచుఁ
దోయజనాభుపొందులు సందుకొనియె
ధరలోననర్చావతారులైనట్టి
మురసూదనునిదివ్యమూర్తులలోన
నిట్టిబంగరుకుండ నిల్లాలి గాఁగఁ
జెట్టవట్టినయట్టి శ్రీరంగవిభుఁడు
వీఁడెపో ధన్యుండు వివరించిమాడఁ
బోడిమి గా నిట్లు పొగడి వెండియును
గన్నియకన్నుల కలికిబాగులను
జిన్నారివదనంబు జిగితావిమోవి
తిన్నదనంబుఁ గాఁదీఁగబిత్తరముఁ
బ్రన్నసిమెఱుఁగుగుబ్బలమిటారింబు
గురులసోయగముఁ జెక్కులమీఁదిమిసిమి
కరములయొప్పును గచముబెడంగు
నొసలియొప్పిదము నీనులచక్కఁదనముఁ
బసమించునారు లోపలినైకదనము
నడుగులవిన్నాణ మందంద చూచి
యుడివోనికూర్మిమై నొండొరుఁ జూచి

కలకంఠి జఘనంబుకలిమి యందఱకుఁ
గలుగునె గడిబారగనుబండికల్లె
హరిమధ్యగళముసోయగ మందఱకును
దొరక నేమేఁపొత్తులఁ బెట్టినదియొ
కుందకుట్మలదంత కొప్పువిన్నాణ
మందఱకును గల్గ నల్గాసనిడిరె
యిందుబింబానన యెలగౌనుచంద
మిందఱకును గల్గ నింతయల్పంబె
యన్నియు నేల? యీయలివేణిచెలువ
మెన్నిన జగతి నహీప్రతి యనఁగ
వినుము నా శ్రీరంగవిభుఁడు వారలను
గని కరుణాకటాక్షముల నింపుచును
నత్యంతసంతోషితాత్ములై యెదుట
నిత్యులు ముక్తులు నెలకొని కొలువ
నమరులు నిజవాహనారూఢు లగుచుఁ
గ్రమమునం దమయూథికములు గావింప
నంచతేజీ నెక్కి యరవిందసూతి
యంచబాయక వేత్రహస్తుఁడై నడవ
నీరీతి విలసిల్లి యెంతయు మగిడి
భోరునం దనపురంబున కేగుమండి

శ్రీరంగచంద్రుఁ డాశీతాంశువదన
గారవం బెలరారఁ గనుఁగొని పలికెఁ
దెరవ నీవంటిపుత్రీమణీతతుల
నెరయంగఁ దా గాంచు నిచ్చ నిచ్చలును
లలితకల్లోలలోలన్ముక్తమైన
నెలఁత యీతామ్రపర్ణీనదిఁ గంటె
మంజుబంభరచక్రమంజీరమైన
మంజీరనదిచెంత మానైనయట్టి
యారామగిరిరాజ మది గనుఁగొంటె
యోరామ! నేఁ బాయకుండెడు నెలవు
లదె చోళ పాండ్య మధ్యస్థితం బగుచు
విదితమై యొప్పుఘవిపినంబు గంటె
యినకాంతి కోకయింతియెడమీక యలరి
కనిన కన్నులకుఁ జేఁకల్లు గ్రమ్మెడిని
యలచోటిచెంచత లహిశిరోమణుల
బలుపొదరిండ్ల దీపంబు లెత్తెదరు
శ్రీలిచ్చుకావేరిచెంగట నొప్పు
చోళదేశం బదే సుకవాణి! కంటె
కంటివే యో తమ్మికంటి! ముక్కంటి
వంటిల్లు సురనాగవరు పుట్టినిల్లు

మామకశయనసద్మంబును జంద
మామగన్నతఁడు మామానినీగురుని
మామామ నీక్షింపు మామహాంబుధిని
సీమంతినీమణి చిగురాకుబోఁడి !

యనుచు నానతి యిచ్చి యతిసంభ్రమమునఁ
దనపురంబునకు నత్తఱి నేగుదెంచి
శ్రీవిలసిల్ల నచ్చెలువలతోడ
వేవేగ సదనప్రవేశంబు సేసి
ఫాలకీలితనాస్త్రపద్ము లైనట్టి
నాళీకసంభవనాకేశముఖుల

మునులఁ గృపాగసంబునఁ జెప్పఁదేల్చి
కనకాంబరాదులు గట్టంగ నిచ్చి
కరమర్థి వేర్వేఱఁ గరుణాపైవాలి
సరగున నిజనివాసములకు ననిచి

నెలకొని శ్రీభూమినీళలతోడ
నలవిష్ణుచిత్తకన్యకతోడఁగూడ
సరసకేళీలోలసంపత్తికలిమి
సిరులు దైవాఱంగ శేషతల్పమునఁ

బవళించి నిజభక్తిఁ బరిజనుల్గొలువ
నవిరళశ్రీమంతుఁ డైయుండె ననుచు

నలమేలుమంగకు నమలాంతరంగ
కలినీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికి
నంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్ళపాకన్నయార్య
తనయతిమ్మార్యనందనరత్నశుంభ
దనుపమశ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధసరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగివిలాసకృతిని
నతులితంబుగఁ బంచమాశ్వాసమయ్యె.



# పరమయోగివిలాసము.

## షష్ఠాశ్వాసము.



హైమసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
మునిశాలికాసారముఖ్యభక్తాళి
వనమాలి! యవధారు వరదానశీలి!
దండిమైఁ గావేరి దండసంపదల
మండలం బగుచోళమండలంబునను
గడలేని యలపూర్వకడలికిం జక్కఁ
బడమటిదెస నొక్కపట్టణం బొప్పు
మునుపు నచ్చోట సన్మునిసేవ్యబిల్వ
వనభూమిలోన నవ్వనజాతనిలయ
హరిఁగూర్చి తపముసేయఁగ శౌరి వచ్చి
వరమిచ్చి ప్రేమ నివ్వటిలంగ మెచ్చి
పరిరంభణము సేసి పాలించుకతనఁ
బరిరంభపురినాఁగఁ బరఁగునప్పురము

దోరయంగఁ గృతయుగాదులనుండి వరుస
హరిణాదివర్ణయుక్తాంగము ల్గలిగి
శ్రుతు లుద్ధరించి యచ్చోఁ గర్దమాది
వితతభక్తికి మెచ్చి వేల్పులు గొలువ
జలజలోచనుఁడు ప్రసన్నుఁడై యెపుడు
నెలకొనియుండు దానికి సమీపమున
ననుపమం బగుకమలాపూర్ణనగర
మననొప్పుపురవరం బాపట్టణమునఁ
గమలామనోహరుకారుణ్యకాంశంబు
కమలలోచను పాదకమలవంశమున
ఘనతకార్తికకృత్తికను జనియించి
యనుపమయోగవిద్యాసక్తుఁ డగుచు
జననవేళను రమాస్వామికటాక్ష
మును జెంది తద్ధ్యానమున విలసిల్లి
కామినీమణులకుఁ గందర్పుఁ డర్థ
కామలోకమునకుఁ గల్పభూజంబు
పరులకుఁ గాలుండు పరమయోగులకుఁ
తత్త్వ మఖిలభూప్రజలకు రాజు
పఁగాఁ జతుర్విధకవిత్వములఁ
రేణ్యులకెల్లఁ గర్తయు నగుచు

మును రంగమున నొప్ప మురవైరికరణి
జనులెల్లఁ దనుఁ బెక్కుసరణులఁ బొగడఁ
బరకాలుఁ డనుపేరఁ బరఁగునాథుని
కరలాలితం బైన కరవాలవల్లి
యరివీరరక్తతోయంబుచేఁ బ్రబలి
పరఁగ సత్కీర్తి పుష్పంబుల నగుచుఁ
బరమయోగీంద్రుఁ డాపరకాలుఁ డఖిల
ధరఁ జతుర్విధకవిత్వస్వామి నాఁగ
బిరుదంబు నలరమాప్రియునిచే నంది
సిరిమించి వరకవిసేవ్యుఁడై మించె
నీరీతిఁ జోళరాజేంద్రునిరాజ్య
భారమంతయు భుజాబలముచేఁ బూని
జనులెల్లఁ దనుఁ గాంచి జయవెట్టుచుండ
ననుపముండగు మంత్రి యైయుండె నంత
బరిరంభపురసమీపంబున నాగ
పురి యన నొకమహాపురము శోభిల్లు
మదనునితండ్రిసద్మంబు లచ్చోట
బదునొకం డొప్పు నభంగవైఖరుల
రంజితకిన్నరీరత్నాంఘ్రికంజ
మంజీరశింజితమంజుఝుంకార

చలదలమకరందసంకీర్ణవిమల
నలినకైరవకోకనదపుండరీక
కలకంఠచక్రవాకక్రౌంచహంస
కులకలరావసంకుల మైనకొలను
అరయంగఁ దత్పురప్రాంతంబునందుఁ
గర మొప్పు ధవళపుష్కరిణి యనంగఁ
కులాత్ము నాజ్ఞ నక్కమలాకరమునఁ
గొందు నొకదివ్యకుముదంబునందుఁ
బగడ పూముల్కిగతి వేల్పుజెలువ
పొడవయ్యిరిసెజ్జఁ బొలుపొందునంతఁ
జాక దుములసంచి జగజంపువలువ
పొంకమైజకర్ణముల నొప్పుదూది
కునివడఁ జిన కుఱుమాపుపాగ
యనువందంచలోహంపుటుంగరము
నురుతరం బైత్రి యూర్ధ్వపుండ్రం బు
కర మొప్పు వజ్రలికరకకాయలును
బెరయఁ బచ్చడముతోఁ బెనుపడసంది
నరగనుపట్టు బాహటపుస్తకముఁ
బనుపడ లో గుణపాఠంబుఁ జదివి
కొనుచు మొలికలు దిక్కులఁ జూచికొనుచుఁ

గమలాక్షుపాదపంకజభక్తినిరతుఁ
డమృతహస్తి యనంగ నలవడువాఁడు
నెన్న ధన్వంతరి కెనయైన వైద్యుఁ
డన్నగరన యుండునతఁ డేగుదెంచి
కొమరారు నెదుటి యాకొలను వీక్షించి
క్రమమునం దత్తటాంగణసీమఁ జేరి
స్నానంబు సేయంగఁ జని సరోవరము
లోనఁ బూవిల్తువాలును గేలిగొనుచు
నొక తెల్లగలువలో నున్నపూఁబోఁడి
సుకుమారి యగు వేల్పు జూలి నీక్షించి
యెలమితో ఁ జేయి ము న్నెత్తెంచి కలువ
నిలిచిపోకున్న వెన్నెలపోఁగ యనఁగ
నావనజాస్త్రపుష్పాస్త్రమంత్రాధి
దేవతయో యనఁ దెలివొందఁ జూచి
తనయులు లేమి నాతరళాయతాక్షి
గొనకొన్నకూర్మి నక్కునఁ జేర్చికొనుచుఁ
దనరార నిజనిశాంతమున కేతెంచి
తనసాధ్విచేతి కాతన్వంగి నొసఁగి
యక్కన్యఁ గొనివచ్చినట్టియాచంద
మక్కజంబుగఁ దెల్పి యాత్మ నుప్పొంగి

యల్లిలో నుదయించె నని యెన్ని కుముద
వల్లినామం బిడి వారని ప్రేమఁ
బదివేలతెఱఁగుల బాల నిర్వ్యారును
ప్రముదమున మిగుల గోమునఁ బెంపుచుండ
నానాఁటఁ బొదలి యానాళీకవదన
యేనాఁట వెఱఁగైన యెలమించువోలెఁ
జిగురువిల్కాని తేజీకూన యనఁగ
నవకమై యపరంజినక్కడెందమున
నెలజవ్వనం బను నెలదోఁటలోన
మెలఁగుచుండెడు కోడిమెకమొకో యనఁగ
వలనొప్పు శృంగారవాహినిలోన
బెలకెడు క్రొమ్మించు బేడస యనఁగఁ
గనుపట్టియున్న చక్కనిపట్టిఁ జూచి
జననియు జనకుండు సంతసం బెసఁగ
నివ్వాలుగంటికి నివ్వాలుమేన
జవ్వనం బొయ్యన సనులొత్తఁ దొడఁగెఁ
దగువరుఁ డెవ్వఁ డుద్వాహంబుసేయ
జగతి నాగతి వాఁడె సంభవించినను
గుఱిగ నేతత్కులగోత్రనామంబు
లెఱుఁగక యీకన్య నీనెట్లువచ్చు

నని యిట్లు చింతింప నాతఁ గందర్ప
వనవల్లి కైరవవల్లి నిచ్చలును
బరకాలుగుణము రూపము నుదారతయు
సరసత్వమును భువిజనులచే వినుచు
హరిరూపసంసక్త యైన వైదర్భి
సరవిఁ బరాంతకాసక్త యైయుండెఁ
కనకాంగవల్లియుహా కైరవవల్లి
యనుపమరూపరేఖాదిసంపదలు
జనులెల్లఁ బొగడ నాశాత్రవాంతకుఁడు
విని డెందమునఁ గడువిస్మయం బంది
యనపత్యుఁ డావైశ్యుఁ డమ్మహాత్మునకుఁ
దనుజాత లెన్న డింతకుమున్ను లేదు
ఆరయ సకలలోకాశ్చర్యం బగును
నేరీతిఁ గల్గెనో యీకోమలాంగి
యని తదాసక్తుఁడై యతఁ డొక్కనాఁడు
తనసీమ కేఁగుచందంబునం గదలి
చనుదెంచి హితబంధుసహితుఁడై మోద
మున నాగపట్టణమ్మున కేఁగుదెంచి
యాపండితునియింటి కరిగి చుట్టరిక
మేపార నాతని నెలమిఁ గైకొనుచు

మెల్లనె యింటిలో మెలఁగెడుకుముద
వల్లి సౌదామినీవల్లీమతల్లి
యరవిందశరునియాఱవసాయకంబో
వరయోగిదృష్టికవాటకుంచికయొ
యనుచు నంతంత రెప్పార్పక చూచి
యనియె నావైద్యుఁడో నాపరాంతకుఁడు
ఏరీతిఁ గాంచితి వీచంద్రవదన
నీరామ నీవు నాకిమ్ము వేవేగఁ
బలుమాట లేల తప్పను విను తుదిని
నిలువెడుధనమైన నీకు నిచ్చెదను
అన విని మోదించి యాసుధాహస్తి
యనియెఁ గ్రమ్మఱ శాస్త్రవాంతకుఁ జూచి
రమఁబొందు నిన్నగరంబు చెంగటను
గమలినిలో నొక్కకలువ నీచెలువ
చెలువార నుదయించి చెన్నొందు వేళ
నలకొలంకునకు నీరాడంగ నేగి
యచ్చటనున్న యీయరవిందనయన
మచ్చికఁ దెచ్చి యిమ్మానికి నిర్వారము
కన్నబిడ్డలకన్నఁ గడువిశేషముగఁ
జెన్నార నెత్తి పెంచితి నింత గాఁగఁ

దలపోయ నీవంటిధన్యుఁడు కన్నియకుఁ
గలుగుటకంటె వెగ్గలమె యీపసిఁడి
కోరికె నీవంటిగుణనిధానంబు
చేరె నీచెలువ నిచ్చెద నైన నొకటి
పదుచువాఁడే పిన్నపడుచు మాతోడ
నోడఁబాటుఁ గావించె నొండుచెప్పెదను
సరసిజాక్షునిశంఖచక్రచిహ్నములు
భరియించి పరమప్రసన్నుఁడై యెపుడుఁ
జారువైష్ణవసహస్రమున కన్నాహము
నారగింపొనరింతు నని యొడఁబడిన
వానికిఁ గాని యీవలదని యనిమెఁ
గాన నీ వారీతిఁ గావించితేని
వరియింపు మనిన నావైశ్యు నీక్షించి
పరమానురక్తుఁడై పరకాలుఁ డనియె
శ్రీకాంతువరచక్రచిహ్నముల్ మున్న
నాకుఁ గల్గినవి వైష్ణవుఁడ నామీఁద
నతిభక్తి నీవన్నయట్ల వైష్ణవులఁ
బ్రతివార మారగింపఁగఁ జేసికాని
పునిగి యే ముందరభుజియింప నొల్ల
ననుచు నాడినమాట కంగీకరించి

శ్రీమించ దివిజు లచ్చెరువంది పొగడ
రామాభిరామఁ గైరవవల్లి నపుడు
వరవైభవంబుల వైదర్భి శౌరి
వరియించుతెఱంగున వరియించె నంతఁ
గుటిలకుంతలఁ దోడుకొని సంభ్రమమున
నటనమై సకలసన్నాహంబు మెఱసి
యగణితబంధుమిత్రాళి సేవింపఁ
బొగడొందు తనపురంబున కేగుదెంచి
ప్రతిలేనిప్రతిన దప్పక నెమ్మితోడ
సతతంబు వైష్ణవసాహస్రమునకు
నియమంబు వాటిల్ల నిజనివాసమునఁ
బ్రియమార షడ్రసోపేతంబు గాఁగ
నారగింపఁగఁ జేసి యటమీఁదఁ దాము
నారగింపుచు మఱి యంతటం బోక
కలధనం బెల్ల నీగతి వైష్ణవులకు
వలసినవారి కవ్వారిగా నిడుచు
నతఁడు చోళాధీశుఁ డౌటయు మఱచి
యతనికిఁ దా మంత్రియగుటయు మఱచి
కడపట నెవ్వ రెక్కడఁ బోయిరేని
యెడపడకుండ నా కివ్విధంబునను

శ్రీవైష్ణవులసేవ సేయంగఁ గలిగె
నే వెఱవను సురానీక మెదుర్ప
వనమాలి జగదేకవల్లభుం డతని
తనయవర్గంబు తద్దాసవర్గంబు
వారలు తమసొమ్ము వారక తాము
యారగించెదరుగా కనియెడు తలఁపు
మదిలోన నిలిపె నెమ్మదిఁ బరాంతకుఁడు
పొదలి శంకాతంకములు లేకయుండ
జనులుచే నీతనిచందంబు చోళ
జనవల్లభుఁడు సవిస్తరముగా నెఱిఁగి
పడతాళ్ళచేతఁ దీర్పరుల మన్నీలఁ
దడయక పిలిపించి తద్వార్తఁ జెప్పి
పనిబూని ఘనరాజ్యభార మంతయును
దనమీఁద నైచి తద్దయు నమ్మియుండ
నేపున నాసొమ్ము హితుఁడునుబోలె
బాపురే దాసర్లపాలు సేయుచును
అకట! యెన్నాళ్ళాయె నౌరౌర! నగరి
కొకకాసు చెల్లింపకున్నాఁ డటంచుఁ
గరముల మీసలొక్కటఁ దీటికొనుచు
బెరయంగఁ గరణాలఁ బిలువుఁ డటన్నఁ

పసమించు తెలివలిపంపుబింజియలు
పొసఁగఁ జుట్టినయట్టి బోడకుల్లాలు
చింపికుప్పసములు చెవిదోరములును
సంపుటంబులతోడ జంపాడునోడలు
బిగువుగాఁ జెంపదోపినబలపములు
తగనలవడఁగ నత్తెఁ గరఁశికులు
చనుదెంచి నిలిచి హస్తములు మోడ్చుటయుఁ
గని వారితోఁ జోళకాంతుఁ డిట్లనియె
నేమోయి ! పరకాలుఁ డేలుచునున్న
సీమ దానెంత నేఁ జేసినయట్టి
యుమ్మడియును రానె యుత్తరు వమర
మిమ్మొయి డింప మా కియ్యోటివఁటమఁ
జెల్లినధన మెంత చేసేత నలఁడు
చెల్లింపఁగావలసిన ధన మెంత
యడరక మీర లున్నది యున్నయట్ల
తడయక చెప్పుఁ డాతనిచేత మీరు
లంచపంచంబులు లావుగా నంది
వంచన చేసి విశ్వాసంబుఁ దక్కి
తొడిబడ నెవ్వఁ డిందులలోన నేమి
యడఁచిన మీయాట లాడింతు ననినఁ

కరణముల్ తమపంచకరణముల్ బెగడఁ
జరణముల్ దొట్రిల జననాథుఁ జూచి
దేవర యిన్నాళ్ళుఁ దెగి విచారంబు
గావింపకుండ నీగతి యయ్యెఁ గాక
నీవ చెప్పుమటన్న నిమిషంబులోన
నే విన్నవింతుము నీపాదమాన
నెఱపుగాఁ బరకాలునికి ననిశంబు
వెఱచినగతి మీకు వెఱవ మున్నఁడును
ఘనరాజ్యభార మొక్కట నానతించి
జనులకు రెండవస్వామి నైయుండు
కతన నాతనిమీఁదఁ గలిగిన లెక్క
క్షితినాథ ! యేము దాఁచితి మింతదాఁక
నీలీల మీ రానతిచ్చిన నాతఁ
డే లెక్క చెప్పెద మే లెక్క మైనఁ
జెన్నుగా మీచేత సేయు దాకట్టు
కొన్నదిమొదలు మైకొని యొక్క కాసు
సెలవుసేయక తుది చెల్లింప లేము
పలుమాట లేటికిఁ బలుమాఱు నింక
నన విని కనలి చోళాధినాయకుఁడు
కనుగవ విస్ఫులింగము లుట్టిపడఁగ

నోలగం బిరుమేల నొనరింపుచున్న
కాలకింకరభయంకరులఁ గింకరులఁ
గని మీఱు చని పరకాలచోరకుని
ఘనరోషమున నొంటికాలనె యీఁగి
తరవిడి వెనక ముందరిధనంబునకు
హరువ్వగెకొనుఁడు లేదనిన నాగడుసుఁ
గుదియంగఁ గట్టి తోకొని రంపటన్న
ముదమునఁ గరములు మోడ్చి యాభటులు
పరువడి నేగి యాపురి కాలునగరి
కరిగి లోపలనున్న యఱిదండధరుని
జేరి కేల్మోగిచి వచ్చినరాకఁ దెలిపి
ధారుణీనాథునిధనము వేవేగ
లెక్కించి కలది చెల్లింపు కాదేని
గ్రక్కున పతిసముఖమున కేతెమ్ము
అమరంగఁ జెప్పెద మని తలంపకుము
తమ కిది మిగుల నుత్తమునైన తరువు
అన విని తనయేలుపట్టిరాజ్యంబు
ధనమెల్ల వైష్ణవార్థము వెచ్చపెట్టి
భూనాథుధనమెల్లఁ బొందుగా నొసఁగ
లేనివాఁడయ్యేఁ దాలిమి వోవనీక

వెనుకఁద్రొక్కక గుట్టు విడువక భటులఁ
గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప
వాసీను *పసిఁడియంతయు నాఁడునాఁడె
చేసేత మునుపుగాఁ జెల్లించినాఁడ
నిలువ యేమాత్రము నిలిచియున్నదియొ
తలపోయ నదియు నుత్తరువు సమ్మతియుఁ
దొరియంగ మఱియు నంగులకు నిందులకుఁ
బోయెఁ బొమ్మని వారిఁ బులినిపుచ్చుటయుఁ
గనలిభూపతి బోడుకలు కొంగువట్టి
పెనచి రాఁ దిగిచి గుంపించి యీడ్చుటయుఁ
గుపితుఁడై పులి మేలుకొన్న చందమున
నపుడు వారలఁ జూచి యందంద కినిసి
గట్టులగతి నిరుగడల నున్నట్టి
జెట్టులఁ జూచి దగ్గించి యాఘనుఁడు
పొట్టక్రొవ్వనవీండ్రఁ బోనీక వేగఁ
బట్టుకొమ్మన విని భటులనందఱును
మొత్తి మోదరలాడి మొనసి గుండెలకు
నెత్తురు దిగఁదన్ని నీళ్లెల్లఁ జెఱచి
శౌరికింకరులు నిచ్చలుఁ గాలదండ
ధారికింకరులఁ బోఁ దఱుముచందమున

*పగిది, పగుది.

మొగము క్రిందుగఁ దల మోసాలదనుకఁ
బగలెల్లఁ జెడఁ గాళ్ళుఁగట్టి యూష్పటయు
నవశులై తెలిసి చోళాధీసుభృత్యు
లవిరళశోకార్తులగుచు వేఁబోయి
యోలగం బొనరింపుచుండిన యట్టి
చోళేంద్రుఁ గని మ్రొక్కి సురిక్కి యిట్లనిరి
స్వామియానతి*జాడఁ జని పరకాలు
నేమందలము ధన మిమ్మని యడుగఁ
జిడిముడిచే జెట్లచేత గుద్దించి
కడకాలు వట్టి దిగ్గన నీడిపించి
కనలి మీకును దెక్కు గలిగినవారి
కిని జెప్పికొండని గేలిబెట్టినను
ఇచ్ఛలో నెంతయు నీవె దిక్కనుచు
వచ్చితి మింక దేవరచిత్త మనుచుఁ
గడఁటఁ దమమేనిగాయముల్ చూపఁ
గడునుగ్రుఁడై చోళకాంతుఁ డవ్వేళ
దళవాయి రావించి తడయక నీదు
దళములు నీవు నెంతయుఁ బ్రితాపించి
యరిగి నీసాహసం బంతయు మెఱసి
పరకాలు నిటకు వే పట్టితె మ్మనుచు

* జాడ.

సెలవు పెట్టిన నంది సేనాధివిభుఁ డు
బలిమిమైఁ జతురంగబలములతోడ
నరపాలునగరు గ్రిన్నన వీడుకొనుచుఁ
బరకాలునగర ముద్భటవృత్తి జుట్టి
గవనులఁ బొడిపింపఁ గదలి జంకించి
తివిరి యేనుంగుల దీకొల్పువారు
తలకక వడి నగడ్తలు పూడ్చుకొలకు
దళముగా నందంద తళివెట్టువారు
కెరలుచు నురుకుపక్కెరలగుఱ్ఱముల
నిరుమెలం బేరెంబు లెక్కువారలును
మదసాహసమునఁ బల్లాయు కత్తు లంది
పొదలుచుఁ గూఁతలార్పులు సేయువారు
నగుచు యాదవపురి యవనుండు చుట్టు
పగిది నిష్పగిది నిర్భయవృత్తిఁ దొడరి
కడఁకమైఁ గోట లగ్గలువట్టి గిట్టి
కడుభయంకరలీలఁ గదనంబుసేయఁ
బరకాలుఁ డాజి తత్పరకాలుఁ డపుడు
కరముఁ గోపంబునఁ గరవాల మంది
గరుడనిపై నొప్పు కంససంహారి
కరణి బంధురతురంగంబుపై నెక్కి

యరిమురి లేవంతునైనఁ గయ్యమున
నోరయ నుంకించు రావుతులతోఁగూడ
గవకులు వెరపించి ఘనవాద్యతతుల
రవము లెచ్చిలఁగ ధీరతఁ గోఁట వెడలి
కార్చిచ్చు మిడుతలగమి చేర్చుపగిదిఁ
జేర్చి లేళ్లను డాయు బెబ్బులికరణి
నెఱి హరి కుంజరనికరంబుమీఁద
నుఱుకుచందంబున నురగాళిఁ బొదువు
గరుడనిగతి విశృంఖలగతి మెఱసి
తరవారి యంకించి దారుణార్భటుల
లగ్గలు డించి యుల్లముపల్లవింప
నగ్గరి కగ్గలం బగుమొగ్గరంబు
డిగ్గనం జొచ్చి యేడ్తెర వీరవరుల
నుగ్గునూచంబుగా నురుమాడఁ దలఁచి
యెదురు గైకొని యొక్క యెడల శాత్రవులఁ
గడికండలుగఁ దలల్ గత్తిరింపుచును
దోన నెత్తురు నేలఁ దొఱఁగకమున్న
మేను లింతింతగా మెదుగఁగొట్టుచును
లలిమీఱ రౌతు బల్లంబు గుఱ్ఱంబుఁ
గలయంగ వ్రేటాఱుగాఁగ వేయుచును

దాడిబడ రెండుపీఁగుల నేర్పఱించి
కడలకొత్తుచు గిట్టి కనుపుగొట్టుచును
గసివసంగినశత్రుగణముల జముని
వసముచేయుచుఁ బరవసముఁ జూపుచును
లీలఁ జెండాడు కళింగభూవిభుని
పోలిక నరిశిరంబులు నేర్పుమీఱఁ
దొలఁగక షజ్జ రాతులుఁ దానుఁ గూడి
యిల వ్రాలకుండంగ నెగురఁగొట్టుచును
మిడుగులు మడుగులు మొడలు లేదొడలుఁ
దొడలును నొడలును దొనలు కన్గొనలు
సారులును గరులును నరులు ముంగురులు
సరులును బరులును జడలు జల్లెడలుఁ
బడగలు వడఁగ నిప్పగిదిఁ జక్కాడి
పుడమియు మిన్ను నార్పుల *బీటలెగయఁ
దరమిడిలయదండధరునిచందమునఁ
బరదండధరుఁ డిట్లు బవరంబు సేయఁ
గలసైన్యముల నేలఁ గలియంగఁ జేసి
కలఁగి యొక్కెడ కంఠగతజీవుఁ డగుచు
బలువేది చోళభూపాలుసేనాని
తల మొల వీడ దుర్దశఁ బాఱిపోయి

---

*లుఁబిట్టులీల

తనపతిపాదపద్మములకై వ్రాలి
తనచేయువాటు నెంతయు విన్నవింపఁ
గడునుగ్రుఁడై కనుగవతామ్రరేఖ
లదరంగ గపోలంబు లదర నుంకించి
గద్దియ డిగి చోళకాంతుండు నగుచు
సద్దిరా! యిటు సేసెనా పరాంతకుఁడు
అని యుద్ధసన్నద్ధుఁ డగుచు సామంత
జనము వారణముఖ్యచతురంగబలము
నిరుమేలఁ గొలిచి రా సేవ సెట్టింపఁ
దురగాధిరూఢుఁడై తూర్యనిస్సాణ
భేరీమృదంగాదిబిరుదవాద్యములు
ఘోరుకలంగ నంబుధులు కలంగఁ
దురగఖురోద్ధూతధూళి యంబరము
తరణిచంద్రులరీతిఁ దడబాటు గొలుపఁ
బురము వెల్వడి శత్రుపురముపైఁ గదలి
యరుగుచో దుర్నిమిత్తాళిఁ గన్గొనుచు
నరుదంది కోపంబు నలవు రెట్టింపఁ
బరకాలుపురవరప్రాంతంబుఁ గదియఁ
బ్రియురాలిఁ గనుఁగొన్న ప్రియునిచందమునఁ
భయమేది యప్పు డాపరకాలుసేన

పదిలమై చోళభూపతి వరూథినికి
నెదురుగాఁ జనుదెంచి యొలగోలు సేయ
నిరువాగుఁ గదిసి రయ్యెడ మింటనుండి
సురలు నచ్చరలునుం జూచి యగ్గింపఁ
గరియంత కరియంత కరియునుం గరియు
హరిసాది హరిసాది హరియును హరియు
రథియును రథియు సారథియు సారథియు
రథమును రథమును రాజును రాజు
భటుఁడు భటుండు నద్భుతవృత్తి దిశలు
పెటలంగ మెఱసి యభేద్యమై పోర
నప్పుడు వివిధచిహ్నంబులతోడ
నొప్పురుబిరుదరాహుత్తులు గొలువ
సాహసాటోపుఁడై చతురంగతురగ
వాహుఁడై పరిపంథిసైవస్వతుండు
అరుదెంచి విలయకాలార్కుచందమున
నరిసేన కుఱికి మిన్నగలఁ బెల్లార్చి
యుడివోసి పెనుమంట లడువీథి గెంట
నడిదంబు ఝళిపించి హరులఁ జక్కాడి
శిరములఁ డెగటార్చి శిర లుత్తరించి
కరిబృందములఁ ద్రుంచి కరములఁ ద్రెంచి

గోడుగులఁ గెడపి ముక్కలు చక్కఁ జేసి
పడగలు చించి భూపతుల గాలించి
రథుల ఖండించి సారథుల తుండించి
రథముల నుగ్గాడి రథ్యాళిఁ జదిపి
శరములు నురుమాడి చాపము ల్విఱిచి
ధరణీశవరుల నొంతయుఁ బాఱఁ జమరి
కరవారలధార నీగతిఁ జిత్రగతులఁ
బరవీరబలములఁ బరపె నవ్వేళ
దొఱఁగురక్తంబులు తోయపూరములు
శిరము లండజము లాస్యములు తామరలు
కనుగవల్ తొగలు మీఁగాళ్ళు తాబేళ్ళు
మినుకారునెరికురుల్ మిండతుమ్మెదలు
కరటితుండములు నక్రములు కంఠములు
దరములు చామరల్ తరఁచైన నాచు
ఘనశతాంగములు వక్రములు చక్రములు
పునుకలు వరహంసములు గాఁగ నొప్పు
వడఁ జోళవిభుసైన్యవనజాకరంబుఁ
గడిమిమైఁ బరశాలగంధసింధురము
బలువిడిఁ జొచ్చి యుద్భటకరస్ఫూర్తిఁ
గలఁచి పంకముసేసి కలగుండువఱప

మెత్తని మాంసంబు మెదడు నాజ్యమును
నెత్తురు పుఱుకగిన్నెల నించి త్రావి
పూసి యూపరకాలుఁ బొగడుచుఁ బ్రేమ
నానంద మాడుచు నలరె భూతములు
కర ముగ్రముగఁ జోళకాంతుఁ డవ్వేళ
బలువడిఁ దన వెన్క బలమును జూచు
బొబ్బిడెఁ బరకాలుఁ బొదివి వేమఱు
ముట్టి యడిదము నొక్క మొగిని బెట్టాచ్చి
పరిఘగదాకుంతపట్టిసప్రాస
పరశుతోమరభిండివాలముఖ్యముల
నొక్కట నిగుడింప నొకయింతయైన
లెక్కసేయక యవలీల నామేటి
తరవారిఁ బెరవారి తళుకు సైనికులఁ
బొరిఁబొరి నింతింతపొడులు గావించి
దనుజులమీఁద నాదకపాణి గనయు
ననువున నాకొన్న హరికిశోరంబు
కరిసమూహములపైఁ గవిసి లంఘించు
కరణిఁ దద్దైత్యచక్రముమీఁది కుఱికి
శిరములు తొండముల్ చెవులుఁ జెక్కులును
గరములు కంఠముల్ కౌనులు బరులుఁ

దొడలు జానువులు లేదొడలుఁ బాదములుఁ
దొడవులు శిరలుఁ గైదువులు నొక్కటను
దుత్తునియలు సేసి దుర్దాంతవృత్తిఁ
గత్తి కొక్కొక్కకకండగాఁ జెండినైచి
కలివేళ వరతురంగము నెత్తి జగతి
ఖలులమై మిట్టించుకల్కిచందమున
గురుతరనిజవాహ ఖురపుటాగ్రముల
నరిబలంబులనెల్ల నణఁగఁద్రొక్కింప
మొనచెడి సంగ్రామమున నుండ వెఱచి
చనియెఁ జోఘుండు మోజన మోహటించి
యీరీతి దెసచెడి యేతెంచి మదిని
గూరినలజ్జచేఁ గుంది లోలోనె
యకట! యీజగతి నోహరిని సాహరిని
యొకఁడు నాతోఁ బోరనోపునే పోర
మఱి తనసరివోవుమాత్రంబె కాక
పఱచనిపాటులఁ బఱచె వెండియును
గెరలి క్రమ్మఱఁ బోఱు గెలిచెదనన్న
దురమున పీడసాధ్యుండు దేవతలకు
నని కపటోపాయ మాత్మఁజింతించి
యనయంబు హితవరు లగువారిఁ బిలిచి

యని మొన నాతోడ నరిదండధరుఁడు
మొనసి చేసినకార్యమునకు మెచ్చితిని
ఒకసీమ యేలుచునున్న తానెంత
సకలభూమియు నేకచక్రంబు గాఁగ
నేలుచున్నట్టి యేనెంత తలఁప
నీలీల బవరాన నెదిరి నాతోడ
వడిగలబంటైనవాఁడు వో బంటు
కడపట నిలువీనిఁ గన్నది తల్లి
యని సంతసించువాఁడై వేగ మీఁరు
చని పరాంతకునకు సమ్మదం బొదవఁ
దనశౌర్యమునకు నెంతయును మెచ్చితిని
మును సేయు నపరాధమును దాఁకుకొంటి
నెన్న మున్నిటికంటె నినుమడి గాఁగ
మన్నింతు నని చెప్పి మఱియు నేమైన
నడిగినమాటన ట్లతనికి నిచ్చి
యెడపక తోడితెం డిపుడె నాకడకుఁ
బోఁడిమి నావీరపుంగవు నిటకు
నేఁడె తోతెచ్చువానికి మెచ్చుగలదు
అనుఁడు వా రాకమలాపూర్ణపురికిఁ
జని కొల్వులో శత్రుశమను నీక్షించి

కరములు మొగిచి కొంకక చోళభూమి
వరుఁడు పల్కినసత్యవాక్యంబులెల్ల
వినువారివీనుల విందులు గాఁగ
వినయంబుతోఁ జిత్తవృత్తి యెఱింగి
మగఁటిమిఁ బరకాలుమనసు రంజిలఁగఁ
దగవు దీపింప నెంతయు నమ్మఁబలికి
నీసాహసములకు నృపుఁడు మోదించెఁ
జేసినచేఁతల్లఁ జెల్లెను నీకుఁ
గనుగవ నినుఁ జూచుకాంక్ష యే కాని
మనుజేశుతలఁపున మఱియొండు లేదు
నిచ్చలంబున నీవు నృపవరుకడకు
విచ్చేసి కరిమ్మటి విచ్చేయు మనుఁడు
సమ్మదంబున శత్రుశమనుఁడామాట
నమ్మి వారికి కట్టణములు పాలించి
పరిమితపరివారపరివృతుం డగుచుఁ
గరమర్థిఁ జోళేంద్రుకడకు నేతెంచి
మునుకొన్నమై గాయములు లెస్సఁ గాంచు
కొనుమని యొసఁగులాగున నిమ్మపండ్లు
కానుక యొసఁగి ముంగిట నిల్వఁ జోళ
భూనాథుఁ డావీరపుంగవుం జూచి

సకలరాజ్యంబు నిశ్చలత నిన్నాళ్ళు
తెకతెరబుకాఁడి దినియుండు నీవు
కడపట ననుఁ బొడఁగనవచ్చునప్పు
డుడుగరతరమైన యొకపచ్చడంబు
చెల్లఁబో తనకుఁ దెచ్చెనునంత లేదె
నల్లని చేఁత మానకపోయె నెపుడు
తనసీమ వెరుకముందరిధనం బెల్లఁ
బునుగక యీఋణంబునఁ బెట్టి పొమ్మ
అనుచు ధనాతురుఁడై చోళనృపతి
తనమంత్రివరుల కాతని నప్పగించి
యితనిపైఁ గలధనం బెల్ల నీకుఁడెమొ
యతివేగమునఁ గొనుఁ డని నియోగించి
యరిగెఁ బురంబున కంత నాసచివు
లరిదండధరుఁ జూచి యాత్మఁ జింతించి
యిప్పుడు మనచేతి కీతనిధనముఁ
దెప్పించుమనుచుఁ బార్థివుఁ డిచ్చి యరిగె
నిట్టలంబుగ మన మీతని నడ్డ
పెట్టి మిక్కిలి గాసిపెట్టితిమేని
ధన మింతలోనె యీతనిచేత లేదు
పనివడి యీతఁడు పడుపాటు చూచి

ముప్పిరిఁ గొనుదైన్యమునఁ బూఁట దాఁట
చెప్పెడువారు చర్చించిన లేరు
ఇతనిఁ దోకొనిపోయి యితఁ డున్నపురిని
యితనిబంధువ్రాత మెల్ల నీక్షింప
నదర వైచినసొమ్ము హరువగు నిచటఁ
బదరిన సింతయుఁ బనికిరా దనుచు
దనుజులు మును వాయుతనయునిఁ బట్టి
కొనిపోవుగతిఁ జోళకులనాథుభటులు
పరకాలుఁ దేలెమపట్టణంబునకుఁ
దిరుగఁ దోకొనివచ్చి ధిక్కరింపుచును
అచ్చటఁ గేశవుం డనుపేరఁ బరఁగు
పచ్చవిల్తునితాడ్రి భవనంబునందు
నాఁగిన దివసత్రయంబు నొక్కింత
లోఁగక శత్రుకాలుండు డెందమున
నరయ ధనాతురుం డగుమానవునకు
గురుపు బంధువులు నెక్కడివారు గలరె
యీరానిమాటవ న్నైన్నని నొసఁగి
రారమ్మటంచుఁ జేరఁగవచ్చినంతఁ
గల్లలాడుట నరకమ్ముత్రోవ యనక
చెల్లఁబో తనుఁ గాసిచేసి పట్టించె

మతిఁ దలంచిన మదోన్మత్తునా భూమి
పతులకు సత్య మెప్పట్టునఁ గలదె?
వివరింపఁగా భూమివిభులలోపలను
*చెవి బేద బిసిడి దుశ్శీలవర్తనుని
దుష్టు జూదరి ధనాతురు నవివేకిఁ
గష్టు వైష్ణవనిందఁ గావించువానిఁ
గన్నమాత్రనె దినకరు నీక్షించి
వెన్నునినామంబు వినుతింపవలయు
నిన్నియు నెఱిఁగి నే నీకురాచారి
యున్న చక్కటికి రా నుచితమే యనుచు
సారసోదరభక్తసాహస్రమునకు
నారగింపఁగఁ జేయఁగ లేనికతన
నుపవాసనియతుఁడై యుండె నుండుటయుఁ
గృపఁగోడ శ్రీహస్తిగిరిభూవరుండు
చనుదెంచి యారేయి స్వప్నంబునందుఁ
దనదివ్యకరములఁ దను పొయ్య నివిరి
వలమురి యమృతంబు వారిచే సేత
జలజాతయుగళిమైఁ జల్లగాఁ ముడిచి
తనకటాక్షామృతధారలచేతఁ
దనివినొందించి యాదటుండ నేలఁ

* చెవిఁ బెద.

జేకొని యేగడించినధనం బెల్ల
నీకుఁ గాకేరికి నిర్మలాచార!
సిరిమించ నీవలసినధనం బిత్తు
నరుదెమ్ము కాంచికి ననుమాన మెడలి
యన విని మేల్కాంచి యావారిఁ గాంచి
వినుఁడు కాంచికి నాదు వెంట నేతెందు
వెతేర మీధనం బెంతయు నిత్తు
వైతేయరిపునాన తప్పదు వినుఁడు
అనుఁడు చోళామాత్య లక్కజ మంది
యనయంబు హర్షించి యాత్మ నొందారులు
ఎప్పు డీఘనుఁ డిందిరేశుపై నాన
తప్పఁడు తలమీఁదఁదారివచ్చినను
అనుచు నాత్మల నొచ్చి రట్లకా కనుచు
ననయంబు హర్షించి యతనిఁ దోకొనుచుఁ
జనిరి కాంచికి నంత శాత్రవాంతకుఁడు
తనదుముంగల నొప్పు వైతేయువరదు
వనమాలి గజరాజవరదు నావరదుఁ
గనికరములు మోడ్చి కనికరం బొదవ
వనజలోచన! భక్తవత్సల! శౌరి!
దనుజారి! హరి! తండ్రి!తండ్రి! నాతండ్రి!

యనఘుశరణ్యా ! నీ వానతియొసఁగు
పనివింటి నిచటికిఁ బనివింటి నిన్నుఁ
గనుఁగొంటి లోఁ గలఁకలు వీఁకొంటి
వనజాక్ష ! యిందిరావల్లభ ! శౌరి !
జననాథుచిత్త మేసరవిమైఁ దీర్తు ?
ఘనమైన యీబాధ కడతేరు టెట్లు ?
లానతి మ్మన విని యనుకంపతోడ
శ్రీనాథుఁ డతని వీక్షించి యిట్లనియె
వరవేగవతిచెంత వారును నీవు
సరియూఁక నుండెదుసమయంబునందుఁ
దనదుపేరుకులాలదాసనామమున
నొనరి యేఁ దగనరియునుఁ బోలె నటకు
హాళికుగతి వత్తు నప్పుడు నన్నుఁ
జాలింపు నిను నాఁకసలుపువారలకు
ధనధాన్యములకుఁ జిత్రింబుగా నేన
మనవారివళుకు సమ్మతినె తీర్చెదను
నాపుఁడు మదిలోన నమ్మి యాయోగి
యావేగవతిచెంత కరిగి యట్లుండఁ
బరమపత్రిపన్నులపాలి యావేల్పు
పరకాలుమీఁదికృపారసం బొలయఁ

ఘనపుచుంగులతలపాగ నెట్టంబు
కసిబిసిమెసఁగు బాగాలవీడియము
మిన్నదేరెడు దొడ్డమెడనూలు మిగుల
వన్నియగల మాధవళిపచ్చడంబు
దళసరియగు దేవదారుగంధంబు
వలకేలఁ గనుపట్టు వంకుటుంగరము
డొల్లుబోఁకులును గాటుకకప్పుదేరు
పిల్లిగడ్డము వడిబెట్టుమీసలును
నలవడ నాందోళికారూఢుఁ డగుచు
నలనాఁటిపూర్వికుఁ డగు పెద్దిరెడ్డి
యనఁగఁ బేరరుళాలుఁ డనుపేరఁబరఁగి
చనుదెంచి వారున్నచక్కికే తెంచి
యనుఁగుమల్లడిఁ గొన నాత్మబంధువులఁ
గనినకైవడిఁ బరకాలు వీక్షించి
వడి నందలము డిగ్గి వచ్చి దండమున
నుడుగనిప్రేమతో నుప్పరం బెత్తి
కన్నీరు దొఱఁగ నీగతి నుండ నేటి
కన్న ! నీకని కూర్మి నందంద వగచి
మనుజేశుభటులు పల్మఱుఁ జోద్యపడుచుఁ
గనుఁగొన మున్నెఱుంగనివాఁడపోలెఁ

దవిలి యాతనిచెంతఁ దత్క్రమం బెల్ల
వినరించి యంతయు విని వారిఁ జూచి
యింతమాత్రమునకై యీవంశపతిని
ఇంతగాసింపంగ నేటికి వలదు
తొలఁగుమటన్న మంత్రులు కోపగించి
యలరెడ్డిఁ జూచి యిట్లని రొక్కమాట
బలువుగా విడుమంచుఁ బలికెదుభక్తి
గలవాఁడ వైన వెగ్గలమైన ధనము
గలవాఁడ వైన నీగడుసు మాకేసఁగ
వలయు సొమ్మెల్ల నివ్వల నొప్పఁజెప్పి
తోకొనిపొమ్మన్నఁ దొలఁగ కారెడ్డి
యాకాఁపువారితో ననియె వెండియును
గడపట మీకు నీఁగల్గుసొమ్మునకె
కడిఁదిసేయఁగ మీరు కర్తలుగాక
పనిలేనిమాటలఁ బని యేమి యెంత
ధన మెన్ని కొలుచెంత ధన మెన్నికొలుచు
వీసము నొకగింజ విడుమని యనక
చేసేత మీ కొప్పఁజెప్పెద ననుచు
వినఁజెప్పి పరకాలు వెనుకకుఁ దిగిచి
కొని చెంత భటులవే కొనితెమ్మటంచుఁ

దనపైనమాయ నుద్భవమైన కొలుచు
ధనముఁ జెప్పించి యత్తఱిఁ దూము ప్రాని
కొలఁదిమీఱినరాశిఁ గొనియున్నకొలుచుఁ
గొలుచునప్పుడు తేరకొనువారికెల్ల
రాఘవకార్ముకప్రవిముక్తబాణ
లాఘవంబునఁ గరలాఘవం బెసఁగ
నిక్కుచు గోవిందునకు నను మాట
యొక్కటి యందఱు నోలి నాలింప
నెలగసి పలుమాఱుఁ జెప్పెడుపల్కు
లలవిమీఱంగ నాదారికయుండఁ
గొలుచు ముంచుట పారఁగొలుచుట యొండు
దెలియఁగారాక యెంతేచిత్రగతుల
భారంబు లేకయు భారంబు గాఁగ
వారికిఁ గొలువంగవలసిన కొల్చు
కొలిచి మాడలుకట్టు గుంతులఁ దూఁచి
నిలువ పూజ్యముగ నన్నియును జెల్లించి
క్షితినాథుచే సొమ్ము చెల్లినందులకు
నితనికి నిప్పింపుఁ డిటఁ జెల్లుచీటి
యని చెప్పి పరకాలు నరకాలుముల్లు
గొనకుండ నతఁడుమైకొనుసొమ్ము దిద్ది

యతనిసమ్మతిఁ దొంటియావాసమునకు
నతులమోహనమూర్తి యై యేగె నంత
జననాథుమంత్రు లచ్చట నున్నయట్టి
ధనము ధాన్యము సమస్తము వేడ్కతోడఁ
గైకొని పరకాలు గారవం బెసఁగఁ
దోకొని మిగుల సంతుష్టులై యరిగి
ధరణీశు నెదుటఁ దద్ధనము ధాన్యమును
నరిదండధరు నిడి యాక్రమం బెల్ల
వినిపింప నాశ్చర్యవివశుఁడై నృపతి
తనమదిలోన నెంతయు సంతసించి
తనసిష్టఁ దప్పక తరవాత మనల
ధనము చెల్లించె నెంతటిఘనుం డనుచు
నపుడు భాగవతార్యుఁ డగుపరకాలుఁ
డుపవాసమున నాక నుండుట కలిగి
పారంబులేని తత్పాపంబు వాయ
ధారుణీసురులకు దానంబు లొసఁగి
పగలేది మఱి పట్టభద్రచిహ్నంబు
లగుచామరలు ధవళాతపత్రములు
మొదలైన తనచిహ్నముల నెల్ల నొసఁగి
తుదలేనిప్రేమ సంతోషింపఁ జేసి

తమ కిడు వెనక ముందరి ధనం బెల్ల
తమకు నొప్పయ్యె నుత్తరువు గా దనుచుఁ
జెల్లుచీటియు నిచ్చి చేచేత మేలు
కుల్లాయి గబ్బాయిఁ గొమ్మాచు నొసఁగి
యిన్నాళ్ళకంటె ననేక వైఖరుల
మన్నింతు నని సీమ మఱియును నొసఁగి
యనిపినఁ బరకాలుఁ డనుమోద మెసఁగఁ
దనపురంబునకు నంతట నేగుదెంచెఁ
జోళుఁ డాధనముఁ గొల్చును సచివులకుఁ
గేలిసై నొప్పగింప మాధవుఁడు
నాయెడ మాయామయం బైనవాని
మాయ గావింపుచు మగుడఁ గైకొనియె
న ప్పెళఁ జోళజనాధీశ్వరుండు
నివ్వెఱపడి మంత్రినికరంబుఁ జూచి
పరకాలుఁ డెటువంటి పరమమాయావి
ధర నెట్టివైష్ణవోత్తముఁడు జన్మించె
మనయాజ్ఞ కులికి నేమముతోడ మగిడి
చనుదెంచి మననిల్వసల్వాలు మనకు
వాలాయ మొప్పించువాఁడునుం బోలె
జాలి నీగతి నింద్రజాలంబు సేసె

మాయాధనం బిచ్చి మగుడఁగఁ దాన
మాయ గావించె నీమాయలవాని
యీరీతి నమ్మేద మిటువంటివాని
యీరీతి నాజ్ఞసేయఁ బంగవచ్చు
నితఁ డిచ్చుధన మేల యితఁ డేల తుదిని
యితని కిచ్చినసీమయెల్లఁ గైకొనుఁడు
ఇతనిఁ దత్పురి నుండనీక మీ రరిగి
యతివేగమున నెట్లైనఁ బొమ్మనుఁడు
అనిన మంత్రులు తదీయాజ్ఞఁ దత్పురికిఁ
జని పరాంతకుని కీసరణిఁ దెల్పుటయుఁ
గాదుగక మీతో డికుసిగింపు చాలుఁ
బదివేలు వచ్చె మీపట్టణం బిదియె
యని వారి వీడ్కొని యనురాగవల్లి
ఘనతమై నసలొత్తఁ గైరవవల్లి
కడకేగి తమసేయుక్రమముఁ దత్క్రమముఁ
గడముట్టఁ దెలిపి భూకాంతు సెగ్గించి
యిచ్చోట నుండరా దిఁకమీఁదమనకు
నెచ్చోటికైన నిం కేగంగవలయు
మనుజాధినాథుఁడు మాటపట్టుఁడిగి
తనసీమయంతయుఁ దాన కైకొనియె

నజుతండ్రి భక్తసాహస్రంబు మున్ను
భుజియింప కటమున్ను భుజియింపమెపుడు
విష్ణుండు సాక్షిగా వెలయ నేఁ జేయు
వైష్ణవార్చన విడువఁగరాని వ్రతము
వీరికిఁగా ధరాధిభుని ద్రవ్యమిను
జేరి కొల్చెద నన్నఁ జేపట్ట డతఁడు
చేపట్టి యతఁడట్లు సేసినఁ దుదిని
భూపాలునర్థ మీపోఁడిమి నొసఁగ
హరిభక్తులకు నది యహరంబు గాదు
హరినీలవేణి యెట్లంటని వినుము
తుది రాజవిత్త మెందులకంటె దోష
మొదవించు ననుచు మున్నొగి సత్తమునులు
ననుపమశాస్త్రంబునందుఁ బేర్కొంగుఁ
దినఁగోరి యది రాజు తెలిసి కాఁపిడిన
జడిసి వారదియు రాజద్రవ్య మనుచు
విడిచి రాగములు వివరించునట్లు
కావున నెన్నిసంగతుల వైష్ణవుల
కావిత్త మొసఁగుట యహరంబు గాదు
తనుగూర్చి చేయు నధర్మంబు ధర్మ
మనికాదె మున్ను శ్రీహరి యానతిచ్చె

నెన్నంగఁ బాపంబు నెసఁగించు హింస
జన్మంబునందుల సత్కర్మమైన
వనువున నేనును వైష్ణవార్థముగఁ
దొడరి దొంగిలిన నేదోషంబు లేదు
ఈయుపాయము దక్క నీవ్రతంబునకు
నేయుపాయంబు లే దెలనాఁగ యేను
ఘోరత నవనీతచోరకింకరుల
కారగింప నరింతు నని నిశ్చయించి
తనుఁబోలు కోదండధారు లైనట్టి
యనుచరు లొకవేయు యుండంద కొలువ
యొగదారి హరి గయుమోడ మొట్టకుదియ
చిగురులు వెడల గిల్పికోరసికియుఁ
జేయుమ్ము నెక నారుచెప్పులు రాగి
చాయలుదేరునచ్చుపుపిలిదట్టి
మొలవంకియును కొనముక్కుతో నొరయ
బలువుగాఁ బెట్టిన పట్టునామములు
నిసుముఁ గన్నపుఁగత్తి మొడదట్టిలోనఁ
బొసఁగిన దివ్యార్థ్యబువ్వ్యాలపోషి
తలముష్టి వొంకుచిద్దపుగద్దగోరు
బలపంబు బదనికల్ బాకిక త్రైరయు

నలువడఁ దనప్రియురాలితోఁ గూడ
వెలువడి వాహినీవిపినము ల్గడచి
శరధిచెంగట మత్తచమురసారంగ
శరభశంబరఖడ్గశార్దూలశల్య
గండభేరుండగోకర్ణభల్లూక
శుండాలగండకసూకరప్రముఖ
బహువిధవిహగసంభ్రమనాదసింహ
కహకహాద్భుతమహాగహనంబుఁ జేరి
ఘనమైన కోనలంకలపట్లు ఱెంకు
లోనరించి తనదు నెయ్యురుఁ దానుఁ గూడి
సరవిమై వైష్ణవసాహస్రమునకుఁ
గరమొప్ప పెనుమూఁగలు ఘటింపించి
యటకు మిక్కిలిచేరు వగుపయోరాశి
తటసమీపమున నిత్యంబు నోడలను
బచ్చకప్పురమును బట్టుబట్టలను
బచ్చికస్తురి మేల్మిపసిఁడియుట్టికెలు
మణులుఁ జంద్రాననామణులుఁ బటీర
కణములు మొదలుగాఁగలసువస్తువులు
నిరవొంద నెన్నికకెక్కు బేహారులు
హారులదంతులతోర హత్తుగాఁ దెచ్చి

యూనించి బేహార మాడంగ నటకు
వానికై చనుదెంచువారల వానిఁ
బూని బేహారమాడి పోవువారలను
బోనీక మీఁద కాఁపులుపెట్టి కాచి
తెరు వడ్డగించి గద్దించి ధైర్యంబు
చెరలంగఁ గొట్టి చేతిని యూఁచికొనుచు
వరుస నొక్కొడఁ దెరువరులచంద మున
నరుగుచుం గనమసందరికట్టికొనుచుఁ
గినుకక మొగమెత్తింగినవారిఁ జేరి
పొదివిపట్టుచు నోళ్ల బొఁటుల *ముందరిగి
గొబ్బునఁ దొలఁగఁ దోకొనిపోయి చెట్టు
గబ్బువీలగఁ గట్టుకొనెలం గట్టి
యదయులై కలవెల్ల నపహరింపుచును
సదయులై వెడియు సాగనంపుచును
అరుదైన నగరంబులందు వెడియుచు
బరదేశముల నెల్లపగిది దిండుగను (
బెల్లుమట్టిన పెదపెదముడాసులును
డొల్లుబొంగులును నీటుగఁ బొందుపఱచి
పొదిగగ్లు †నసిమల భుజములం బూని
వదలుగా రింటెముల్ వలెవాటువైచి

* ముల్దురిగి †నసిబలు

కొంకక జీనిపై *గోవరకంగు
లంక యయోధ్య మలాక యీడాము
మొదలైనదీవులు మునుకొనివచ్చి
యదనబేహారంబు లాడంగఁ జూచి
మంచిరత్నములు హేమము లున్నయట్టి
సంచులు వారున్నసంచులు దెలిసి
సవరేయిమైఁ జొక్కు చల్లి సంధించి
తిప్పటమై దొంగిలి తెచ్చుచు మఱియు
నునుపులు పెట్టుచు నొదిఁగి డాఁగుచును
గనుములు గట్టుచుఁ గనుపుఁ గొట్టుచును
గబ్బునం బురములు గన్న పెట్టుచును
‡సుబ్బికం బెరచోటఁ జొప్పునైచుచును
దెచ్చినధనమెల్ల దినదినంబునకు
వచ్చిన యలభాగవతులకు మఱియుఁ
జనుదెంచునట్టివైష్ణవులకు భక్తి
పెనుపొంద షడ్రసోపేతంబు గాఁగఁ
బొదలుచు నారగింపులు సేసికొనుచు
మదనమన్మథుఁ దనమైఁ బామకొల్పి
యీరీతి దొంగిలు నెడ శంఖచక్ర
ధాములఁ దిరుమణి ధరియించువారిఁ

---

*గోవలెక్కంగు ‡సుబ్బిన:.

దడవక కన్న నెంతయు భక్తిసేసి
యుడివోనికూర్మినై నుపచరింపుచును
బరమభాగవతసంఘ జనప్రియుండు
పరమయోగీంద్రుఁ డాపరకాలయోగి
తనసేయు వైష్ణవోత్తమపూజకొఱకు
ధనయంబు నవసరనై యొక్కనాఁడు
గగనంబు భువి నీలికడవ చందమున
మొగులుచేఁ గారుక్రమ్మఁచునుండు రాత్రి
బనిబూని యొకమహాపట్టణంబునకుఁ
జని యందు నొక్కవైష్ణవునింటిపంచ
నొదిగి క్రుమ్చిలఁ బొంచియున్న యావేళ
వదలక జడివట్టి వర్షించుచుండ
నావైష్ణవోత్తము నంగనారత్న
మావేళ పతిభోజనానంతరమున
లీలనై మగనిశయ్యరను కెంగేలఁ
గీలించి యాపుష్ప వాకిటి కేగుదెంచి
తడియంగ నోడి యాతన్వంగి వంగి
కడపముంగిట నిల్చి కడిగి చల్లఁగను
గప్పినచీఁకటిగమి విచ్చిపాఱ
నప్పుడు ధళధళక్కన మెఱయుటయు

గని పరకాలుఁ డాకల్యాణిచేత
నొనరినపాత్రింబు నొడిసి కైకొనిన
నుదిరి యస్మద్గురుభ్యోన్నమో యనిన
సుదతివాక్యము చెవిసోఁకె సోఁకుటయు
నావాక్య మపుడు విన్నంతి నీసొమ్ము
శ్రీవైష్ణవులది ద్రిముచ్చిలితి నటంచుఁ
దలఁకి కెంగేలిపాత్రము వారికడప
వలకడఁ బెట్టి యెంతయు భయంపడుచు
నీవేళ వీరలహృదయంబులందు
నేవిధ నుండునో యెఱుఁగద ననుచుఁ
బొంచి యాహించఁ జప్పుడు సేయకున్నఁ
జంచత్కీకాలక చని లోననున్న
ప్రియున కీసరవిఁ జెప్పిన నాత్మఁ దెలిసి
ప్రియురాలి డగ్గరఁ బిల్చి యిట్లనియెఁ
బనుపడ వినఁగదే పరకాలనాము
ఘనుఁడు భాగవతకైంకర్యతత్పరుఁడు
శ్రీవైష్ణవార్థమై చేసె నీరీతి
నావైష్ణవుఁడు మనమగు టెఱుంగమిని
కైంకర్యమునకు విఘ్నము సేయవలవ
దింక భాగ్యముఁ జేసితీవు నావుడును

గొంచక త్రొంటిబాగున నావధూటి
సంచరింపుమ నలచక్కి కేతెంచి
తనదుముందరిదెసఁ దనరుపాత్రంబుఁ
గనుఁగొని యిటకు నేగతివచ్చె మగిడి
యనుచు నచ్చెరువంది యాత్మేశుకడకుఁ
జని పళ్ళెరం బున్నసరవిఁ దెల్పుటయు
నామహాత్ముఁడు పాత్రముం దెచ్చునప్పు
డేమనియంటి నాకెఱిఁగింపు మనినఁ
నెలనాఁగ పలికె నయ్యెడఁ జోరుఁ డనుచుఁ
దలఁకి యాచార్యులఁ దలఁచితిఁ గాని
పదరి యే నెగ్గుగాఁ బలుకుట లేదు
ఇదియుఁ దప్పిద మౌట యెఱుఁగ లేనైతి
ననిన నాభాగవతాగ్రణి యింతి
కసియె నీ వప్పుడ ట్రునేల యనుచుఁ
గనలి భాగవతకైంకర్యవిరోధ
మొనరించి తనుమఁ బ్రెబ్బరరాగఁ బలికె
బ్రహ్మవిశాపముల్ బాపంగవచ్చు
బ్రహ్మహత్యాదులఁ బాపంగవచ్చు
నారయ శ్రీవైష్ణవాపచారంబు
నేరీతి నైన మాయింపఁగా వశమె ?

యని యిట్లు కోపింప నావాక్యసరణి
విని పరాంతకుఁడు వేవేగ నేతెంచి
యామహాయోగీంద్రు నడుగుల కెరఁగి
వేమాఱు నుతులు గావించి కేల్మొగిచి
సమకూర్చు నాయపచార మీవేళ
క్షమియింపు మనిన నాసర్వజ్ఞమూర్తి
యాతనిఁ బరకాలుఁ డని యాత్మఁ దలిసి
యాతతభక్తిచే నతనియంఘ్రులకు
వినతుఁడై నుతులు వేవేలచందముల
నొనరింపఁ బరకాలయోగి చంద్రుండు
నాపనికైవచ్చు నాటెల్లి నేర
మేపారఁగా క్షమియింపవే యిప్పు
డని విన్నవించి చయ్యనఁ బాకెమునకుఁ
జని సంతతంబు వైష్ణవపూజనంబు
నెడఁబడకుండంగ నేకాగ్రబుద్ధి
నడుపుచునుండె వైష్ణవ *దేవుఁ డనుచు
నలమేలుమంగకు నములాంతరంగ
కలిసీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్తసంతతికి

* కల్పతరువు.

నంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్వపాకన్నయార్య
తనయతిమ్మార్యనందనరత్నగుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగివిలాసకృతిని
నతులితంబైన షష్ఠాశ్వాస మయ్యె.



# పరమయోగివిలాసము.

## సప్తమాశ్వాసము.



హైమసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ! శ్రీవేంకటేశ!
మునిశారికాసారముఖ్యభక్తాళి
వనమాలి! యవధారు వరదానశీలి!

ఆసేయు భాగవతార్చనంబునకు
శ్రీసతీవిభుఁ డైన శ్రీరంగశాయి
మెచ్చి దిక్కులఁ జేజిమీఁద సొంపారు
లచ్చితోఁ గూడ నుల్లము పల్లవింప
నారూఢుఁ డగుచుఁ దా నలపూజ చూడఁ
గోరి నిత్యులుఁ బరాంకుశయోగిముఖులు
జలజసంభవపాకశాసనాదులును
గొలువ నభోవీథిఁ గొని యేగుదెంచి
సరభసగతిఁ బోడ శరధిచెంగటికి
నరుదెంచి గరుడవాహన మంత నిలిపి

కలిమిపుష్పాబోఁడి మోగంబు నెత్తమిన్న
మెలపుసం జూపుతుమ్మెద లెదురొత్తఁగ
దనభక్తవరుఁ బరాంతకుఁ గేలఁ జూపి
యనిమె నెయ్యమును దియ్యమును రెట్టింప
నాచెంత నొప్పు మహాటవిలోనఁ
గాచి పాంథుల చేతఁ గలవెల్ల దోఁచి
సతతంబు వైష్ణవసాహస్రమునకుఁ
గృతసమ్మతో నారగింపంగఁ జేసి
మరికానితనకూర్మి మగువయుం దాను
దెరవ భుజింపఁ డే తెలిఁగుననైనఁ
బరకాలుఁ డనుపేరి పరమభాగవతుఁ
డరయ మిక్కిలి నాకు నాత్మభక్తుండు
ఎడపక యిల్లు పెక్కండ్లనుండియును
నడుపుచునుండు వైష్ణవపూజనంబు
వాఁడువో కంటె? యెవ్వరు తెరువరులు
నేఁడు రాకున్న నూనినచింతతోడ
మదిలోన నెప్పుడు మద్భక్తపూజ
వదలంగలేక యవ్వల ఖిన్నుఁ డగుచుఁ
గొమ్మ యూపెరురావిగొమ్మలమీఁది
కిమ్ములఁ ఘటుల నెక్కించి యామీఁదఁ

గడుగోపమున మోవి గంపింప హరిగ
పుడమిపై నూఁది మూఁపున వాలు సేర్చి
తెరువున నెవ్వ రేతెంతురో యనుచు
సురగక నెదురుచూచుచు నున్నవాఁడు
కనుఁగొన మత్పూజకంటె మద్భక్త
జనులకుఁ జేయుపూజనలే ప్రియంబు
లటుగాన నీవైష్ణవాగ్రణి నిత్య
మిటు సేయుపూజకు నేను మెచ్చితిని
అతనిమనోరథం బంతయు మనము
హితమతితోడ నేఁ డీడేర్పవలయు
నని వైనతేయుని హయముఁ గావించి
యొనయ నిత్యుల నరాకృతులఁ గావించి
తనదైనయాజ్ఞచేఁ దక్కినవారు
మనుజభావము నొంది మహిఁ గొల్చి నడువ
హేమగర్భునిఁ బురోహితునిఁ గావించి
తామిరువురు మర్త్యదంపతు లగుచు
నగణితసకలభూషాన్వితమూర్తు
లగుచుఁ దత్కపటహయంబుపై నెక్కి
పసిఁడివింజామరల్ బంగారుగొడుగు
లసమానమణిమయహైమపాత్రములు

మొదలైనసిరులచే మొనసి యొంతయును
బదియూఱువన్నెలం బరఁగుతామరలు
గలిగి యేతెంచుగంగాప్రవాహంబు
చెఱువునఁ దనరైనసేన యేతేర
బాచేర్వ భటులతో నలపరాంతకుఁడు
గాచినత్రోవచక్కటి కేగునపుడు
మును రావి నెక్కి యిమ్ములనుండి యమువ్రు
గనుఁగొను నలపరకాలకింకరులు
పొలయుకంజాప్రదీప్తుల కెంతె నూఱు
మలయుతేజములఁ బల్మరుఁ దళ్లుకొనుచు
ననతిదూరంబున నావచ్చుసేనఁ
గనుఁగొని పరకాలుఁ గాంచి యిట్లనిరి
మునుకొని యొకపెనుమూఁక యేతెంచె
వెనుక నెన్నడు కన్న విన్నది కాదు
మదిఁ గొంకు లేకయే మఱి చాలు గట్టి
యదె చేరవచ్చుచున్నది మహాసేన
యననేల పలుమాట లంతయు నెంత
ధనముకుప్పది యొకింతయుఁ బొల్లు లేదు
మనము భాగవతసమర్చనం బనిశ
మొనరింప నందులో నొకసొమ్మె చాలు

నన విని మోదించి యరిదండధరుఁడు
తనలోన నలరుసంతస మిగురొత్త
ఘనత భాగవతకైంకర్య మీడేర
వని వాలు జళిపించి యందంద యాడి
తనయొద్దిభటులనందఱ మూఁడుమూఁక
లోనరించి చనుదెంచుచున్నట్టివారి
వెనుక ముందర నెడవేచి లావేచి
గోఁకొని తుండించుఁకొని కొట్టుఁ డనుచు
బనిచి కొందఱువీరభటులునుం దాను
వనిమొనగా నిల్చి యాయత్తపడుచుఁ
దుదలేని తమిఁ దోవఁ దొలఁగి లోఁగడఁక
పొదలఁ బెన్పొదలచాటునఁ బొంచియుండి
చక్కల నున్నభూజము లెక్కి కొంద
ఱిక్కవ చూపట్ట నీలలు వెట్టఁ
దవిలి కొందఱు వచ్చుదళముల దళము
చెవిసోఁకఁ గడనుండి చేబుట్టి లిడఁగ
నటవచ్చువారు డాయఁగవచ్చి రనుచు
దటముల రాలు కొందఱు పోటు కిడఁగ
పరకాలుఁ డప్పు డాపరసేన కనుమ
సొరిది నొక్కట వడిం జొచ్చి రానిచ్చి

తోరమై చీమకు దూరంగ రాక
కారుక్రమ్ముచుఁ జేంద్రుఁగల హొరపముల
జీబుకొల్పుచుఁ దమ్మచిట్టంబు గట్టి
గాబకోరెండలఁ గడుదట్టమైన
యొడిపికట్టకు వంక నొకవంక డిగ్గి
కడు నేమరిల సందుకట్టుగాఁ జూచి
యరియు నందకమును నంది యేతెంచు
హారినాఁగ హారిగేయు నడిదంబు పూని
పిడుగు వ్రాలినమాడ్కి పెళపెళ నార్చి
పొడు పొడు పొడుఁ డంచు పోనీకుఁ డనుచు
విడు విడు విడుఁ డందు వ్రేయుండ యనుచు
గడ గడ గడ దిశల్ కంపింపఁ బలికి
బలునైన పెనుముచ్చుబంటులు దానుఁ
బిలపిలఁ జనుదెంచి భీషణాకృతిని
యలమి కుయ్యాకుఁడు కుయ్యాకుఁ డంచుఁ బట్టి
బలువిడి గద్దించి పటుతరలీలఁ
బట్టుపుట్టంబులుఁ బసిఁడిజాళియలుఁ
బెట్టెలుఁ బసిఁడికొప్పెరలు సొమ్ములును
బరిమళంబులుఁ బట్టుఁబట్టలు మఁచి
హారులు జల్లెడలును నాదిగాఁ గలుగు

తగువస్తువులఁ గన్న దనియుంగదోఁచి
తెగడుచుం గడుఁ జెప్పదేలి యామీఁదఁ
బరకాలుఁ డప్పు డుద్భటవృత్తి నెదుట
హరి నెక్కి వచ్చు నయ్యాదిదంపతులఁ
గని చేరఁ జని తదంగంబుల నున్న
కనకభూషలనెల్లఁ గైకొని యపుడు
పోలించి చూచ యాపుండరీకాక్షు
శ్రీపాదమునను నెట్టి పవిత్రంబుఁ గాంచి
యిది నాకుఁ బోవిడ నేటికి నేఁడు
తుది నొకభాగవతునకైన వచ్చు
నని శ్రేలియంగుళీయకము రాఁదిగియఁ
బెనఁగి రాకుండినఁ బెద్దయుం గనలి
యరిమురి గద్దించి హాయుంగరంబు
కరచి రాఁదిగిచిన కలియనో యనుచు
హరి యానతిచ్చిన నది కారణమున
నరి యమునకుఁ గలి యనునామ మలరె
అప్పు డాసొమ్ములు నయ్యుంగరంబు
నొప్పారుచుండెడు నొకపెట్టెఁ బెట్టి
యెత్తఁబోయిన నిందిరేశుని యాజ్ఞ
నెత్తరాకున్నఁ బెల్లెసఁగుకోపమున

సత్తటి మఱియు భృత్యాళితోఁ గూడి
యెత్తిన నెంతైన నెత్తరాకున్నఁ
గాలునిగతిఁ బరకాలుండు కినుక
నూలుకొనంగఁ గన్నులు జేవుఱింప
నద్దిరా యెంతమాయావి వీఁ డనుచు
గద్దించి కదిసి ముంగలనున్నయట్టి
భూసురవేషి నంభోజసంభవుని
డాసికంఠమున ఖడ్గంబు *దోక్కించి
యిటుచూచి యాపెట్టె యెత్తరాకుండ
మటమాయలాడ నీమంత్రించినట్టి
మంత్రంబు మాని క్రమ్మఱ నెత్తవచ్చు
మంత్రంబు చెప్పెదో మఱియుఁ గొట్టుదునో
యన విని బెగడొంది యాపెండ్లి మొజ్జ
యనియె నేర్పైన ససహాయశూరునకుఁ
దానేమి మెఱుఁగ నోతండ్రి! గుట్టంబు
మైనున్న యామహామాయావి కాని
యన విని యతని డాయగ నేగి యట్లు
యనిన రంగేశ్వరుఁ డలఁతివచ్చుచును
ఇప్పుడు నీకోరు నీమంత్రవగముఁ
జెప్పెద వేవేగఁ జేరర మ్మనుచుఁ

* వొక్కించి

బరకాలు మస్తంబుపైఁ గేలు సాఁచి
కరమర్థి దక్షిణకర్ణంబులోన
భావింప సంసారభవవార్ధి మునుఁగు
జీవుల నొకదరిఁ జేర్పు నావనుచు
ననఘసన్నుత మైన యష్టాక్షరంబు
నొనర సాంగంబుగా నుపదేశ మొసఁగి
యకలంకకంకణహారకేయూర
మకరకుండలయుతమహితవిగ్రహము
పంచాయుధోజ్జ్వలబాహుదండములఁ
బంచాస్త్రు మించినభావంబు గలిగి
తగరమాగోదానితంబినీసహితుఁ
డగుచు నండజనాయకారూఢుఁ డగుచు
నిజరూపధరులైన నిత్యులు ముక్తు
లజశంకరాదులు నందంద కొలువ
నరుదారఁ బ్రత్యక్ష మగుచుఁ దన్మాత్ర
వరవాచ్యమైన దివ్యస్వరూపంబు
నతనికిఁ బొడచూప నాదివ్యమూర్తిఁ
బ్రతిలేనివేడుకం బరకాలయోగి
సేవించి యందునం జిక్కి సన్నుతులు
గావించి భావించి కడుసంతసించి

కన్నులవేడుకఁ గన్నీరు జాఱఁ
గ్రన్నన మైదీఁగ గఱుపారఁ జెలఁగి
ధరజాలెతోఁగూడ ధన మిచ్చినట్లై
యరవిందనాభుఁ డీయష్టాక్షరమున
సవిభూతికముగ నిజస్వరూపంబుఁ
బ్రవిమలగతి నాకుఁ బ్రకటించె ననుచుఁ
బదిపద్యములఁ జెప్పి ప్రమదంబుతోడఁ
జనుదుఁదైౖ మఱి సాష్టశతధామపతులఁ
బంకజోదరులఁ దొంబదినాఱుపాట
నంకించి మఱి నూటయఱువదిపాట
నర్ణవశయను దశావతారముల
వర్ణించి యాతరువాతఁ బదింట
ఘనవిషజ్వాలలు గ్రక్కుసర్పంబు
నోనఁబాడి యొకయింట నుండుచందమునఁ
గడలినెన్నడుమ భగ్నంబైనయోడ
వడఁకుచుండెడి యోడవానిచందమున
వడిఁ గోసి పాఱుప్రవాహంబుచెంతఁ
బుడమినుండెడు మహాభూజంబుసరణి
నిడియంగఁ దుద మొదలేర్చు కాష్ఠంబు
నడుమఁ జీమలపంక్తి నడికెడుకరణి

నెడపకపాటు నట్టేటిలోఁ జిక్కి
కడుభీతి నొందు సృగాలంబుభాతి
తాపత్రయోర్మిసంతతుల నేపారు
నాపూర్ణసంసార మనుపయోరాశి
లోలత మునిఁగి తేలుచు నున్న నన్నుఁ
బాలించి దరిఁజేర్చు పరమేశ! యనుచు
నీలీల నొప్పు వేయి న్నెనుబదియు
నాలుగుఃపాటల నవరసస్ఫూర్తి
నెక్కొని తనలోన నిండారి పొంగి
వెక్కసం బగుభక్తి వెలిమించె ననఁగ
సిరివరునకు మహాశ్రీవచనాఖ్యఁ
బరఁగుప్రబంధ మర్పణముఁ గావించి
మున్ను గైకొనినసొమ్ములు నంబరములు
నన్నియుఁ దెచ్చి శ్రీహరికి నిందిరకు
నతనిభక్తులకు సమర్పించి పెక్కు
నుతులు గావింప సన్మునిలోకవిభుని?
ఆరంగపతి మెచ్చి యాళ్వారు నపుడు
చేరంగఁ బిలిచి మచ్చికఁ గౌఁగిలించి
యీవనజాత్మజుం డీశేంద్రముఖులుఁ
గావించుపూజలు గణుతించిచూడ

నీవు గావించు మన్నిజభక్తపూజ
కావగింజంతకు నవి యీడు గావు
కడపట యోగివర్గంబు నామీఁద
నుడుగక కావింపుచున్నయర్చనలు
యోజనమై నీసేయుచున్న భాగవత
పూజతోడను సరిపోల్పంగఁ దగునె?
భాగవతోత్తమ! పరమప్రపన్న!
యోగికులోత్తంస! యురుభక్తినిరత!
యనుచు నిర్జరముఖ్యు లాశ్చర్య మంద
జనులెల్ల నన్ను నేసరవిఁ గొల్చెదరొ
యాలీల నినుఁ గొల్తు రఖిలవైష్ణవులు
నీలీల మీరల నీపదమ్మురను
గొలువనివాఁడు భక్తుఁడు గాఁడు మిమ్ముఁ
గొలిచినవాఁడె భక్తుఁడు మాకు ననుచు
వరమిచ్చి కడు గారవంబు దైవాఱఁ
బరకాలు నీక్షించి పలికె వెండియును
గ్రమమున నీచేతఁ గరుణతో నింక
నమితకైంకర్యంబు లవధరించెదము
అనుచు నానతి యిచ్చి యతనిఁ దోడ్కొనుచుఁ
దనపురంబునకు నత్తఱి నేగుదెంచి

సిరితోడ నెనలేని సిరితోడఁగూడ
సురగేంద్రశాయియై యుండె నుండుటయుఁ
గొన్నిదినంబు లాకుసుమాస్త్రుతండ్రి
చెన్నఁ గన్నారంగ సేవింపుచుండె
నటుమీఁదఁ బరకాలుఁ డావేంకటాద్రి
కటకనివాసుని కథలుఁ జిత్రములు
సరసభావంబులుం జక్కందనములు
సిరులు నొయ్యారంబు చెలువంబు కలిమి
నటనంబు నునికియు నయగారిపసలు
నటియింపు సిగి పిన్నాణంపువగలు
ప్రాయంబు నెఱి ప్రతాపంబు రాజసము
సోయగంబునుఁ గడుఁ జోద్యంబు గాఁగఁ
గొనకొని యలశఠకోపాదికృతులు
విని విని క్రొత్తగా వేనోళ్ళఁ బొగడి
పలుమఱు విని నాగపతి శైలపతికి
వలచి యాతని జూడవలయు నటంచు
నలఘుమానీంద్రుల యనుమతిఁ గూడఁ
జెలఁగి శ్రీరంగ రాజీవాక్షుచేత
ననిపించుకొని తడయక మున్ను గొలిచి
చనుదెంచు తనభృత్యజనమునుం దాను

సేవించువారి కిచ్చుఁ బదద్వయములు
కావేరి కన నొప్పుఁ గావేరి దాఁటి
శ్రీనిధి లోకవశీకరదేహు
శ్రీనివాసుని భక్తి సేవించుతమిని
నగరశైలములుఁ గాననసమూహములు
నగసంతతులుఁ బెక్కునదులునుం గడచి
యయనంబు నందు జాగరి రెండు మూడు
పయనంబు లవి యొక్కపయనంబు గాఁగ
నరుగుచుఁ గాంచికి ననతిదూరమున
నరవిందకోకబకాకులఁ బొగుచు
మేలిమి చల్లపెమ్మేరలమీఁ మింటి
పాలేరు నవ్వెడి పాలేరు చేరి
మొడగున్న తలచూపనీకుండ నుట్టి
పడు నెండవడి బెట్టువడిఁ దట్టువడుచు
శ్రమమార నానదీతలములఁ గ్రోలి
కొమరారు నయ్యేటికొరఁగట నొప్పు
పుర్వాలనెత్తావిఁ బొదలు తేనియల
తుప్పారవడునెల తోఁటలో నిలిచి
బడలి యాఁకట జుట్టుపట్టులఁ బల్లె
*బడునర గానక పరగెడిత్రోవ

* వడునంర

మఱిచూడ మిట్టాడు మానిసి లేక
మెఱయువేఁడిమి మిటమిట నెండ గాయఁ
దనయుఁ డాఁకలిగొనఁ దాఁ జూడ లేని
జననికైవడి లోకజననీవిభుండు
ఆవేళ శ్రీకాంచికాధీశుఁ డైన
భావజాతునితండ్రి భక్తవత్సలుఁడు
హరియష్టభుజకరుండును నృసింహుండు
కరుణించి భక్తునాఁకలిఁ దీర్పఁబూని
వరపగడ్డంబును సరములమొప్పును
కరముప్రేలెడు *పిడికడు జన్నిదములు
నోలయు వెన్నెలనవ్వు నూర్ధ్వపుండ్రంబు
మలయునిగ్గులతిరుమణివడంబులును
వ్రాలినబొమలు లోవంగినవీఁపు
వ్రేలాడుతోళ్లతో వెలయునెమ్మేను
వదరుడెందము లాలనసలారుచున్న
వదనంబు వడవడవడఁకునొదలయు
వదలుపింజల నిడువాలుధోవతియు
నొదవిన వలకేలియూఁతకోలయును
బోలఁగాఁ జుట్టినపాతిపాగయును
దూలగట్టిన వెడతోపుపచ్చడము

*పిడికెడు

సంశైజా కేలిపంచాంగంబు ముష్టి
చంక వ్రేలెడుతాళి చలిదిమూటయును
దగనలవడఁ జేరి తనుజూచువారు
మొగిద్వాపరమునాఁటి ముసలి వీఁ డనఁగఁ
దడబాటు నడల నత్తఱి వచ్చి వచ్చి
బడలినగతి గురుపదము లెన్నుచును
ఉరుభక్తి చెంతవా రొకయింత వినఁగ
సరవిబోద్వాయ మనుసంధించుకొనుచు
సిద్ధానురాగుఁడై యిట్లు భాగవత
వృద్ధభావముఁ దాల్చి వేదవేద్యుండు
నాతోఁటలోనికి నరుదెంచి సుమిత
చూతంబుక్రింద నిల్చుట విలోకించి
పరకాలుఁ డప్పు డాపరమవైష్ణవుని
చరణాబ్జముల చక్కఁ జాగిలి వ్రాలి
యలకేలిముష్టి పంచాంగంబు గాఁగఁ
దెలిసి నా కిప్పుడు తిథివారసరణి
దినయోగములు తేటతెల్లంబు గాఁగ
ననయంబుఁ బఠికించి యానతీవలయుఁ
గడుదవ్వు నడచి యాఁకలిగొని యొండ
వడఁ జెందినాఁడ దేవరదాసునకును

దిరిచి మీ రిప్పుడు తెచ్చినచంక
చరిదిలో నింత ప్రసాదింపవలయు
నన నవ్వి యాపైష్ణవాగ్రణి కరుణ
దనరార నాపరాంతకున కిట్లనియె
శ్రీవిష్ణువాగంబు శ్రీవిష్ణుతార
శ్రీవిష్ణుతిథియు సందేహింపవలదు
వారాన నీకు సర్వగ్రహంబులును
నేకాదశమునంద యొసగియున్నారు
వారాన నేల సర్వము భద్ర మింక
నీకోర్కు లీడేరు నీకోరిన
పనుపడ నీకు నీభటులకుఁ జలిది
పెనువొంద నేఁ బంచిపెట్టెద ననుచుఁ
దెలివెండిరేకుల తేటగిలించు
పొలుపారు నునుపోఁకపొత్తిలోపలను
నలలితదివ్యాతిసౌరభభూజ
ఫలచిత్రరుచులఁ జూపట్టి యెంతయును
నమృతాంశుమీఁది చాయల గేలకొనుచు
నమృతమయం బైనయట్టియాచలిది
పరికరములఁ బెనుపమునూరుగాయ
పరిమళంబుల వాఁబడలిక ల్వాయ

నమరవర్గమునకు నమృతంబుఁ బెట్టు
కమలాక్షుగతి హస్తకమలంబుఁ *వోడికి
పరకాలునకు మున్ను భక్తి దైవాఱఁ
గరమున నొకపిడికఁడు ప్రసాదించి
కడమతద్భటులకుఁ గ్రమమేరుపడఁగఁ
పిడికెడు పిడికెఁడు పెట్టఁ బెట్టుటయు
నలసుధారసపాను లైనదేవతల
తెలివి నందఱుఁ బరితృప్తులై రపుడు
పరకాలుఁ డలరి యా భక్తవత్సలుని
చరణపద్మములకుఁ జాగిలి మ్రొక్కి
యెయ్యది మీనామ మెందుండి యిటకు
నయ్య ! వేంచేసితి రానతిం డనఁగ
ననిశంబు కాంచికి నపరభాగమున
నునికిగా నెలకొని యుండుదు నేను
నను సాష్టభుజకర నరసింహుఁ డందు
రనుచు నంతర్హితుం డయ్యె నాకరణిఁ
గని పరకాలుఁ డక్కజ మంది యితఁడు
ననుఁ బ్రోవవచ్చిన నలినలోచనుఁడు
కాని వేఱొక్కఁడు గాఁ డంచుఁ బొగడి
యానందబాష్పాకులాక్షుఁడై †పొంగి

---

*దోడిగి. †పొగడి.

కరుణ నాధ్యైనయాఁకలి చూడలేక
యరుదెంచి నా కమృతాన్నంబు పెట్టెఁ
దననామ మడిగిన దయతోడ నవ్వి
పునుగ కెప్పుడు సాష్టభుజకరుఁ డైన
హాతహేముకసిపుండ ననియె నేవేలు
పతఁడె పంచేషు పంచాయుధాబ్జములు
ధరియించి యసురదేహదము విదారించి
శిరముఁ జీరిన నరసింహవిగ్రహుఁడు
నతఁడె శ్రీవామనుఁ డతఁడె విష్ణుండు
నతఁడె యాదిమకిటి యగువాఁడు నతఁడె
యతఁడె నాకులదైవ మనునర్థి మొనవఁ
బ్రతిలేని యొకపది పాటచేఁ బాడి
పయనంబుగతి కతిపయదినంబులకు
నయకరం బైన శేషాద్రిచెంగటికిఁ
జని సంతసించి యాశైలరాజంబుఁ
గని శ్రీనివాసునికరణిఁ జూపట్టి
నాయద్రిరాజంబు నారోహణంబు
సేయంగఁ జంకించి చిరభక్తిపరత
మొనయంగఁ దత్పాదమూలంబునందు
ననురక్తి దివసత్రయంబు వసింప

నాసర్వమయుఁడు శేషాచలేశ్వరుఁడు
దాసునిమదిలోనితాత్పర్య మెఱిఁగి
కనకాంఘ్రికింకిణీకనకజాలుండు
ఘనతరోజ్జ్వలదివ్యకనకచేలుండు
ధృతరత్నఝల్లరీదీపితహేతి
తతచిత్రమేఖలాధామాళిధారి
వరదానకటిదేశవర్ణితకరుఁడు
కరపల్లవాగ్రసంగతచక్రధరుఁడు
హారకేయూరభూషాదిధరుండు
చారుమౌక్తికకంఠసరసకంధరుఁడు
తులసికాదామకౌస్తుభవిభాసితుఁడు
వలితవిగ్రహుఁడు శ్రీవత్సలాంఛనుఁడు
ఘటితాలమేలుమంగా *వత్సతలుఁడు?
కుటిలనీలాయతకుంతలోజ్జ్వలుఁడు
సరసిజపత్రవిశాలలోచనుఁడు
నిరుపమసాంకవనీరసేచనుఁడు
వరదరస్మితశోభివదనమండలుఁడు
మరకతమాణిక్యమకరకుండలుఁడు
ధారితరత్నచిత్రకలలాటుండు
నీరజమిత్రసన్నిభకిరీటుండు

---

*వక్షుతలుఁడు

నగునట్టి శ్రీవేంకటాద్రినాయకుఁడు
జగదేకనాథుఁ డాశత్రుకాలునకుఁ
బ్రాడకట్టి తనకరముల మేను నిమిరి
వడదేర్చి లాలించి వరదుఁడై పలుక
†నావేల్పువేల్పు రెప్పార్పక చూచి
భావించి సేవించి ప్రణుతి గావించి
యాదేవదేవుని యనుమతిఁ గూడ
నాదండ శోభిల్లు నతనిమూర్తులను
సేవించి యాపరజిత్తు క్రమ్మఱను
వేవేగ శ్రీరంగవిభుని సేవింప
నరుగుచు సకలదేశాధినాయకులుఁ
గరమర్థి నిచ్చలుం గానుక లొసఁగు
వరసువర్ణాదిసువస్తువు ల్గొనుచు
సరవి రంగమునకుఁ జనుదెంచె నప్పు
డావేల్పురాయని యడుగుదామరలు
సేవించి ప్రణమిల్లి చిరతరభక్తి
లలిమిం(చు)వేల్పు నీలపుచందరాల
వలుపారు నల్లసేనపుజంగరాల
నలఘువైభవముల నట రెండుసాల
ములును వంటిల్లును మొదలుగాఁ గలుగు

†నావేల్పుతోని

కావేరినిలయుకైంకర్యంబు లాలు
గావింతు ననుచు సంకల్పంబు చేసి
గట్టిగా సాలయుగ్మము మహానసముఁ
గట్టించి నాల్గవకలుకోటఁ దీర్చ
సవరింప దొరఁకొను సమయంబునందు
భువి నెన్నఁదగినశిల్పులు *ననిశంబు
†ఘనులైన మఱి తెక్కుఁ గలిగినమేటి
పనులవారల బడి పనులవారలును
పరువడిఁ దమతమపనులకు నమరి
దొరఁకొని సేయఁగఁ దొడరునత్తఱిని
బలువుకొండలు రేకబడ నింత మలఁచి
యులువకట్టులువోసి యులు లోలి నాటి
పసలుమించఁగ సూత్ర పట్టినపగిది
విసువక గసివోటు వేయువారలును
గూటంబు లులులుఁ జేకొని యవలీల
గాటంపుకొండ లొక్కట వ్రీలి వ్రాల
ననయంబు వెఱఁ గంది యనిమిషశిల్పి
గని యోటువడుచూడ గసివోటు వైవఁ
గప్పల దూలముల్ కంబాలు వలుద
చప్పటిరాలు నచ్చంపుబోదియలు

---

* నిమిదంబు, నిమఁదంబు, † ఘనులౌచు

*కదరికాద్వారశాఖలు కొణంగులును
మొదలైన సంపాదములు చిత్రగతులఁ
బడి పనివాండ్రు నిబ్బరమున సన్న
బడియలుపూని సంభ్రమము రెట్టింప
లావునం గదిసి †హేలల్ల యటంచు
మేపిడి వడి బండ్లమీఁది కెత్తుచును
ఆరీతిఁ బోవనియట్టిదూలములు
చేరి మూఁకలు గట్టి చిట్టెలు గట్టి
యెగడిగరవముల హేలల్ల యనుచు
నగపడి యవి మోచి యరుదెంచి వారు
ధర జలాంతము శిలాంతముగ శోధించి
వరుసలోపల ‡గుండ్రవక్త్రంబు సేసి
యిసుము జల్లియు వైచి యొనయ గట్టించి
వసిబారి మాఁకున వడిఁ గూరుకొనుచుఁ
జప్పటి గావించి చదురపానంబు
నొప్పగావించి పై నొక్కొక్కరాయి
వరుస నిల్పుచు రసవర్గంబుతోడ
బెరయించి యిట్టికె పెట్టజల్లియును
సందడి బొక్కలో సంకుసందులను
దందడిఁగొనఁగ బెందడివేయువారు

* కదలని † హొల్లల్ల ‡ గుండ

పాంథికలగు రాయి పొందించి వెరుక
సందుదూరకయుండ సంతన సేసి
సూత్రంబులు నాయశుద్ధులు నెఱిఁగి
చిత్రంబుగాఁ బనిఁ జేయుంచువారు
నగుచు నీగతిఁ గోటయాంతయుఁ గట్టి
తగనొక్కయెడ భూమిఁ ద్రవ్వి శోధింప
నందులో నొక్కగుహాంతరసీమ
నిందునిభైకాంతి నెల్లెదం బాసు
చెలువ మొందినయోగిశేఖరుఁడొప్ప
మలయంగ యోగసమాధిలో నుండ
నాలోకలనము సేసి హరిదివ్యపాల
మీలీల యీతని యురవుమై వచ్చె
నేమిసేయుదు నంచు నిచ్చఁ జింతించి
యీమీఁద నొకయుపాయముఁ దలపోసి
యతనిఁ జేరఁగ నేగి యూహరకాలుఁ
డతిభక్తితోడ నిట్లనియె యోగీంద్ర!
పరిపూర్ణహృదయ! యెప్పగిది నిచ్చటికి
నరుగుదెంచితిరి నా కానతీవలయు
నన విని యయ్యోగి యాయోగినాథుఁ
గనుఁగొని ప్రణమిల్లి క్రమ్మఱం బలికె

నెనలేనికమలాలయేశ్వరు నూట
యెనుబదితిరుపతు లేను సేవించి
వచ్చి యిచ్చో నిల్చి వనజాతుమీఁది
మచ్చిక యోగసమాధి నున్నాఁడు
గ్రమమున నిన్ను నేఁ గనుఁగొంటిఁ గానఁ
గమలాతు నిప్పుడ కన్నయట్లయ్యె
నని యోగదృష్టిచే నాపరకాలు
నునికిఁ గన్గొని వెండియును జాఁగి మ్రొక్క
మ్రొక్కినఁ బరకాలమునిసులోత్తంసుఁ
డక్కజపడుచుండ నతని కన్గొని యోఁ
దుహినాద్రిపై వసిమని నరసింహు
మహితాష్టబాహుల నిర్మలగుహావాసి
వేడుక నీవు సేవించితే యతఁడు
తోడ మాటాడు భక్తులఁ గూడి యెపుడు
నన విని వెఱఁగంది యాయోగి మగుడ
ననియెఁ బ్రేముడిమీఱ నరిశేమునుసకు
నతఁడు నాతో మాటలాడునా యనిన
నతఁడు నీతో మాటలాడె నాపూట
యని యోగి తుహినాద్రి కనిచిన నతఁడుఁ
జని హైమశైలాగ్రసదను నృసింహుఁ

గని ప్రమొక్క మానవకరివైరి యపుడు
తనభక్తుమాట తథ్యము సేయవలసి
యాయోగితో మాటలాడ నవహ్నాని
యాయుది కేనుఁ బాయకయుండె నంతఁ
బరకాలుఁ డాకట్టు *ప్రాకార మెల్ల
నరుదారఁ గట్టించి యంతటిమీఁద
మునను నఖిలమైన మూడవకోట
యదియునుంగట్టింప నాత్మఁదలంచి
యేమిసేయుదు నింక నీసాలమునకు
హేమంబు చాలంగ నెటనుండి వచ్చు
నని తనయొక్క డాయఁగఁ గొల్చియున్న
యనుపములైన యేకాంగవీరులను
రాయదొంగలఁ జౌర్యరసికశేఖరుల
నామొదం బిల్చి రహస్యంబునందుఁ
బన్ని యీమూడవ ప్రాసాదమింక
నెన్నిలంగులనైన నీడేర్పవలయు
నలవిమీరిన దీనికై యిటమీఁద
బలువైనధనము సంపాదింపవలయుఁ
గాచిదొంగిలితేరఁ గలరె వేవేగ
మీచేత నగునె యిమ్మెయి విచారంబు?

---

* ప్రాసాద

అన విని యనుచరు లాపరాంతకున
కనిరి నేర్పులును సాహసములు మెఱయ
భావించిచూడ నీబంటులసత్త్వ
మీవెఱుంగవె విను మిన్నియు నేల
వదలక మండలేశ్వరునైనఁ గాంచి
కొదుకక చెరువాఁగు గొట్టనోపుదుము
పగలు చూచినసొమ్ము పగలు తేఁగలము
మిగిలినకడిమినెమ్మోయిఁ దివ్వరాని
తాలముల్ గడియ లుద్ధతి మోప ప్రీలి
ప్రాలించు పెక్కైనబదనిక ల్గలవు
పాతాళమున నున్న బలువిధినైన
జాతిగాఁ జూపునంజనములు గలవు
మహి నెఱనైన రిమ్మల నిద్రవుచ్చు
మహిమలం గలచొక్కుమందులుం గలవు
ఇత్తటి నిరుచేయి నెఱుఁగరాకుండఁ
గత్తెరసొమ్ములు గత్తిరింపుదుము
ఇలలోన నొండొరు నెఱుఁగరాకుండఁ
గలయ నామడమైనఁ గన్నపెట్టుదుము
అని యిట్లు తమదుసాహసములు చెప్పి
యనిరి వెండియు శాత్రవాంతకుతోడఁ

గడుచిత్రమై తూర్పుకడలికి చక్కఁ
బడమటి యీనాగపట్టణంబునను
అసమాన మగు పదియాఱువన్నియల
పసిఁడిచే జైనులు ప్రమదంబుతోడ
గొప్పగాఁ దమకులగురునిఁ జేయించి
యొప్పుగా నొకగుడియును నభేద్యముగఁ
గట్టించి యందు నాకనకంపుఁబ్రతిమఁ
బెట్టినా రేమి చెప్పెడిది! యాప్రతిమ
యబ్బెనా మన పనులన్నియుఁ దామె
గొబ్బున నీడేరుఁ గొదలేక యనినఁ
గడు సంతసిలి పరకాలుఁ డాభటుల
నెడపక కౌఁగిట నిరియంగఁ జేర్చి
తాను వారలు సౌగతప్రకారములు
పూని వేవేగఁ దత్పురమున కరిగి
యచ్చట నున్న బౌద్ధాచార్యవసతిఁ
జొచ్చి యంతయుఁ బారఁజూచి మెల్లెడను
దలుపు వాకిలియును ద్వారబంధమును
దెలియరాకుండ నెంతే చిత్రగతుల
నదుకు లేకుండ నేకాండంబు గాఁగ
నొదవ సంతనసేసి యున్న యాగుడికి

నచ్చుగా లోని హేమాకృతిఁ జూడ
వచ్చువారికిఁ గనవచ్చుమాత్రంబె
కడుఁ జిన్నసోరణ కంత గావించి
యడరంగఁ బరకాలుఁ డచ్చోటి కరిగి
యాలోనిబింబంబు నాక్రంతగుండ
నాలోకనము సేసి యాత్మఁ జింతించి
తనబంటులును దానుఁ దడయక వెడలి
చనుదెంచి యాపురస్థలి కొంకిఁ జేసి
యనుచరవర్గంబు ననురక్తిఁ బిలిచి
యనియె నేకాంతంబునం దొక్కనాఁడు
పోలింపఁ గుచ్చితములకెల్ల మిగుల
నాలయం బైన యీ యాలయంబిప్పు
డే వెసఁ దుదమొద లెఱుఁగంగరాక
భేదింపరాక యభేద్యమైనదియుఁ
గటకటా! భూమిలోఁ గంటిమి కాని
యిటువంటిసదనంబు లెందైనఁ గలవె
యే పాపజాతి దా నిది చేసె నొక్కొ
చూపట్ట దింతయుఁ జొరవచ్చుత్రోవ
పనుపడునట్టి యుపాయ మింకేది
యనుచుఁ గొండొకతడ వాత్మఁ జింతించి

క్రచ్చఅదీపాంతరంబున నుండి
వచ్చినయట్టి కువాడివప్రాంగి
యువగడం బైన యీామాలయుం బిల్లు
సవరించె నని సవసవ గాఁగ వింటి
నే నమరఁగఁగల నీసూత్రిమహిమ
మానుగా నెఱిగి క్రమ్మఱ వత్తు ననుచు
నేవచ్చునందాఁక నిచ్చోట నూంర
లేవమూంవంతయే మొహసిఃకుఁడని
ముదమునం దద్వీపమున కేగి యందుఁ
జమునులై పెరుసాధుపదంబుఁ బూని
సారెను నచటి పంచాణాంబువారిఁ
జేరి యయ్యా యని శర మింత యూఁచి
కడుపెద్ద యైన సొగతహేమగురుని
గూడి వొచ్చి చోయుటు గొంపోయి రకట!
యనుచుఁ గింనాలిహా రసిశోంబు వినఁగ
నను ముంనుసను యాంబునం దొక్కనాఁడు
ఆమేటి పుణ్టిఁ గట్టినట్టి యూశిల్పి
యూమాట విని వెఱఁ గంది పొక్కుచును
జిత్రమైనట్టి యుంశిఖరంబు మీఁద
సూత్ర మేగతిఁ గాంచి చొచ్చెనో దొంగ

యన విని పరకాలుఁ డరయనివాని
యనువున నతని కిట్లనియె నవ్వుచును
జెలువార గుళ్ళకు శిఖరంబులందుఁ
గలవె సూత్రంబు లాగడములు గాక
యన విని శిల్పి లేదనుటెట్లు శిఖర
మున నేనపో సూత్రమును నిల్పినాఁడ
నిరుచుట్లు శిఖరంబు నేడేసుమార్లు
తిరమొందఁ ద్రిప్పినఁ దివియంగవచ్చు
నన విని మోదించి యాదండధరుఁడు
చని నిజభటుల కీచందంబు దెలిపి
పనివడి యాయత్తపడి వారుఁ దాను
నొనఁగూడి కాక్రన్నమ్ము నొకనాఁటిరాత్రి
గ్రక్కున నరిగి సౌగతగురునిలయ
మెక్కి యాశిఖరంబు నేడేసుమార్లు
త్రిప్పినంతనె యది తెరలినం బట్టి
చప్పుడు సేయక జగతిమై డించి
యాలోనఁ దనచెలి యలిప్రాణనాథు
నాలోని కనిచిన నతఁ డేగి మఱియుఁ
దడయక నంతరాంతరముల నిడిన
గడియలు బీగము ల్గదలింపలేక

యావిధం బెఱుఁగింప నరవిందదళధరుఁడు
శ్రీవరుఁ దలఁపులోఁ జేర్చి నుతించి
యరుసుమీఱంగ దశావతారములఁ
బరఁగిన శ్రీరంగభర్త పై యాన
నిడినంతలోన నయ్యుమప్రభేకములు
తడయక గడియలు తముదామె తెఱచెఁ
దెఱచి నమిగు లమోదించి యాబావ
మఱఁది నెన్న డుమ నుమ్మలిక రెట్టింప
నలఁతి నవ్వుచు నిమపగు పెద్దయినుప
గొలుసు గీల్కొలిపి యాకుహరంబు వెంట
డించినఁ జక్కఁగా డిగ్గి యామేటి
కాంచనరచితసౌగతమూర్తిఁ జూడ
నాసరి మఱియు లోహంబున రాగి
సీసబిచ్చడములఁ జేసియున్నట్టి
సుగతబింబాబు లాశూను నీక్షించి
బెగడొంది పలికె నభేద్యవిక్రముఁడ!
తముఁ జూడఁగా లోనాతనువుల మరయఁ
దమవంకవచ్చు నాదాయంబు గలదె
యదివో కాంచనమయం బైనట్టిరూప
మదయతం దమ కిడినట్టియన్నంబు

కౌమరార జైనులఁసురుపు దా ననుచుఁ
దమనోరు గట్టి యంతయుఁ దానె తినును
దానినే గైకొమ్ము తడయక రత్న
మానిత భూషణమయ మైనదాని
ననినఁ దత్కనకబింబాష మైనట్టి
ఘనశక్తి బెగడి దిగ్గన మింటి కరిగె
పరకాలు సోదరిపతి యంత బౌద్ధ
గురుహేమబింబంబుఁ గొలుసునం గట్టి
కదలింప నాసన్నఁ గని మీఁదివార
లది యందుకొని యంత నతని గ్రమ్మఱను
అలగొలుసునఁ దొంటియట్ల నెన్నడుమ
బలసి చేఁదుకొనంగఁ బరకాలుమఱఁదిఁ
తలదాఁటి చిక్కనఁ దనుపు తచ్ఛిఖర
బిలము పట్టకయున్న బెనఁకువ సేయఁ
బరమభాగవతుఁ డాపరకాలుమఱఁది
యరిదండధరున కిట్లనియె నవ్వేళఁ
గనకచేలాంకు కైంకర్య మీడేర
ననుసంతసమునఁ గాయము పొంగెఁ దనకుఁ
బలుమరు నింత నిర్బంధంబు సేయ
వలవదు శ్రీరంగవరదునిసేవ

యెన్ని చందంబుల నీడేరవలయు
నున్నవిచారంబు లొండేమి వలదు
తను మీఱ లిచట నిత్తఱి డించిపోవఁ
గనిన బాధ్గులు మిమ్ముఁ గదిమి చెండాడి
కైంకర్యమునకు విఘ్నము సేయఁదలఁతు
రింకఁ గొంకఁగ నేల నిదె వేగ వచ్చె
నరయ నర్థంబుఁ బ్రాణాభిమానములు
వరుసంతో నేలినవారివి గానఁ
బతి నాకు శ్రీరంగఫణిరాజశాయి
యతనివే తనదుప్రాణాభిమానములు
పతికార్యమునకు నై ప్రాణంబు లొసఁగు
నతఁడు సద్గతిఁ గాంచు నని యందురి బుధులు
ఒకగువ్వకై తను వొసఁగి రాసుతుఁడు
సకలలోకంబుల సన్నుతిఁ బడసెఁ
బరతత్త్వమునకుఁ గాఁ బ్రాణంబు లొసఁగ
నరయ నందుల భాగ్య మది చెప్ప నేల
తనతలఁ గొట్టి యిత్తఱి నుండనీక
కొనిపొండు వట్టిజాగులు మాని మీరు
అన విని పరకాలుఁ డాకార యనుచు
ననుజాతపతిమాట కందంద మెచ్చి

యోలి నో భాగవతోత్తంస ! నీవు
పోలింప నిహపరంబులు చూఱఁగొంటి
వని వాలు గైకొని యతనికంఠంబుఁ
దునిమి యాశిరముఁ బొందుగ నేలఁ బూని
బలునైన యాజైనభర్మరూపంబు
బలువిడి నాగుడిపై నొయ్య డించి
పట్టిమంచపుఁ బెనుపల్లకిమీఁదఁ
బెట్టి ముసుంగిడి పెద్దయు వగచి
శవముఁ గైకొనిపోవుసరవి నామంచ
మవిరలబలవంతు లగువారు మోవఁ
దలలు వీడంగఁ గొందఱు ఱొమ్ముగడలఁ
బలుతెఱంగులఁ బాడి పాడి శోకింపఁ
గొందఱు కాష్టము గ్గొని యేగుచుండఁ
గొంద ఱింగలము గైకొని చనుచుండ
నీరీతి భృత్యు లాహేమబింబంబు
దూరంబు గొనిపోవఁ దొఱఁగురక్తమున
మలయుచుఁ జేనున్న మఱి దిమస్తకము
కలయంగఁ జూచి రక్తముజాడవట్టి
వత్తురో యనుచు నవ్వాలఁ బరకాలుఁ
డత్తఱిం గదుదట్ట మగుపొదలోన

నాతల డాఁచి హేమాకృతిఁ గొనుచు
నాతలఁ గడచి తా నరుగు నత్తఱిని
శ్రీరంగనాథుఁ డాశ్రితవత్సలుండు
కూరిమితోఁ దనకొఱకుఁ గా వచ్చి
భక్తుఁ డీల్కై వడిఁ బ్రాణంబు లొసఁగు
భక్తికి నాశ్చర్యపడి సంతసించి
కంటిరే నాభక్తు ఘనతరభక్తి
వింటిరే యొప్పైన వివరించి మున్ను
అని నిత్యవరులతో నందంద బొగడి
వినతాతనూభవు వీక్షించి పలికె
నాకొఱకిపుడు ప్రాణము లిచ్చినట్టి
నాకేశనుతుని వైష్ణవశిరోమణిని
బొందితో మస్తంబుఁ బొందుగా మగుడ
బొందించి నీముఖాంబుజసుధాధార
నెనయించి ప్రాణంబు లెసఁగింపతోడి
కొనిరమ్ము వేగ నగ్గురుభక్తినిరతు
ననఁ జని విహగేంద్రుఁ డరియముమఱది
తనువున మస్త మత్తఱిఁ బొందుపఱచి
తనమహత్త్వము మహీస్థలిఁ గానుపింప
ఘనతరామృతమూర్తి గాఁగ నెంతయును

బాలుపారు నిజముఖాంబుజసుధారసముఁ
జిలికించి బ్రతికించి చెలఁగించి యతని
గురుభక్తి వేగఁ దోకొనివచ్చి రంగ
వరునిపాదములఁ గేవల నిల్పెఁ బ్రేమ
నరిదండధరుఁ డంత నాహేమబాధ
గురుబింబ మీరీతిఁ గొనిపోయి పోయి
కడుదూర మరిగి చీఁకటివిరిచుక్క
వొడుచువేళకుఁ గృష్ణపురిఁ జేరవచ్చి
యనుచరముఖులకు ననియె దూరంబు
సనుదెంచితిమి ప్రజ చాల నాకొనియె
బలువైన రేపటిపయనంబు సాగ
వలయు నేఁ డిచ్చోట వసియించు టొప్పు
దీనికై యందఱు దిట్టగాఁ గట్టి
పూని యొక్కెడ నిల్వఁ బోల దిచ్చోట
నుండరా దిఁకఁ దలాయొకదిక్కు చెదరి
యుండఁగవలయు సూర్యోదు గ్రుంకుదనుక
నని వేదబాహ్యమతాసక్తు డగుట
కనయంబుఁ గోపించి యాజ్ఞఁ గావించు
వడువున సౌగతవరమూర్తి రొంపి
మడియుండ నంచు నుమ్మలి లోనఁ ద్రొక్కి

యనుచరవర్గంబు నాయూరిలోని
కనిచి తా నట నుండె నది చూచికొనుచు
నప్పు డామడి సేయు నాయూరికాఁపు
ముప్పిరిగొను పగ్గములచుట్టతోడఁ
గ్రుచ్చిన మునికోల గొంగడిముసుఁగు
మచ్చల మచ్చల మట్టికాశయును
బలుపైన కేలియంబటికుండ తనకు
నలవడ నడగొండ లననొప్పుచున్న
మీఁపైనయెద్దుల మెడకాడిమీఁద
నోపరు వైచి నెక్కొని రొప్పికొనుచుఁ
జనుదెంచి యామడిచక్కి నాగేలు
పనుపడఁ గట్టి చొప్పడ దున్ననరుగ
నది గని పరకాలుఁ డాత్మఁ జింతించి
యిది గానఁబడు దున్ననిచ్చిన పీని
నని యంత నొక్కఁ డుపాయ మూహించి
యెనయ దున్నుచు నెదు రేతెంచువాని
నెడపక తిట్టుచు నెద్దులమెడలు
విడిచి లో శంకలు విడిచి యిట్లనియె
దున్నినఁ జోళనాథునియాన నీకు
నిన్నాళ్ళు తేరసా మ్మిట్టు తినందగునె

పుడమి వారల నెల్లఁ బ్రోచి మాతాత
గడియించినట్టి దీకాణాచి నేల
యన్యాయ మేటికి నడుగుము వాదు
మాన్యంబు గాని సామాన్యంబు గాదు
తుదిని యీ యూ*రను దొరరెడ్డి వేరె
మదిఁ గొంక కొండొరుమాన్య మీరీతి
దున్నెడిలా గెట్లు తొలఁగు నీపనులు
విన్నార మేల క్రొవ్వితి కాఁపువాఁడ
కేనమేటికిఁ గందిగిఁజను గాఁపు
వానిని వేచ కెవ్వలఁ జవి గాద
యనుమాట నిజమయ్యె నని వాఁడుఁ దాను
ననయంబు గినిసి వా దడచి యామీఁదఁ
దగవున కొప్పి యిద్దఱు నేగుదెంచి
తగవువారలతోడఁ దమపను ల్నాడివి
కట్టకానుక లిడి కడపట నిలువ
గట్టిగా నాకార్యగతి విచారించి
యలయున్న సభవార లాయిరువురను
బిలిచి పరాంతకుఁ బిలిచి యిట్లనిరి
యరయంగ నీమాన్య మైనయందులకుఁ
బరగంగ సాక్షిసంబంధంబు గలదె

---

*ఊరి

యనిన నెక్కడిసాఁకు లలనాఁడె పోయి
రనినఁ బత్త్రము గలదా యని యనిన
నదర మాతోటి యేడవపెద్దతాత
కిడినపత్రము చెడ కిన్నాళ్ళదాఁక
దరుచు నుండంగఁ దామ్రశాసనమె

---

యనిన సత్యము సేయు మనఁ బరాంతకుఁడు
తావిష్ణునకు నేఁడుంతరములనాఁటి
సేవకుఁ డనబుద్ధిఁ జింతించి యపుడు
తలఁప మాయేడవతాత మైనట్టి
కులకర్త వామనాఖ్యుఁడు చెన్నమిగులఁ
బుడమి తాఁ గొలుమనప్పుడు నేర్పుతోడ
గడియించి కైకొన్న కాణాచి నేల
తలఁపఁ దచ్చరణగోత్రము వాఁడ నేను
పలుమాట లేల తప్పక శౌరిపాష్టి
యని సత్యమొనరించి యలనాఁడె గెలిచి
జనులెల్లఁ దను వేయుసరణులఁ బొగడ
మునుపు దానున్న సమున్నాస్థలికిఁ
జనుదెంచె రవి యస్తశైలంబు డిగ్గె
నప్పుడాపురనాథుఁడగు నందసూనుఁ
డప్పాలుఁ బాలుఁ బాయస మారగించి

నంబిడగ్గరఁ బిల్చి నాదుభక్తుండు
పంబినయాఁకట బడలియున్నాఁడు
అతనికిఁ బాలుఁ బాయస మప్పములును
హితమతితోడ నీవిచ్చి రమ్మనిన
జానుగా వాని నర్చకుఁడు మస్తమునఁ
బూని తత్త్వరణంబునఁ గొనిపోయి
కేదారభూమిచక్కిన గాచియున్న
యాదేవనుతునకు నది యిచ్చుటయును
బరివారమును దానుఁ బరకాలుఁ డెంతె
పరిపూర్ణముగఁ బసాపడి సంతసించి
త్రిదశేంద్రవంద్యుని దేవదేవునుఁ
బదిపద్యములచేతఁ బ్రణుతిఁ గావించె
మడిలోని యల హేమమయవిగ్రహంబు
వెడలంగఁ దిగిచి వేవేగంబ కడిగి
మునురాత్రిఁ గొనివచ్చుమురుపున మఱియుఁ
బనుపడ మంచపుఁబల్లకిలోన
నిరవొందఁ బెట్టి మిన్నేర చేటరి
దరిత్రోవ నరుగుచుం దన్మార్గమునకు
సరస నొప్పెడు శౌరిసదనంబులందు
నిరవొందఁ బగలెల్ల నీకీతి నిలిచి

యాయాయిమూర్తుల ననువొంద నుతులు
సేయుచు వెండియుఁ జీఁకటిపడిన
మునుబోలె పుత్తడి మురిమాపు వేగఁ
గొనిపోవుచును దవ్వుగొని యేగుదెంచి
ఘనతరం బైన సంగమపురంబునకుఁ
జని ప్రొద్దుగ్రుంకెడిసమయంబునందు
నాఁపురవరనాథుఁ డై యొప్పుచున్న
శ్రీపతి యారగించినప్రసాదంబు
ననుచరసంయుతుం డై యారగించి
ననయంబు గార్క్రమ్మ నయ్యూరిత్రోవఁ
దెలియక యాయూరితీర్పరిం గూర్మిఁ
బిలిపించి త్రోవఁ దెల్పెడువాని నొకని
ననుపుము సూర్యోదయం బైనదనక
ననిన వాఁ డారీతి ననిపెద ననుచు
నరిగి మదోన్మత్తుఁ డై మఱచుటయు
నరిదండధరుఁ డంత నచ్చోటఁ గదలి
చనుచుండఁ దత్పురీశ్వరుఁ డైనయట్టి
వనజోదరుఁడు భక్తవత్సలుఁ డపుడు
బాణకృపాణచాపంబులునుభయ
తూణీరములుఁ దాల్చి తోడనే నడువఁ

తెలతెలవార నేతేర నామేటి
విలుకానిఁ బరకాలవిభుఁడు వీక్షించి
యెయ్యది నీనామ మెద్ది నీయునికి
యియ్యెడ నాతోడ నెఱిఁగింపు మనిన
నరయఁగ నను జగదభిరక్ష యండ్రు
పురుడింప సంగమపురితలవరిని
బూనిక మీ రొంటిఁ బోయెద రనుచుఁ
దోన నేనును మీకుఁ దోడువచ్చితిని
అనుచు నంతర్హితుం డైన డెందమున
ననయంబు వెఱఁగంది యాపరాంతకుఁడు
ఆనందబాష్పంబు లడరఁగఁ బొగడి
శ్రీనాథుఁ డని యిచ్చఁ జింతించి యెఱిఁగి
దశరథసుతుని నాతనిహృద్యపద్య
దశకంబుచేత నెంతయు సన్నుతించి
మునుకొని శ్రీరంగమున కేగుదెంచి
కొనివచ్చు నలబౌద్ధగురుమూర్తిలోన
గొనవ్రేలిమాత్రంబు గొట్టించి డాఁచి
ఘనమైన కాంచనగాత్ర మంతయును
నఱకించి కరఁగించి నాణెంబు సేసి
కొఱదీర మూడవకోటఁ గట్టింప

నాకాలమునను భక్తాంఘ్రిరేణుండు
శ్రీకాంతుఁడైన యాశ్రీరంగపతికిఁ
దవరు ప్రేముడి సుమదామకైంకర్య
మొనరింపుచుండెడి యొకమందిరంబు
చాయం *బ్రహారంబు చనుదేరఁ జూచి
యామెడఁ బరకాలుఁ డాత్మ భావించి
కడిఁది సూత్రంబుసంగతి సాల మిపుడు
నడిచాయ వచ్చె వైష్ణవగృహంబునకు
వివరింప నితనిని వేళ మీఁదులకుఁ
దివియకుండఁగరాదు తివియంగరాదు
కమలలోచనుని కైంకర్యంబుకంటెఁ
గమలేశుభక్తుకైంకర్యంబు ఘనము
వేసరక యఱువదివేలేండ్లు భక్తి
సేసేత హరిపూజ సేయుటకంటె
నొకభాగవతునకు నొకమాఱు పూజ
యకలంకమతిఁ జేయ నదియ మిక్కుటము
అనుచు నేకతమున హరుఁడు పార్వతికి
నొనరఁ బద్మంబున నుపదేశ మొసఁగెఁ
గావునఁ బరమభాగవతగేహమున
కీవలఁ జుట్టిరా నిత్తు నీకోట

---

* బ్రకారయం

యనుచు నావరణంబు నాగేహమునకు
ఘనతరావణంబు గాఁగఁ గట్టించె
నావిధం బెల్ల భక్తాంఘ్రిరేణుఁడు
భావించి వైష్ణవభక్తికి మెచ్చి
యిప్పు డీపరకాలుఁ డిట చేయునట్టి
యుపకారమునకుఁ బ్రత్యుపకారముగను
బెనుపొందఁగాఁ బిడ్డ పేరిడవలయు
ననిమాని మది నెంచి యాత్మజుభాతి
యనిశంబు దాముంబు లర్పించునట్టి
తనదుపువ్వులనారఁ దరగుకత్తికిని
అరిదండధరునామ మనుపొందఁ బెట్టె
పరమానురక్తుఁడై పరకాలుఁ డంత
వరగోపురంబును వంటసాలయును
గరమర్థి గణజంబుఁ గట్టింపఁ దలఁచి
కలయ నాచార్యులఁ గాసీల నపుడు
బిలిపింప వారలు పెనుజన్నిదములు
చంకల శిల్పశాస్త్రములపుస్తములు
వంకవోఁ జుట్టిన వలుదపాగలును
గొలదిరేఖలు వడిఁ గోసినయట్టి
మొలమించి వలకేలి యినుపకమ్ములును

నలవడ శిల్పశాస్త్రాగమవేత్త
లలపరాంతకునకు హస్తము లొసఁగిచి
చేరువ నిలువ నీక్షించి భాగవత
పారిజాతంబు చొప్పడఁగ నిట్లనియె
నడుఁగక మీర లిన్నాళ్ళు ప్రయాస
పడితిరి శ్రీరంగఫణిశాయికొఱకుఁ
బడిన నేమయ్యె మీపడుపాటులెల్ల
నెడపక రంగేశుఁ డీడేర్పఁగలఁడు
ఒప్పుగా మీధనం బొప్పించుతు మీఁద
నప్పుగా గణజంబు నాగోపురంబు
ననుపొంద రెండవయమ్మహానసము
నొనరించుఁ డని పల్కి యుడుగర లొసఁగ
వేవేగ వారు నవ్విధి నన్నిపనులుఁ
గావింతు మని యొప్పి క్రమ్మఱ వచ్చి
తమకు నీవలయునర్థము వేఁడునపుడు
తమకించి యొందుఁ గొందఱు తమ్ముఁ జూచి
తమచేతికాసు లిందనుకను మెసవి
క్రమమున నీయూడిగములు సేసితిమి
అలవడఁ దముసేయునట్టియాపనులు
'కొలుపలే వనియొప్పుగొనుటయు లేదు

విదితంబుగా మూను వెనకకు మీాను
ముదలవెట్టెడు లెక్క ముదలవెట్టెను
చేకొని యేమేసేసినయందుఁ గడమ
లేకుండఁ జూచి పాలించు మోసామి
చప్పటికుముదంబు చదరపానంబు
కప్పుచూరులు కంబకాళ్ళు పద్మకము
నొగి మహాజగతియు నుపజగతియును
దగినగట్టను గపోతము సంతనయును
మొదలైన తమపని మొగములలోను
గొదవ సీమంత చేకూరకయుండ
నీసునం దవిలి దా రీతిఁ బనులు
చేసేతఁ దమచేతఁ జేయింపు మన్న
కాసిడు తమకొక్క కాసిడు సరికి
వేసికి గొట్లాడి పెనఁగిచూచితిమి
అన విని పరకాలుఁ డాశిల్పివరులఁ
గనుఁగొని యొంతయుఁ గరుణ వాటించి
సారసభవముఖుల్ సహరింపలేని
శ్రీరంగవిభుసేవఁ జేయువీరలకు
వ్యర్థంబు మిగుల ననర్థంబు నైన
యర్థమిచ్చుట కొంత యని విచారించి

పరమార్థముగనింకఁ బరమాత్మ మిమ్ము
టరయఁ బ్రత్యుపకార మనుచుఁ గావేరి
ఘనవేగమున రెండుగడ్డలుం జమరు
కొని పార నొకనావికుని రహస్యముగఁ
బిలిచి కాంచనములు పెక్కుగా నొసఁగి
యలవిమీఱినధనం బది తెమ్మ
గాసింపు మన్నయీకాసీలనెల్ల
నాసమ్మతమున నీనావ యెక్కించి
కొంచక నట్టేటఁ గొనిపోయి ముట్టి
ముంచి నీవిందిచే ముంచిరమ్మనుచు
సమకట్టి తనకు కజనము వీక్షించి
క్రమమున మీకు నీఁగలధనంబెల్ల
సవరింతు లెక్కకుఁ సవరి నయ్యేట
యవల శ్రీనీపతీర్థా
ఉమతరనిక్షేపముున్నది తనది
వరుసతో నావెంట వచ్చెదరేని
యని వారి నందఱ నాపుట్టిమీఁద
ఘనమైన యొకమూఁక గాఁగ నెక్కించి
తామున్నయవలికి దాఁటి కాసీల
నామహాసింధుమధ్యమున ముంపించి

ముకుళితహస్తుఁడై మురవైరిఁ దలఁచి
సకలలోకేశ! కంజదళాయతాక్ష!
భవదీయకైంకర్యపరులైన వీరి
భవముక్తులుగఁ జేసి పరమపదంబు
చేరునట్లుగఁ గృపసేయు మటంచుఁ
బారమార్థముగఁ బ్రపత్తిఁ గావింప
లోకంబులెల్ల నాలోకించుచుండ
నాకంబున వచ్చి యాదివాహనులు
మక్కువ విమానంబులందు
నెక్కించుకొని ముక్తికేగి రంతటను
బరకాలయోగి యెప్పటియట్ల మగుడ
నరిగి తా రంగవిహారి నైయుండె
నట నాగపురిబౌద్ధాలాగుడిలోనఁ
బటుతరహేమబింబము లేకయున్నఁ
బొగులుచు నాశ్చర్యమును జెంది నడన
మెగువ బంగరుకుండ యెడయుటఁ జూచి
వడిసినరక్తంబువడువు నచ్చోటి
యడుగులుఁ బొడఁగాంచి *యావీట నున్న
ఇల నీటిలోజాడ లెత్తంగఁ జాలు
తలవరులను బిల్చి తచ్ఛాయఁ జూప

* యచ్చటి కడుమ.

జలజతోమర శంఖ చక్రి దంభోళి
హాలచిహ్నితము లైన యరిదిండధరుని
యడుగులఁ బాడ గాంచి యచ్చట కడమ
యడుగులు గని కడు నాశ్చర్య మంది
యలవి నల్పుఁడె యట నలవెన్నదొంగ
బలిమి వాటించిన బలుదొంగ యనుచుఁ
గొలఁది కనుంగొని గుఱి వ్రాసి మఱియుఁ
గొలిచి చూచుచు జాడగూడ నెత్తుచును
గుడిపడమటఁ జోరకులు డిగినట్టి
వడువుఁ జూపుచు బాధ్వారంబు మునుపు
చోరులు సనినట్టిచొప్పుఁ జూచుచును
బోరున నటు పోయి పోయి యొక్కెడను
సుడిగాలి వాని నించుక మాసి మసను
పడియున్న నొండొరుఁ బరికించి కాంచి
గురులు వ్రాయుచు నడుగులు గొల్చుకొనుచుఁ
బెరచోటఁ జొప్పు దీపింప నెత్తుచును
ఘనమైనచట్టునం గానరాకున్న
బునుకగ వీపునఁ బొరలి మొత్తుచును
అలపరకాలుని యడుగని తెలిసి
బలువిడి శ్రీరంగపట్టణంబునకుఁ

జనుదెంచి యటనున్న శాత్రివాంతకుని
గని కోపమునను సొగతు లిట్టు లనిరి
తెచ్చినతమవంశదేశికు మరల
నిచ్చెదో నొచ్చెదో యేమి కావలయు
ననినఁ బరాంతకుఁ డాశ్చర్యపడుచుఁ
దనుగానివానిచందమున నిట్లనియె
నెచ్చటిమీగురుం డేటివాఁ డాతఁ
డెచ్చట నుండు నా కెఱిఁగింపుఁ డనిన
నలనాగపురి నున్న హైమబింబముఁ
దెలియవే చేచేతఁ దెచ్చిన దొంగ
అలవిరివారల నణఁకించినట్టి
పులిమిపుచ్చిన నిన్నుఁ బోనీము నేఁడు
నడుగక మాసొమ్మునకు నొప్పఁజెప్పు
వెడఁగ ! రాజ్యము వారు విన్న మాకొదవు
మె. వలవదు చెడిపోవవలదు నీమనసు
వడిసిన ఁదిఁ జెప్పితిమి యీగొంటుబాగేల
యడుగులఁ తమమూర్తి నిచ్చితివేని
ఇల నీటిల నిను దాఁకి తలఁపము తుదిని
ఈవ తెచ్చితి వని యేభాసమైనఁ
గావించెదము నెంత కట్టుముద్దునను

కితవ ! నీవిటకు దొంగిలి తెచ్చి తనుచు
సతి వెతలకు నిల్చి యాడెద మిపుడు
అని తనకొంగు చయ్యనఁ జుట్టిపట్టి
కొని పోకు మని కుసిగుంపుఁ గావింపఁ
దన తెచ్చు టెఱిఁగి రి త్తటి నంచుఁ దెలిసి
యనియె వారలతోడ నాపరాంతకుఁడు
వదర నేటికిఁ గొంగు పట్టంగవలదు
వదలుండ యది దొడ్డవారిచేఁ బడియె
నాసొమ్ముఁ దెచ్చు టనరయుదుం గాని
చేసేత నేను దెచ్చినవాఁడ గాను
ఎఱుఁగను నను మీర లేకేతిఁ బఱచు
టెఱిఁగిన యది గని యిట తెచ్చువారు
గల్గిన్ననఁ బ్రీతిమ భంగము సేయఁ జూతు
రెన్నిచందంబుల నీరంతు వలదు
ఫలము వారలొ కాక పనిమాలినట్టి
చలము వారలొ వట్టి జగజోలి యేల
పిసిఁడి బాగేదిచెప్పిన బులుగుఁనకుఁ
బసిఁడి నాచెప్పినపగిది నిచ్చినను
గైకొని యేఁ జిఁకకన వ్రేలు గడమ
కాకుండ మీకొప్పు గావింతు ననిన

జైను లామాటసూక్ష్మము గానలేక
యూనినగురుభక్తి యొదవ నిట్లనిరి
ఈవడిగినవెల్ల నిచ్చెద మిప్పు
డీవతలం బత్రి మిచ్చెదవేని చెప్పు
మన సమ్మతించెఁ బరాంతకుం డపుడు
ఘనులఁ గొందఱ సభగాఁ గూడఁబెట్టి
తనవారిపనులచందముఁ జెప్పి కొన్ని
దినములు గడు విడి పేటతెల్లముగ
సమమాసతిథివారసరణు లేర్పఱచి
ప్రమదంబుతోడ శ్రీపరదండధరుఁడు
అమరజైనుల కిచ్చినట్టిపత్రంబు
క్రమమెట్టిదనిన మీగడువు నాఁటికిని
పిసిఁడి బాగేదిచెప్పిన పులుఁగునకుఁ
బసిఁడి నేఁ జెప్పినపగిదిమీరొసఁగఁ
గైకొనితుదిఁ జిటుకన వేలుగడమ
వడిగాకుండ మీకొప్పుగావింతుననుచు
యదుగులనుమొదఁ బడిసవరించుపత్ర
ఇల నీటికెనిందుల పత్రహస్తునొప్పంబు
ఆరంగపతి సాక్షులగువారియొప్ప
మారంగపతియుంచు నపుడువ్రాయించి

యలపత్రమంది తానాసాగతులకుఁ
జెలరేగియిచ్చె నిచ్చినవార్ధులప్పుడు
తమపురి కరిగి యాధనము సైకొనుచుఁ
గ్రమమొప్ప మగిడి యాగడువునాఁటికిని
అరుదెంచి యీఁదగు నర్థంబు లొసఁగి
పరకాలు నిజగురుప్రతిమ వేఁడినను
మునుపు దాఁచినబౌద్ధముఖ్యుని బొందిఁ
గనుపట్టు నలచిటికెనవ్రేలు గొనుచు
నేతెంచి వారల కీవచ్చునంత
నాతతశోకార్తు లగుచు నెంతయును
గనలిజైనులు పరకాలునిం జూచి
యనిరి నీమాట సత్యం బని నమ్మి
మునుప దొంగిలినసొమ్మును నీకు నుంత
ధనమిచ్చితిమి మంచితనమున మఱియు
నిచ్చిన తమగురు నీక యీవ్రేలు
దెచ్చి యీవచ్చె దేతెఱఁగునం దమకు
నిదె మున్ను నీవు మా కిచ్చినపత్ర
మదె సాక్షు లున్నార లాగాములకును
అనినఁ బరాంతకుఁడనియె వారలకుఁ
బనిలేని యీ వట్టిపలుమాట లేల

పన్ని నేనిచ్చిన పత్రంబులోన
నున్నచందంబున నొప్పింతు మీకుఁ
బదర నాపత్ర మీప్రజలముందరను
జదివించు డంచు నేసరవినున్నదియు
నంచు నున్నంచుల నావగింజంత
చిందు సేసిన నొరసేసిన నైన
నినుమడిగా నిత్తు నిపుడు నీసొమ్ము
కినియక తగవునం గెలిచి కైకొనుఁడు
అనిన వా రాపత్ర మాసాక్షి వారు
వినుచుండ వడిఁ జదివింప వారలును
గైకొని తుదిఁ జిటికెనవ్రేలు కడమ
గాకుండ మీ కొప్పగావింతు ననుచు
నాకులో నున్నది యంతియే కాని
యీ కాంచనాకృతియంతయు మీకు
నొప్పింతు ననుట లేకుండుటం జేసి
తప్పు గైకొని పట్ట తగ వేది మీకు
నన విని తగవున హైన్యంబు నంది
చని సొగతులు చోళజననాథుఁ గాంచి
తమ హేమగురుఁ బరాంతకుఁడు గైకొన్న
క్రమ మెఱింగించి వెగ్గలముగా లోనఁ

బడిధాన మీ నోడంబడిన భూవిభుఁడు
కర ముగ్రమునఁ బరకాలు రావించి
యేమోయి పరకాల! యింతయధర్మ
మీమెయిం గావింప నిది నీకుఁ దగునె
యే నెంత చెప్పిన నిట్టి నీయోజ
మానకపోయితి మాటిమాటికిని
గుఱుతైన సౌగతగురుముఖ్యు హితి
ద్రోఱఁగి తెచ్చుట మహాద్రోహంబు గాదె
యన విని పరకాలుఁ డననీపుశోక
నవియె రాజవి నిన్ను ననరాదుగాక
యాగమబాహ్యులై యున్న యట్టి
సౌగతముఖుల నెక్కుడఁ బోషఁగన్న
గతము సేయుఁగఁ దగుఁ గాక భూపతికిఁ
బ్రతిఁ బెట్టి యవి తమ పాలింపఁ దగునె
మును త్రిపురాసురమోహార్థముగను
దనుజారి యట్టిమతంబుఁ గల్పించి
తుదిఁ దానె తన్మతస్థుల నెచ్చనీక
పదివేలవిధముల భంజింపవలయు
నని యానతిచ్చె నాఁడెఁగాన సార్థ
జనగురుహరణంబు సలిపితి నేను

దోడరి యందులకు నాతోడ వాదింప
విడువుము బౌద్ధుల వెస సింహలోన
జాడతో నాగమసరణి వాదించి
యోడినవారల నొనరింపు మాజ్ఞ
యనిన భూవిభుఁడు పరాంతకు బౌద్ధ
జనులతో వాదింప సముత్సుకుఁడయును
బరకాలుఁ డప్పు డాపరవాదిబలము
నుతతరానంతవేదోక్తశాస్త్రముల
నలినలిఁ జేసి యోటయు సీఁగఁదోలి
గెలిచిన నరుదంది క్షితినాథుఁ డప్పు
డరిదండధరునకు నవనతుం డగుచుఁ
బరమవస్త్రముల సంభావించి యపుడు
హీనవాదులఁ జేసి యెదిరించి నట్టి
జైనుల దండించి జగములు పొగడ
మక్కువ బరకాలు మదదంతిరాజు
నెక్కించి పురమెల్ల నేగించి పొగడి
యుల పట్టభద్రున కెన్నిచిహ్నములు
గల వన్నిచిహ్నముల్ కడఁకమై నొసఁగి
యనిచినఁ బరకాలుఁ డారాజు వీడు
కొని రంగపురికి నేగుచునున్న తఱిని

ధరలోనఁ ద్రికవినా దనరినయట్టి
హరభక్తుఁ డగు షణ్ముఖాంశసంభవుఁడు
సమ్మదంబునఁ బేరిశైవమతార్యుఁ
డమ్మహాత్మునకరుదై డాయవచ్చి
భరనానాసుమధురవిస్తారచిత్రముల
విరచితమగు కవిత విశ్వాసంబునుచు
గరమర్థి వాయిదకాంగ్రంబుగలిని
సొరుమ కార్యలచేఁ బెల్లునాదింపఁ
బలుపెఱంగులవానివజ్జనె రవలి
మలహారిఘంటాదిమహితవాద్యములు
వాయింప సముదంతివాహనారూఢుఁ
డైయేగుదెంచు నయ్యారిదండధరుని
గనుఁగొని తనయున్నపునపురంబునకుఁ
జనుదేరవలయు నోసర్వజ్ఞ యిప్పు
డన విని పరకాలుఁడనియె నాతనికి
వనజాతనేత్రునివాసంబు లేని
గ్రామంబుఁ జొర ననికల దొకవ్రతిన
యేమెట్లువచ్చెద మీపురంబునకు
నన విని త్రికవి యయ్యారిశమనునకు
ననియె ముందర మదీయుం బైనపేటఁ

గలదు నారాయణాగార మీవేళఁ
గలియుగంబున నది కనుపట్టలేదు
రవివంశతిలకుండు రాముండు తొల్లి
యవనిరక్కసుల వేఁటాడుచు నచట
నెలకొన్న కతమున నిఖిలలోకముల
నలవడు రామవియత్పురం బనఁగఁ
బరఁగ నాప్రశ్న విని పరకాలుఁ డటకుఁ
గరమర్థి నడుగ వేడ్కల శైవగురుఁడు
సకలోపచారము ల్సవరించి యతని
యకలంకసామర్థ్య మరయంగఁ దలఁచి
ఘనతమై భువి సర్వకవితావిభుండ
ననిపించుకొను జెట్టి లైన నీ విపుడు
కడలిశంఖంబు లిక్కడకు రాఁ గవిత
యొడఁగూర్చితేని నీకొప్పు నా బిరుద
మన విని పరకాలుఁ డా శైవగురుని
గనుఁగొన లేనవ్వు గనుగొర గనుర
నన్నేలినట్టి క్రొన్ననవిల్తుతండ్రి
సన్నిధిఁ గాని యే సవరింపఁ గవిత
నావుడుఁ బరకాలు నంచిన శిష్యుఁ
డీవేళ దేవరకే మింద రుండ

శ్రీపతికృపను నీశిష్యప్రశిష్యుఁ
డోపఁడే యీమంము నోడించు మాపనికిఁ
దుది యేని నేలినధూర్జటి వచ్చి
యెదిరిన నీ వేల యేమె చాలుమను
కొండతో దగరు డీకొనిన చందమున
నండజాధిపుతోడ నహి పోరునట్లు
మఱి నభోమణితోఁ గీటమణిఁ జాకసేయు
తెఱఁగున నీదైన తెఱఁ గెఱుంగమిని
గమతానుసుం డైన కతన మీతోడఁ
దొడరె నింతియకాని తుది నెన్నిచూడ
నతనికి మీకును నంతరాంతరము
మఱి నెన్నఁ జో హస్తిమశకాంతరంబ
యునిన శిష్యులఁ జూచి యాపరకాలుఁ
డనియె నెన్నిన మీర లంతటివార
లైన నీతనిగర్వ మనఁచుట కిప్పు
డేనేమి మీరేమి యీపురిలోన
వేచని యిందిరావిభుని తూవాస
మే చక్కి నుండునో యెఱిఁగిరం డనినఁ
బూనిక శిష్యు లాపురమెల్ల వెదకి
కానక పరకాలుఁ గాంచి యిట్లనిరి

వెదకితిమయ్య యీపీటమందునకు
వెదకిన లేదయ్య విష్ణుమందిరము
అన విని పరకాలుఁ డాపురం బెల్లఁ
దనదివ్యయోగవిద్యాదృష్టిఁ జూచి
ముదుకగుల్లలలోన మూర్తియం బున్న
చదురునం బెస్కాపామంసులలోన
మకరకుండలధారు మదిఁ బాదుకొలిపి
యొకవైష్ణవీమణియుడివోనికూర్మి
ననయంబు పామండులగు తమవారు
గనకుండ దొంతులకడ నుట్టికుండ
ముడ్డుగారెము * వెన్నముద్దకృష్ణయ్యఁ
దద్దయుభక్తి వస్త్రముఁ చుట్టి దాఁచి
పగల్లె వారిలోపలఁ దాను నొకతె
యగుచు వారాడినయట్ల యూడుచును
దమవారు నిద్రించుతఱిఁ బుండరీక
విమలాక్షు మానసలవిందు గోవిందు
సలలితాంబువుల మజ్జనము నొనర్చి
ఫలపుష్పధూపదీపముల నర్పించి
తొంటిచందమున నందునిజవరాలి
చంటిపాపని నిడి సతతంబు నిట్లు

* వెన్నముద్దుకృష్ణంచు,

హరిభక్తిపరమతి యైన యాసాధ్వి
సరవి యంతయు మానసంబునఁ దెలిసి
వెలయంగఁ దనకన్నవిధము శిష్యులకుఁ
దెలిపి మీరిపుడు సందేహింప కరిగి
యలకృష్ణుతోఁగూడ నాకాంత నేను
బిలిచెద నని చెప్పి పిలిచి తోడ్తోను
అన విని †పరిజను లట్లు గా కనుచుఁ
జని యటనున్న వైష్ణవిఁ జేరవచ్చి
కనుఁగొని యాంతరకాలు వాక్యములు
వినుపించి తమ్ముని వెలిఁ గందికొనుచు
సతతంబు నీకలశముంగోవినంద
సుతు నర్చనముసేయు ప్రోవ్వ నాతలఁపు
నేనెఱుంగుదు గాని యుంటిలో నారు
గాన రీగతి యెట్లు కనినొనో ఘనుఁడు
మానుగా నతఁడు నిశ్చలుఁ డైనయోగి
కాని సామాన్యుండు గాఁడు భావింప
నావైష్ణవోత్తము నర్ఘ్యపాద్యములు
సేవించి యభిమతసిద్ధిఁ బొందెదను
అని కుండలో నున్న యావాసుదేవుఁ
గొని కూర్మితోడ నక్కునఁ జేర్చికొనుచుఁ

---

† దరి

గరమర్థితోఁ బరకాలుసన్నిధికి
నరుదెంచి శ్రీకృష్ణు నతని చే నొసఁగి
ముదమున నడుగుదమ్ములమీఁద వ్రాలి
పదివేలతెఱఁగులఁ బ్రస్తుతింపుచును
ఆలోలసంసారమనుపయోరాశి
లోలత మునిఁగి తేలుచు నున్నదానఁ
బరకాల! తావకపదపద్మభక్తి
తరణిచేతను నొక్క దరిఁ జేర్పు మనుఁడుఁ
బరమసంతుష్టుఁడై పరకాలుఁ డంతఁ
బరమకృపారసభరితగాఁ జేసి
చలము ముప్పిరిఁ గొన్నసంబంధుఁ జేరఁ
బిలిచి యప్పుడు ప్రతాపించి యిట్లనియెఁ
దలపోయ నాకవిత్వములోని మేలు
దలపోయ నీరమాధవుఁ డొండు దక్క
నెఱుఁగంగలేరు బహ్మేంద్రాదులైన
నెఱిఁగిన నీమూర్ఖి యెఱుఁగంగ వలయు
ననుచుఁ గాళియభేదికభిముఖుండగుచుఁ
దననేర్పు మెఱసి యెంతయుఁ జిత్రగతుల
నలశౌరిమీఁదట నంకితంబుగను
జలధిశంఖంబు లచ్చటికి నేతేరఁ

బదిపాట నొక్క ప్రబంధంబుఁ జేసి
హృదయంబులోఁ గన్న యాశార్ఙ్గపాణి
ననువొంద దేవు ప్రత్యక్షంబు గంటి
ననునర్థములతోడ నలవడి యొప్పఁ
దగ ముకుటాఖ్యబంధంబుచే భేద్య
మగునట్టి చిత్రకావ్యముఁ బ్రకటింప
విని శైవగురుఁ డంత వెలిగంది పొగడి
కనుఁగవ బాష్పముల్ గ్రమ్మలు కొనంగ
నరిదండధరుపాదాంబుజాతములఁ
గరమర్థి వ్రాలి సైగనుపాటు నిలిచి
మురవైరి యవతారమూర్తివి నీవుఁ
బరుఁ డని తలపోసి పామరబుద్ధిఁ
దొడరిన యిన్మహాద్రోహంబు నీవ
కడతేర్చి క్షమియించి కావవే తండ్రి!
యని పెక్కుభంగుల నభినుతి సేసి
పెనుపొందఁ బరకాలబిరుదుకాహళికఁ
గొని భూమి [illegible]వ్యులకును జతుష్కవుల
కును రాజ[illegible] నొక్కనఁగఁ బూజింపఁ
గరము వేడుక బరకాలుఁ డావేళఁ
గరమర్థి నతఁ డిచ్చు కనకాంబరముల

నలనందసుతునకు నర్పించి యచటి
కలధౌతమణిమయాగారంబునందు
వరవైభవముల నవ్వసుదేవతనయుఁ
దిరమొందఁ బ్రేమఁ బ్రతిష్ఠఁ గావించి
జనులెల్ల వినుతింప సంబంధు వీడు
కొని కవిశేఖరు ల్గొలిచి యేతేర
పరకాలు మిగుల సంభావించి రంగ
పురమున కనిచె నప్పుడు పరాంతకుఁడు
శ్రీరంగమున కేగి శ్రితకల్పతరువు
శ్రీరంగనాథుని సేవించి యంత
గట్టిగాఁ దా మున్ను గరశాసనములను
గట్టించినట్టిప్రాకారముల్ చూచి
నలువార నల్లసేనపుజంగరాల
నెలమి నీసాలంబు లేను గట్టింతు
నని విన్నవించి యే నట్ల యీడేర్చి
తనయంబుఁ గరుణించి యప్పుడ యేను
గట్టిగా మంచిబంగరునీలమణులఁ
గట్టింతు ననిన యాగతిన యీడేర్తు
నీరీతి విన్నపం బేలకో యపుడ
శ్రీరంగనాయక సేవ లేనైతి

వని భక్తిపరవశుం డగుచు శోకింప
ననయంబు మెచ్చి శ్రీహరిరంగవిభుఁడు
పరకాలునకు వేగఁ బ్రత్యక్ష మగుచుఁ
బరమానురక్తితోఁ బలికె యోగీంద్ర!
పాటిమీఱిన భక్తిపరత నీకట్లు
కోట లెన్నినరాతికోటలేవయ్య!
వనజభవాదులు వాసవాదులును
దినకరచంద్రాదిదివిజులుం గూడి
నెట్టన జాతిమానికములు చరులఁ
గట్టిరాశుల నెన్ని గట్టి రన్నియును
నీవు గట్టించుమన్నియలసాలముల
కావగింజంతకు నవి యీడు రావు
అనుచుఁ గౌఁగిటఁ జేర్చ నరిదండధరుఁడు
వినతుఁడై వేవేలవిధములఁ బొగడి
తన సేయువిజయమంతయు నేర్పుతోడఁ
దనదేవి కెఱిఁగించి తదనంతరంబ
పరమేశుఁ డగురంగపతియనుమతిని
బరమవిరక్తుఁడై పత్నియుం దాను
నరిగి కురంగేశు నావాస మగుచుఁ
బరమపావన మైన భద్రాశ్రమమునఁ

దనడెందమున రంగధవుఁ బొడగాంచి
యనుపమయోగవిద్యాసక్తి నుండెఁ
గావున నెన్నిసంగతుల భాగవత
సేవ సేసినవాఁడె శ్రీవైష్ణవుండు
హరిపూజకంటె శ్రీహరిభక్తపూజ
పరికింప నధిక మెప్పాటున నైనఁ
బరకాలయోగి యాభద్రాశ్రమమున
నురుయోగసక్తుఁడై యుండె నేఁటికిని
మీఁటి లోకములెల్ల మెచ్చఁజేసినవి
యాఱుకైంకర్యంబు లాఱుకబ్బములు
నలమహాశ్రీవచనాభిధానమున
నలవడఁ గృతియందు నాదికావ్యంబు
తిరుపతులందు వర్తిలుభాగవతులె
యరయఁగాఁ గృతకృత్యు లనునర్థ మొదవ
నెనసి రెండవకృతి యిరువది పాట
†దనరార ఘటియించె దండకం బనఁగ
ఘనచిత్రకావ్యభాగస్థితి యనఁగ
ననువొందుచుండ మూడవప్రబంధంబు
తలఁప మహాతనుదళము లనంగ
నలరు నాలవకృతి యైదవకృతియు

† దనరారుదండకం బనఁగ ఘటించి

ధరణి నెన్నఁగ నీదుదండకం బనఁగ
గరమొప్పు వాల్లవకావ్యంబు చేసెఁ
బరమపావనమైన పరకాలుచరిత
ధర నెవ్వరేని తద్భక్తిపూర్వముగ
వినిన వ్రాసినఁ జదివిన నుతించినను
దనర వారలకుఁ బ్రత్యక్షమై శౌరి
యకలంకసిద్ధులు నభిమతార్థములు
సకలసిద్ధులుఁ గరస్థలి నుండు ననుచు
నలమేలుమంగకు నమలాంతరంగ
కలిసిలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికి సరోముఖ్యభక్త సంతతికి
సంకీంతంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమతాళ్వపాకన్నయార్య
తనయ తిమ్మార్యనందనరత్నగుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశదత్త
మకరకుండలయుగ్మ మండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావఘూలబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
కృతమైన పరమయోగివిలాసకృతిని
నతులితంబుగ సప్తమాశ్వాస మయ్యె.

# పరమయోగివిలాసము.

## అష్టమాశ్వాసము.



హైమసరోజాంగ! యలమేలుమంగ!
జీమూతసంకాశ శ్రీవేంకటేశ!
మునిశారికాసారముఖ్యభక్తాళి!
వనమాలి! యసిధారు వరదానశీలి!
జలధికన్యాముఖ్యజలజలోచనలఁ
గలసి విచిత్రవైఖరులు దీపింప
సంతతోత్సవములు జరుగ శ్రీరంగ
కాంతుఁ డెంతయును బ్రకాశించుచుండె
నలపరాంకుశముఖ్యు లగుయోగివరులు
పలికిన దివ్యప్రబంధరత్నములు
వినుచువారల గారవింపుచు భక్త
జనపోషణైకదక్షత నుండె నంత
విమలమై యొప్పు కావేరిచెంగటను
రమణమై వీరనారాయణం బనఁగఁ

గ్రామ మొప్పును శ్రుతిగ్రామప్రవీణు
లామహానగరంబునందు నుండుమాకు
వీరనారాయణవిభుఁ డనుపేరి
శౌరితనూజుఁ డచ్చటఁ జెన్నుమిగులు
నమృతసంకాశంబు లైనశ్లోయములఁ
గౌమరారుసరసి సూరిఁ ఱంగట వెలయుఁ
బరమభాగవతులు పరతత్త్వవిదులు
కరుణాపయోనిధుల్ కమనీయమతులు
నగణితవేదవేదాంగపారగులు
జగతీసురల్ చతుస్సహస్రసంఖ్య
నలవడియుండుదు రందుఁ బెంపార
నలరు[illegible] బాకులంబునను
అనఘుఁ డీశ్వరభట్టుఁ డనువిష్ణుప్రునకు
ననుపమశౌరి సేనాధినాయకుని
యాదిమమంత్రి గజాస్యునియంశ
నాదటం బొడమి యోగసత్తుఁ డగుచు
ననుపమ *గానవిద్యా †విచక్షణుండు
మునుకొని శ్రీనాథముని యనఁబరఁగి
తనసేయుగీతవిద్యకు నారదుండు
తనువున శుభ్రతం దాల్చియుండఁగను

* రాగ † పరిభావమున

అఖిలకళావేత్తయై సొంపు మిగిలి
యఖిలేశు యోగవిద్యాప్రభావమునఁ
దనరుధ్యానమునఁ బ్రత్యక్షంబ చేరి
కొని దండమున నిడికొని యటమీఁద
నరయంగఁ బృశ్నిగర్భాఖ్యుఁ డైనట్టి
వరపుత్త్రు శ్రీశ్వాసాహ్వాయమూని గాంచె
నతఁడు దానును గూడి యష్టాంగయోగ
చతురకేళీవిలాసములఁ దేలింప
సారసమందిరాసహితుఁ డైనట్టి
నారాయణుండు ముందర వచ్చి నిల్చి
కనుఁగొని యొకకొంతకాలంబు జనఁగఁ
దనయుండు దాను నెంతయుఁ బ్రేమతోడ
నావీరనారాయణాధీశుఁ డైన
శ్రీపరునను మతి క్షితిమీఁదఁ గలుగు
హరిమందిరంబులు నచటితీర్థములుఁ
గరముగ్గి సేవింపఁగాఁ గోరి కదలి
దనుజారిసదనతీర్థముల మూఁడేసి
దినములు నిలిచి వర్తించుచు నచటఁ
జెలువొందుహరిమూర్తుల సేవించికొనుచుఁ
జెలఁగి భూమికిఁ బ్రదక్షిణము గావించి

కనకసారసజాత కమలాప్తజాతఁ
గనుఁగొని తత్తటాంగణసీమయందుఁ
బొలుచుగోవర్ధనపురి బాలకృష్ణు
జలజాక్షు దేవకిచఁటిబిడ్డనిని
సేవించి భక్తి నాశ్రీకృష్ణుపూజఁ
గావించుకొని పెక్కు కాల మున్నంత
నరసఖుం డగువీరనారాయణేశ
హరి వారితో విరహము సైఁపలేక
కలలోన వచ్చి యక్కడ నున్న మాని
తిలకుల ననుజూడఁ దిరిగి రమ్మనిన
రమణతో వీరనారాయణుపురికిఁ
గ్రమమున నయ్యోగిరాజు లేతెంచి
యసమానులై యుండి రటమీఁద కుసుక
వసియించి యుండెడి వైష్ణవోత్తములు
అటఁ గొంద ఱేతెంచి యలపరాంతకుని
పటుతరదివ్యప్రబంధంబులోనఁ
బదిపాట వినుపింపఁ బదివేలగతుల
ముదమంది యానాథముని వారిఁ జూచి
యమృతపానోత్కృష్టమైన యీకావ్య
మమర నంతయు మీర లానతీవలయు

నాఫుఁ డీకృతి యోగినాయకోత్తముఁడు
కావించి కడుఁ బెక్కుకాలంబు సనియోఁ
బరికింపఁగా నీప్రబంధంబు ముక్తి
కరమైనకతన లోకములోన మునుపు
యంతయుం జదివి నీయంతమాత్రంబె
యొంతయు ముక్తికి నేగుచుండుదురు
కావున ఖల మయ్యెఁ గడమవృత్తములు
రావయ్యె ననిన నరసి నాథమౌని
కురుకకు నరిగి యాకురుకేశుఁ గాంచి
వరభక్తిని దురవోవనిచింతక్రింద
నెలకొని శఠకోపనిజమూర్తిఁ గాన
వలయునుపాయంబు వడుసఁ జింతించి
యెలమితో మధురకవీంద్రుండు మున్ను
పలికిన దివ్యప్రబంధ మంతయును
దాలిమితోడ నాదటం బదిరెండు
వేలు చందమున నావృత్తి గావింప
దాకొన్న *కరుణలో దరువులు వెట్ట
వైకుంఠమునుండి వచ్చి శఠారి
యతనికిఁ బ్రత్యక్ష మయ్యె నావేళ
నతిభక్తిరతుఁడై యానాథమౌని

* గతులతో

యానందబాష్పంబు లడర శఠారి
మానీంద్రపాదపద్మములపై వ్రాలి
వినుతింప నయ్యోగివిభుఁడు మోదించి
యనఘ నీవలసినయర్థంబు వేఁడు
మన విని ముకుళితహస్తుఁడై నాథ
ముని పల్కె శఠకోపమునివర్యుతోడ
భవదీయదివ్యప్రబంధరత్నములు
నవముగా నీదాసునకుఁ బ్రసాదించి
యిది దొరఁకొని దేవ యీ ప్రబంధములు
జనువువారలకు విచారింప నెంత
యాయువు గలిగిన యన్నాళ్ళు జగతిఁ
బాయకయుండ నాపై ముక్తి గలుగ
వరముఁ బ్రసాదింప వలయు నావుడును
బరికింప నయ్యోగిపతి సంతసమున
జలజాక్షు నిజమానసంబున నిల్పి
పొలుపార ద్వయమంత్రపూతంబు గాఁగఁ
దనదుదివ్యప్రబంధంబు లన్నియును
నొనర సార్థమ్ముగా నుపదేశ మొసఁగి
యావరంబును నిచ్చి యనురాగ మెసఁగ
నావేళఁ దనయున్నయచటికి నరిగె

నాథమునినాథుఁడ చింతక్రింద
నానవ్యకావ్యంబు లామోద మెసఁగ
వెలసి తానును దదావృత్తి గావింప
నలవీరనారాయణాధీశుఁ డైన
శౌరి స్వప్నంబునఁ జనుదెంచి మనము
గూరిమితో జోడుగూడి యుద్దలము
నావృత్తిసేయుద మటకు రమ్మనిన
వేవేగ మరలి యావీటికి నరిగి
యాందేవుతోఁగూడ నాప్రబంధములు
సాదరభావుఁడై యావృత్తిఁ జేసి
దివిజగానమునఁ దద్దివ్యప్రబంధ
నివహంబు తాళమానితముగాఁ బాడి
తనశిష్యవరుల కందఱకు నాకృతులు
నొనర నవ్విధమున నుపదేశ మొసఁగె
నటుగాన నీద్రావిడాగమాంతములు
పటుగతిఁ దద్వంశపాలురచేత
వినుచుండు నెపుడు శ్రీవేంకటేశ్వరుఁడు
ననసేల వేయును నట నొక్కనాఁడు
మతివిశేషంబున మానవగాన
వతియ మానవగానవతియుఁ జర్చించి

తమగానవిద్యలతారతమ్యములు
క్రమమేరుపడఁ జోళకాంతుముందరికిఁ
జనుదెంచి గానంబు సవరింపునపుడు
విని సభవారెల్ల విబుధగానంబు
తెలియక మనుజప్రతేతిగానంబు
సలిపెడువాని మెచ్చకయున్నఁ గనలి
దేవగానము సేయుతెఱఁగు వేవేగ
భూవిభుతోడ నప్పుడు విన్నవించెఁ
దనవిద్య యెఱిఁగిన ధరలోన నాథ
ముని దక్కఁగాఁ బరము నెఱుఁగుదురె.
యన విని భూనాథుఁ డానాథమౌని
వినయమేర్పడఁగ రావించి తా నరిగి
యనుపమసింహాసనాసీనుఁ జేసి
యనిమిషవరులపాటలందలిమేలు
దేవర విని వారు దేర్పంగవలయు
నావుడు విని మౌనినాయకోత్తముఁడు
వెఱయ వారలపాట విని దేవగీతి
సలిపెడి వాని మెచ్చఁగఁజేయ నపుడు
సామాజికులు కొంత సందేహపడిన
నామాట విని నవ్వి యానాథమౌని

యామొడఁ బాచలోహాం బైనయట్టి
వేయుతాళములు వేవేగఁ దెప్పించి
యామెడ నొక్కమాట న్నితాళములు
వాయించు మనుచు నావాద మాలించి
తలకొని యొక్కొక్కతాళమిన్నేసి
పలములటంచుఁ జొప్పడఁగఁ *జెప్పటయు
సరియైన నరుదంది సభ్యులతోడ
ధరణీవిభుండు పాదములకు నెరగి
పరమవస్తువుల సంభావింపఁ దనకు
పురమున కిరుదెంచి పొలుపు దెప్పించి
తగ జయత్సేనాంశధారియై యనఘుఁ
డగుపుండరీకాక్షుఁ డనుశిష్యునకును
సరవి కాళాంశసంజాతుఁడై భక్తి
నరుదారు కురుకేశుఁ డనుశిష్యునకును
ద్వయము దివ్యప్రబంధములు శాస్త్రముల
నయకరయోగవిద్యయును సాంగముగ
నేపార నుపదేశ మిచ్చి నిచ్చటయు
నాపుండరీకాక్షుఁ డలఘువైభవుఁడు
తనశిష్యసమితికిం దత్ప్రబాధములు
ననుపమగానవిద్యయుఁ బ్రసాదించి

---

*దెప్పించి

యంతరసాంతరహరి యైనట్టి
కంతుతండ్రిని గోపికామనోహరుని
యన్నాథముని మది ధ్యానంబు సేయు
చున్నయత్తఱిఁ జోళుఁడొకనాఁడు కూర్మి
తనపట్టమహిషులుఁ దాను నేతెంచి
ననవిల్తుఁగురువీరనారాయణేశు
సేవించి పోవ నాక్షితిపాలవరుని
భావించి గోపికాభామలతోడ
నరుదెంచినట్టి శ్రీహరి యంచుఁ దలఁపఁ
బరువడి నాభూమిపాలుని వెంటఁ
బురముఁ జొచ్చినదాఁకఁ బోవ డెందముల
నరుదంద నిజశిష్యు లామూర్తిఁ జేరి
దేవ! మీ రిటకు నేతెంచినకార్య
మేమెర వది యానతిమ్ము నావుండు
నావల్లకీకమలానవాసహితుఁ
డైవచ్చు శ్రీకృష్ణుఁ డని విచారించి
వచ్చితి నన శిష్యవరులు మోదించి
రచ్చోట వీడ్కొని యానాథమౌని
మరలి వేగమె నిజమందిరంబునకు
నరుదెంచి సకలశిష్యావృతుం డగుచు

నీరీతి నేఁడునూ ఱేఁడులు గడపి
కూరిమిఁ దనశిష్యకులము నీక్షించి
ప్రీతిగా శ్రీపుండరీకాక్షుఁ బిలిచి
యాతత ద్రవిడ వేదాంత శాస్త్రముల
వసుధ నెల్లెడలఁ బ్రవర్తింపు మనుచుఁ
గిసలయాధరుఁగురుకేశతారాఖ్యుఁ
గనుఁగొని యోగమార్గము నీవు పూని
యనయ మేమరక తదాసక్తి నుండు
మనికు మారునిఁ జూచి యనియె వెండియును
ఘనతరుండై నీదుగర్భాంబునందు
సరవి సింహాసనాంశజుఁడైనయట్టి
యురుతరయోగీంద్రుఁ డుదయింపఁగలఁడు
అతనికి యామునాహ్వయ ముడు మనుచు
నతిభక్తిఁ బుండరీకాక్షు సన్మాని
పలకురుకేశతారాఖ్యునిం బిలిచి
యొలమి మీరిరువురు నిటమీఁదఁ బొడము
తనపౌత్రునకుఁ గులోత్తమునకే మునుప
నొనర మీ రుపదేశ మొసఁగినయట్టి
యనుపమసకలరహస్యార్థవితతి
యును యోగమును గూడ నుపదేశ మిందు

అని వారి సయమించి యట నొక్కనాఁడు
వనవిల్తుజనకు నన్నలినలోచనుని
సేవించి గానంబు సేయుచునున్న
నావేళ నిజపుత్త్రి యరిమురి వచ్చి
వినవె యిద్దఱు పెద్దవిండులఁ బూని
వనితతోఁ గూడ క్రేవల నొక్కక్రోఁతిఁ
బాయకుండఁగఁ దాట బఁధించిపట్టి
యీయెడ మనయింటి కేతెంచి రనిన
వామానినిమె సీత యాయిరువురును
రామసౌమిత్రులు లారయ వానరంబె
హనుమంతుఁ డనుచు నిజావాసమునకుఁ
జనుదెంచి వారి వచ్చుటఁ గనుంగొనక
వెదకి వారలు వేరి వేరి యటంచుఁ
గొదుకక యడుగుచుఁ గొంతద వ్వరిగి
యొకకొందఱను గాంచి యొక్కపూఁబోఁడి
యొకయిద్దఱును గ్రోఁతియును గూడి యింత
నిపుడు వచ్చిరి గానరే యన్న వార
లపు డెవ్వరిని గాన మన్న మోహించె
నదియొకారణముగ నటఁ బరంధాము
పదపట్టబద్ధుఁడై పరఁగె నమ్మౌని

యది విని తనుజాతుఁ డాశిష్యవరులు
గుదిగొన్నవగతోడ గుబ్బళ వచ్చి
యానాథమునివిగ్రహంబు సేవించి
యానాథసుతునిచే నాశిష్యవరులు
మెలుపుమీఱఁగ బ్రహ్మమేధసంస్కార
మలవరింపించి పర్యాయంబుతోడ
నుచితకృత్యంబుల నొనరఁ జేయించి
రచలుఁడై కురుకేశుఁ డనుశిష్యుఁ డంత
గురుని సంస్కారంబు గొలిపినచోట
నిరవొంద నొకచిన్నయిల్లు గావించి
బాగుగా గురుపాదపద్మముల్ తలఁచి
యోగవిద్యాభ్యాస మొనరింపుచుండె
నాపుండరీకాక్షుఁ డానాథయోగి
శ్రీపాద మాశ్రయించినవారి నెల్ల
నొనఁగూర్చుకొని దర్శనోద్ధరణంబు
నొనరింపుచుండె సర్వోపచారములు
పనుపడఁజేయఁ బాల్పడి కుముదాక్షుఁ
డనుశూరియంశంబునం దుదయించి
శ్రీరామమిశ్రాఖ్యఁ జెలఁగుశిష్యునకు
గారవం బెసఁగ నాగమరహస్యములు

కృపచేసి యటమీఁద నీశ్వరమునికి
నపరిమితౌదార్యుఁ డగుకుమారకుఁడు
యామునేయుం డనునతఁ డుదయించు
నామహాత్మునకు నేఁ ననుపొంద నీకు
సవరించినట్టి యాసర్వార్థములును
వివరంబుగా నీవు వేసట లేక
యనువర్తనము సేసియైన నీవొసఁగు
మన విని రామమిశ్రాహ్వయుం డంత
నలయీశ్వరమునికి నాత్మజుం డెపుడు
గలుగునో యని కోరికలు గోరుకొనుచుఁ
దనగురుఁ డొసఁగిన తత్త్వరహస్య
మనుభవింపుచు నుండె ననురక్తితోడ
నటమీఁద సింహాముఖాంశసంభవుఁడు
పటుసత్త్వమయుఁడు శ్రీపతి కృపాయుతుఁడు
నీశ్వరముని కుదయించి తా శాశ్వ
తైశ్వర్యవంతుఁడై యామునాహ్వయము
నొనరంగ ధయించి యుపనీతుఁ డగుచు
జనకుంను వేదంబు చదువంగ నిడినఁ
జదువుచుం దొలినాఁడు చదివించుచదువె
చదువుమటన్న నాచార్యు నవ్వుచును

జదువక యింటికిం జదువేర జనకుఁ
డదలించి చదువలేదా యని యనిన
నిన్నఁ జెప్పినయదే నేఁడుఁ జెప్పెదిని
యన్న! నే నటఁ బోవ నన్న నాతండ్రి!
అట్లైన నిన్న నీ కాతండు చెప్పి
నట్టివేదము వచ్చునా చెప్పు మనినఁ
గ్రన్నన నింతయుం గడమ లేకుండఁ
జెన్నార నంతయుఁ జెప్పఁ జెప్పుటయు
నని తండ్రి మిక్కిలి వెఱఁ గందుకొనుచుఁ
దనయుని కఖిలవేదములుఁ జెప్పించి
పరిణయం బొనరించి పటుతరబుద్ధి
సరవి శాస్త్రంబులు చదివింపవలసి
కోరి మహాభాష్యగురుఁ డనుపేరి
సూరిసన్నిధిఁ గూర్మి మూలి శాస్త్రములు
చదువుచుండఁగఁ జోళజనవరేణ్యునకు
విదితశాస్త్రంబులు వివరించుకొనుచు
హితుఁడైన నిజపురోహితుఁడైన సూరి
ధృతి తనతోడ వాదింపంగలేక
యున్న విద్వాంసుల నొండొండఁ బట్టి
పన్నుఁ గైకొనుచుఁ దద్భాష్యదేశికుని

పైపన్నఁ బెమ్మని భటులచే బిరుద
దీపితం బైనపత్రికఁ బంపుటయును
నది చూచుకొనుచు మహాభాష్యగురుఁడు
కినుకుచు నెంతయు ఖిన్నుఁడైయుండె
నాయెడం జనుదెంచి యామునసూరి
యాయనచే పత్ర మలవోకఁ జూచి
పెలుచ గోపించి యాబిరుదపత్రంబు
బలిమిఁ గైకొని చించి పాఱంగవైచి
తనదైనబిరుదుపత్రమున లిఖించి
పనివడి వారిచేఁ బంపెఁ బంపుటయు
నది చూచి కోపించి యాపురోహితుఁడు
మదమేది చోళునిముందరం బెట్టి
యామాట లెఱిఁగింప నరుదంది రాజు
యామునేయుని వేగ నటకు రప్పించి
యమరంగ సప్తపూర్వాశ్రమలనడుమ
హిమసేతువులలోన నిద్ధరలోన
వదలనికడకతో వాదించి నన్ను
నదిరెడువిద్వాంసుఁ డెవ్వఁడు లేఁడు
అనునర్థ మొదవఁ బత్రాలంబనంబు
జననాథు వాకిట నవరించి యపుడు

హితమతి హితపురోహితయుతుం డైన
క్షితినాథుకడకు వేంచేసినఁ జూచి
యీవిధి బిరుదంబు లెన్నినవాఁడ
వీవేళఁ దనపురోహితునితో నీవు
వాదించి గెలువంగవలయు నాపుఁడును
మోదించియున్న యామునుజూచి నృపతి
యావేళ విద్వాంసు లైనసభ్యులను
రావించి పట్టపురాణితోఁ గూడ
నరుదార సింహాసనారూఢుఁ డగుచు
వరుస నాయిరువుర వాదింపుఁ డనిన
యామునేయుని జూచి యాపట్టమహిషి
యామహీపతితోడ ననియె నీఘనుఁడు
గెలుచు నవశ్యంబు గెలువకయున్నఁ
గలయ నీనగరికుక్కలకెల్ల వండి
పెట్టెద ననిన నాబింబోష్ఠిఁ జూచి
గట్టిగా ననియె భూకాంతుఁ డవ్వేళ
నీమెయిఁ దనపురోహితుఁ డోడెనేని
సామిత్తు నాదురాజ్యములోన నీకు
నని ప్రతిజ్ఞలు చేసి రాపురోహితుఁడు
మునుకొని యీశ్వరమునిసూనుఁ బలికె

నగపడి నీవు గావన్నవి యెల్ల
నగునని నిలిపెద నదియునుం గాక
యీవల నీ వగునన్నవి యెల్ల
కావని నిలుపంగఁగలవాఁడ నిపుడు
కాకున్న నీపాదుకను దననోరు
వేకొని వైవ మీవిభుఁడు వీక్షింప
నన విని తప్పకు మని యామునేయుఁ
డనియె నిన్ను నుగన్నయంబ యవంధ్య
యౌన్నఁ బతివ్రత యీపట్టమహిషి
పన్నిచూచిన సార్వభౌముఁ డీరాజు
అని యుత్తరము లిందు కనువొందఁ జెప్పు
మని వాని నోడించి యంతటం బోక
యలఘుశాస్త్రోక్తుల నాపురోహితుని
గెలిచిన మెచ్చి యాక్షితినాథుదేవి
యలయామునేయుఁ జయ్యాన నెత్తుకొనుచు
వలనొప్ప నన్నేల వచ్చితో తండ్రి!
యనియె నాకతమున నాళువందారు
లను పేరు కలిగె నయ్యామునాఖ్యునకు
నాపురోహితుఁ జూచి యామూనాచార్యుఁ
డేపార గెలిచితి నిన్ను నే నిపుడు

పట్టి నీనోరు నాపాదుక చేతఁ
గొట్టుమంటివి నిన్నుఁ గొట్ట నేమిటికి
నినుఁ గాఁడి మెచ్చితి నృపపురోహితుఁడ
వని యన్న సభవార లగ్గించి రతని
నామహీపతి కడు నచ్చెరు వంది
యామునాచార్యున కవనతుం డగుచుఁ
దనపురోహితుఁ డెచ్చి తచ్ఛిష్యుఁ గాఁగ
నొనరించి యెంతయు నుపచరింపు మను
మును తనదేవి కిమ్మాల నిత్తు ననుచుఁ
దనసీమలోన నర్ధము పంచి యొసఁగ
నాదేవి తనసీమ యామునేయునకు
నాదట నిచ్చె నెయ్యమునఁ బూజించి
యంపినం గ్రమ్మఱి యామునేయుండు
చనుదెంచి నిజనివాసంబున నిలిచి
యాలేమ యొసఁగినయర్ధరాజ్యంబు
నేలుచు నుండె ననేకవైఖరుల
నీరీతి నంతయు నెఱిఁగి మోదించి
శ్రీరామమిశ్రుఁ డంచితభక్తితోడ
యామునేయునకు రహస్యార్థవితతి
తా నుపదేశింపఁ దలఁచి వేంచేసి

యామప్రార్శ్యగంబునందుఁ బొపొందు
యామునార్యునికొలు వబ్బకయున్న
నీతనిం బొడఁగాన నెద్ది యుపాయ
మీతఱి నని తనయిచ్ఛ నూహించి
యతనిపాచకులతో యామునేయునకు
నిత్యమైనశాకంబు లెవ్వి నావుండు
నలరి మిక్కిలిప్రియం బైనది ముండ్ల
ములిచితకూర నామోదించి యతఁడు
చని వారిచేతి కాశాకంబు వెదకి
దినదినంబును గోసి తెచ్చి యిచ్చుచును
నెమ్మి నీగతి నాఱునెలలు పాటించి
కిమ్ముల మఱియును గేలి లేకున్న
నాకు నాగురుని యానతి ద్రోయరాదు
చేకొని యిఁక నేమి సేయుదు ననుచు
ననయంబుఁ దాఁ దెచ్చునట్టిశాకంబు
కొనిరాకయుండె నక్కాని యొక్కనాఁడు
యామునేయాచార్యుఁ డట యారగింప
నామనోహరశాక మపుడు లేకున్న
లాలిత్యం బైన యలర్కశాకంబు
నేల కావింప రిమ్యేడ నన్న వారు

వనిశంబు నొకవృద్ధుఁ డగువైష్ణవుండు
కొనివచ్చు నేఁడు దా కొనిరాకపోయె
సరవిమై నాలుమాసములనుండియును
గరమర్థిఁ దెచ్చు నీగతి శాక మనిన
నతఁ డెవ్వఁ డేటికి నరుదెంచె నతని
గుతుకంబుతోఁ దోడుకొని రమ్ము రేపు
అన విని వాఁ డేగి యారామమునకుఁ
గని మఱునాఁడు వేగంబె తోతేరఁ
బదముల కెరఁగి యాపరమభాగవతు
మది యిగురొత్తఁ బ్రేమమున నిట్లనియె
నీ వెయి దేవర యిటకు వేంచేయు
టేమి కారణము నా కెఱిఁగింపు మనిన
ననువొంద మీ వార లర్థనిక్షేప
మునిచిరి నాయొద్ద నున్నది నీకుఁ
దెలిపెద నని వచ్చితిని గాని యొండు
వలనుమీఱఁగఁ గోరి వచ్చుట లేదు
అనిన నామునివర్యుఁ డానతి మ్మనిన
దినదినక్రమమునఁ దేటపడంగ
నన్నియు శ్రీగీత లానతిచ్చుటయుఁ
జెన్నార విని మదిఁ జిగురించుకూర్మి

నే విష్ణుఁ బొందుట కెద్ది యుపాయ
మీవేళ మీ రానతిండు నావుడును
బలుమఱుఁ బొంగి ప్రపత్తిమార్గంబుఁ
దెలిపిన యామునదేశికుం డపుడు
పరమవిరక్తిఁ బొప్పడె; రామమిశ్రి
గురుఁడు యామును దోడుకొని సంతసమున
శ్రీరంగమునకు వేంచేసి యాదేవు
శ్రీరంగనాథుని సేవింపఁ జేసి
యీమూర్తి మీతాత లిడిననిక్షేప
మేమి యాగుఱుతుగా నెఱుఁగుకొ మ్మనుచు
నపుడు ద్వయంబు రహస్యార్థములను
నుపదేశ మొసఁగె నయ్యారుసత్త్వనిధియు
నంత సన్యాసియై యచ్చట రంగ
కాంతుని హృదయసంగతుని గావించి
సిద్ధార్థుఁడై జ్ఞానసిద్ధియు నాత్మ
సిద్ధియు నీశ్వరసిద్ధియు నన(గఁ
జెలువారుకృతులను శ్రీహరిస్తోత్ర
ములును శ్రీగీతార్థములసంగ్రహంబు
భూగురునుతమైన పురుషనిర్ణయము
నాగమప్రమితియు నన్ప్రబంధములు

వివరించి కుముదాక్షవిమలాంశ మగుచు
నరయ మహాపూర్ణుఁ డగుశిష్యవరుఁడు
నలశంఖకర్ణునియంశమై మిగులఁ
జెలువార రంగికుశీలవాఖ్యుండు
నాయమానవమూర్తియై హస్తిశైల
నాయకుతోడ నెంతయు మాటలాడు
స్థిరభక్తిపరతుండు తిరుకచ్చినంబి
కరయంగ నలవామనాంశ మనంగఁ
జెలువారుచుండు గోష్ఠిపురీశుఁడును
మొదలైన నిజశిష్యముఖుల కందఱకు
ముదమున సర్వార్థములుఁ బ్రసాదించి
యలవిమీఱినయట్టి యఖిలశాస్త్రములుఁ
జెలఁగి వ్యాఖ్యానంబు సేయుచు న్నడల
నలరామమిశ్రుఁ డాయామునార్యునకుఁ
బలికె నేకతమునఁ బ్రమదంబుతోడ
మును నాథమునిశిష్యముఖుల కందఱకు
ననువొంద సకలరహస్యార్థములును
నుపదేశమొనరించి యోగరహస్య
మపు డిచ్చె కురుభావ లక్ష్మనిం బిలిచి
యాదివ్యయోగవిద్యారహస్యంబు

తే. దెవ్వరికి నొకలేశమంతయును
గరమర్థి నతఁడు గంగాహరనగరి
నిరుపమతద్యోగనిరతి నున్నాఁడు
అది నీవు సాధింపు మటఁ బోయి యనిన
ముదమంది యామునముని వేగ వెడలి
యొకజీర్ణవసతిలో యోగసమాధి
నకలంకగతినున్న యయ్యోగికడకుఁ
జని యామునీంద్రునిశ్చలయోగభావ
మునకు విఘ్నము సేయ మొగమోడి యంతఁ
దనశిష్యులును దాను దద్భాగమునకు
వెనుకటిదెస మౌనవృత్తి నుండుటయు
గోరియిప్పుడు పొట్టకులజాతులైన
వారెవ్వరైనఁ గ్రేవల నున్నవారె
యనుచు నయ్యోగీంద్రుఁ డానతి యొసఁగ
విని యామునేయుఁడు వేవేగ వచ్చి
వినతుఁడై హస్తారవిందముల్ మోడ్చి
యనియె నచ్చెరువంది యాయోగితోడఁ
బనిఁబూని మఱుగువం బని వినియున్న
నను నీవు గను టెట్లు నా కానతీయు
మనిన నయ్యోగీంద్రుఁ డనియె నాతనికిఁ

గనుఁగవ బాష్పాంబుకణములు దొరఁగ
సిరికూర్మిఁ గౌఁగిటఁ జేర్చుటకంటెఁ
బరమభోగ్యముగ నాపయిఁ గరుణించి
నాసేయుయోగమునకుఁ జిక్కియున్న
శ్రీసతీశుఁడు సేఁడు చెలరేఁగి నిక్కి
మూపులపైఁ గరముల నూఁది వెనుక
చూపుచునుండంగఁ జూచి యే నిప్పు
డరయంగ నీకృప నలనాథమౌని
వరకులమునఁ గల్గువారిపైఁ గాని
లేదసి తెలిసి పిల్చితినన్న మిగుల
మోదించి యామునముని సాగి మ్రొక్కి
యిరవొంద దేవర యీయోగవిద్య
సరవిమై నాకుఁ బ్రసాదింపు మనిన
నురుతరం బైన యాయోగంబు తనదు
చరమకాలమునఁ బ్రసాదింతు ననుచు
నాకాల మావేళ యాముహూర్తంబు
చేకొని యొకచిన్నచీటిపై వ్రాసి
యిచ్చి నీ వావేళ కేతెంచితేని
యిచ్చెదఁ గ్రమమున నీయోగవిద్య
యని పనుపుటయును యాముసేయుండు

చని రంగవిభునియాస్థానంబులోనఁ
గొలువున్నతఱి శఠకోపప్రబంధ
మలనాథమునివంశుఁ డైనగాయకుఁడు
ఒగి వినిపింపుచునుండినయంత
నగరేశు శ్రీపద్మనాభుని వేగ
సేవింపుఁడని తమ్ము చేజేతఁ జూపి
యావేళ బలుమాఱు నభినయించుటయు
నది గని రంగేశుననుమతి యనుచు
మదిలోన యామునవరాని చింతించి
వేవేగ నాజేవువీటికి నరిగి
సేవించి యచట వేంచేసియున్నపుడు
తమకు నాకురు కేశు తాతముందరను
బ్రమదంబుతో నిచ్చుపత్రికఁ జూపి
యావరాని ముక్తికి నరిగెడువేళ
యామాసమును నాడియైన *బొంకుచును
గటకటా యొకపుప్పకము గల్గెనేని
యటపోవవచ్చుఁగా యని యట్ల వగచి
తనశిష్యులును దాను దడయక మగుడి
చనుదెంచి రంగవాసంబున నిల్చి
శ్రీవేంకటాద్రిగోష్ఠీపురస్థలిని

* పొక్కు

యీవిధి నొప్పు సర్వేశుధామముల
స్థాపితపటుజయస్తంభంబు లనఁగ
నేపారుశిష్యుల సిద్ధవైభవులఁ
ద్రిదశవందితుఁడైన తిరుమలనంబి
మొదలైన శిష్యుల మునుకొనినిల్పి
యిటమీఁదఁ దమమతం బీడేర్చునట్టి
పటుతరశిష్యుఁ డిప్పుడునం గల్గు
ననుచు వేదాంతవిద్యాలోలుఁ డగుచు
ఘనతరకీర్తిసంకలితుఁడై యుండఁ
దిలకించుతుండీరదేశంబునందుఁ
బొలుపుమించిన మహాపూదూరనంగ
రాజిల్లు నగ్రహారంబు ననాగ
రాజాంశజుఁడు లోకరక్షణశాలి
భూసురకులజాతభూషణం బైన
నాసురి కేశవాహ్వయద్విజవరకు
నలలితచిత్రమాసంబున నార్ద్ర
జలజాప్తకోటితేజము నగ్గలించి
జనియించి రామానుజఖ్యాతిఁ దాల్చి
పెనుపొందఁ గ్రమమునం బెరుఁగుచు నుండె
జనకుండు పంచసంస్కారముల్ చేసి

ననుపార నుపనయనంబు నొనర్చి
యఖిలవేదాధ్యక్షుఁ డైననందనుని
నఖిలాగమంబులు నటుఁ జదివించి
వరవైభవముల వివాహంబు సేసి
పరమానురాగసంభరితుఁడై యుండె
నామహాయోగి రామానుజాఖ్యుండు
తా మహాశాస్త్రవిద్యల నెఱింగియును
దేవకీసుతుఁడు సాందీపునియొద్ద
వేవచ్చి తాఁ జదివినరీతి నంతఁ
గాంచికినరిగి యాకరిరాజవరదుఁ
గాంచనాంబరుని శ్రీకరుని సేవించి
వరుస నచ్చో యాదవప్రకాశాఖ్యుఁ
బరఁగిన సన్యాసికజ్జ నిచ్చలును
విదితమై యొప్పెడు వేదాంతవిద్య
చదువుచో యాదవసంయమీశ్వరుఁడు
అలఘుశిష్యులకు వేదాంతశాస్త్రంబు
దెలిఁగి వ్యాఖ్యానంబు సేయుచు నుండె
నాతఁడె నద్వైత మనువదించుటయు
ద్వైతయుక్తుల వానిఁ దరలఁగొట్టుచును
అతనితోఁ జదివినయట్లుండఁ దూదకు

నతనికిఁ బ్రతివాది యగుచు వాదించు
నొకర నాసంయమియొద్ద నీరీతిఁ
బనివడి వేదాంతపఠన సేయుంగ
నిరతంబు గాంచిలో నెలకొనియున్న
పరమభాగవతులు భక్తిమీఱంగ
శ్రీరంగమునను వేంచేసి పల్కాఱు
నారూఢి రామానుజార్యుఁ డొక్కరుఁడు
ననిశంబు యాదవుం డనుయతియొద్ద
ననువొంద వేదాంత మధికరింపుచును
అతని యద్వైతవాక్యంబులనెల్ల
నతులితద్వైతవాక్యములఁ గొట్టుచును
అచ్చట నున్నవాఁ డన విని పొంగి
మచ్చిక యామునమౌనిశేఖరుఁడు
నతనిఁ గటాక్షింప నాత్మఁ జింతించి
బ్రతిలేని శిష్యపారంబు సేవింపఁ
గాంచి కేతెంచి యక్కడనున్న శిష్యుఁ
గాంచీశుతోఁగూడఁ గదిసి మాటాడు
నయవేది తిరుకచ్చినంబినిం బిలిచి
దయతోడ నతనికైదండ గాఁబట్టి
దేవనాథుని మహాదేవుని నంత
సేవించి యటఁ బ్రదక్షిణము వచ్చుచును

వలనొప్ప శేషనివాస వల్మీక
మలవడ సేవించి యాచెంత నిలిచి
తనశిష్యవరులును దాను యాదవపుఁడు
చనుదెంచి యాహస్తిశైలవాసునకు
వలచుట్టి రాఁగ యాళ్వందారు వారిఁ
దెలియంగఁ గన్గొని తిరుకచ్చినంబి
కని వారిలోన లక్షణసూరిపేః
ఘనుఁ డిట్టివంటి యాకారంబు వాఁడు
అన విని యట్ల వారందఱకంచె
ఘనమైనవాఁడు చక్కనివాఁడు మిగుల
నించుబాహువులవాఁ డెఱ్ఱనివాఁడు
కాంచనాంబరుభుక్తి గలిగినవాఁడు
నలవాఁడౌ యనఁ గాంచి యామునాచార్యుఁ
డలలక్షణాఖ్యు దయాదృష్టిఁ జూచి
తావకదర్శనోద్ధారకుం డితఁడు
గావలయును దేవ కరిరాజవరద
యనుచుఁ బ్రార్థించి యాహస్తిశైలేంద్రు
మనసిజగురుని బ్రేమమున సేవించి
తిరముగా మది మెచ్చి తిరుకచ్చినంబి
కరిరాజవరదు కైంకర్యార్థ మచల

నునిచి శిష్యులంతోడ నొనఁగూడి మగుడి
చనియె శ్రీరంగవాసమునకు నంత
నాదేవుఁ డఖిలశిష్యావృతుం డగుచు
సాదరుం డగుచు వ్యాఖ్యానంబు సేయ
నాతఁడే చోళనాయకుని హితాత్మ
జాతుని బ్రహ్మరాక్షసుఁ డావహింప
మంత్రవాదులు మహామహులు నేతెంచి
మంత్రయంత్రములఁ బల్మాఱు గాసించి
విడిపింపలేక నివ్వెఱపడి పట్టఁ
బడి తుది యేమిటం బనికిరాకున్నఁ
దొలఁగిన చోళనాథుఁడు విచారించి
యిల మహామాంత్రికు లెట లేరె యనిన
నఖిలవేదాంతవిన్యాసి సన్యాసి
నిఖిలప్రశస్తుఁడు నిర్జితేంద్రియుఁడు
నతులమాంత్రికుఁ డైనయాదవాహ్వయుఁడు
సతతంబు గాంచికాస్థలి నుండు ననిన
విని రాజు పిలిపింప వేవేగఁ గదలి
తనశిష్యముఖ్యు లెంతయుఁ జేరి కొల్వ
యాదవుం డాలక్ష్మణార్యుతోఁ గూడి
యాదటం జోళనాయకపురంబునకుఁ

జని మున్న బ్రహ్మరాక్షసుఁ డావహిలిన
జననాథసుతునిపజ్జకు నేగుదెంచి
కడగి ధిక్కారహుంకారంబు లెసఁగఁ
దడయక యుగ్రమంత్రము జపియింప
రాజనందనగతరాక్షసుం డప్పు
డోజ దప్పక యింతయును లెక్కఁగొనక
తనరెండుకాళ్ళు యాదవుదిక్కు చాఁచి
యనియె నీకిట్టి యహంకృతి యేల
నిను నెఱుంగుదు నోరి! నీవు జపించు
మను వెఱుంగుదు నోరి మామకంబైన
జననంబు నెఱుఁగుదు చల మేటి కిపుడు
వనరక తలగు మివ్వల కుండ కనుచు
నాతఁడె నీవు మహామాంత్రికుండ
వైతేని దొంటి నీదైనపుట్టువును
వినుపింపు తానైన విశదంబు గాఁగఁ
దనపూర్వజన్మమాతయు నెఱిఁగింతు
తొలఁగు నీచేతఁ బోదు నే పట్టిచలము
వలవ దిచ్చో నుండవలదు పొమ్మనిన
అన విని యాదవుం డనువాదివిప్ర
మనుజాసననునితోడ మఱియు నిట్లనియె

నైన నీదగు తనదైనజన్మంబు
పూని వచింప నీపోవుచందంబు
వినుపింపు మనిన నవ్వేళ యాదవుని
గనుఁగొని పలికె రాక్షసుఁ డేపు మిగిలి
యోరి యాదవ విను మొగి నీవు మునుప
ఆరయ మధురాంతరాగ్రహారంబు
కడ నొప్పు ఘనతటాకముకట్టమీఁద
నుకుమవై యుండుదు వొకపుట్టలోన
నారీతి నుండి సర్వావనీ స్థలుల
వారును బహుషగా వచ్చునత్తఱిని
శ్రీవేంకటేశ్వరు సేవింపవచ్చు
శ్రీవైష్ణవాళి భుజింప నచ్చోటఁ
జిందినమెదుకులు చెలువార మెసఁగి
తందులకతన నీ వందితి విట్టి
జననంబు తనపూర్వజన్మంబు వినుము
మునుపు దాఁ గ్రతువు ప్రేముడిఁ జేయఁ బూని
పటుమంత్రతంత్రలోపము సేయ వచ్చె
నిటువంటిపుట్టు విం కేమిటం బోను
ఇలనెల్ల నీడేర్ప నేతెంచినట్టి
యలమహాత్మ్యంపు శేషావతారుండు

ననుపముం డైనరామానుజార్యుండు
తను నేగు మనిన నీశ్వరసీశసుతుని
విడచి యీపుట్టువు విడిచి ముక్తికిని
నడచెద నంచు గ్రన్నన లేచి వచ్చి
యాదట రామానుజాచార్యవర్యు
పాదపద్మములపైఁ బ్రణమిల్లి పొగడఁ
గని యాదవుండు భూకాంతునకు నట్ల
యనుముని వేఁడ రామానుజార్యుండు
భూవిభుసుతుఁ బాసి పొమ్మని వట్ల
పోవు నందులకు నిష్పులు గుఱు తొకటి
యొనయంగ నిందఱ కెఱుఁగంగఁ జూపి
చనుమన్న బ్రహ్మరాక్షసుఁడు మోదించి
యాయున్న రావి యాయతశాఖ విఱిచి
పోయెద నని చెప్పి భూపాలసుతుని
వదలి యాచెంత నశ్వత్థంబునందుఁ
బొదలిన యొకమహాన్నతశాఖ విఱిచి
రామానుజుని పరిగ్రహవిశేషమునఁ
దా ముక్తిపదము నిత్తఱిఁ బ్రవేశింతు
నని చెప్పి యఱిగిన నాలక్ష్మణార్యుఁ
గని వెఱఁ గంది యాకాంతుఁ డెంతయును

ననయంబు వినుతించి యాదవు నెదుట
వినుతవస్తువుల బల్విడిఁ బూజ సేయ
రామానుజుండు తద్రమ్యవస్తువులు
తాము గైకొనక యాదవునకు నిచ్చి
జగతీశు వీడ్కొని సంయమితోడ
మగుడఁ గాంచికి వచ్చి మఱియొక నాఁడు
అనురాగమున లక్ష్మణార్యుండు చెలఁగి
యనువొందఁగాఁ దల యంటుచునుండు
యాదవుం డుప్పొంగి యఖిలశిష్యులకు
నాదట వేదవాక్యం బెన్ని యొకటి
జలజనికాశలోచనయుగళంబు
గలిగినయట్టి శ్రీకామినీవిభుని
వనచరాసనవర్ణవలితాక్షియుక్తుఁ
డనుచు నీరీతి నపార్థంబుఁ జెప్ప
విని యది చెవులకు వేఁడిమైయున్న
ననయంబు వగచు రామానుజార్యునకుఁ
గన్నుల బాష్పము ల్గ్రమ్మ నం దొక్క
కన్నీటిబొట్టు డిగ్గన జాఱి వచ్చి
యప్పు డాయతితొడ యందుఁ బైఁ జింది
నిప్పు సోఁకినరీతి నెరయంగ నులికి

తలయొంటఁ జన్న యాతని యాననంబు
తలయెత్తి చూచి యాదవుఁడు కోపించి
తనయొద్దఁ జదువ కింతటినుండి నీవు
చను మెటకైన నిచ్చట నుండవలవ
దన విని రామానుజార్యుఁ డవ్వేళ
మనమునఁ జెలఁగి దుర్మద మింక వినఁగ
వలదు న న్నిసహవాసంబు సేయ
వల దని మాన్పె నీవరదుండ యనుచుఁ
దనయింటి కరిగి మాతకు నివ్విధంబు
వినుపింపఁ దనయుని వీక్షించి పలికెఁ
జాలు ముందర నీవు చదివినచదువె
యాలస్య ముడిగి శ్రీహస్తిగిరీంద్ర
దానవాంతకున కెంతయుఁ బరమాప్తుఁ
డైన సర్వోత్తము నఖిలపావనుని
దేవతాసము నలతిరుకచ్చినంబి
సేవించి యానతిచ్చినవాక్యసరణి
నలవరింపుదు నుండు మనిన డెందమునఁ
దిలకింపు మను వచ్చి తిరుకచ్చినంబిఁ
గని మ్రొక్కి తనవచ్చుక్రమము తెల్లముగ
వినిపించి నా కెద్ది వెఱ వని యనినఁ

దెలిసి యెంతయు మెచ్చి తిరుకచ్చినంబి
యలలక్ష్మణార్యున కనియె నింపొదవ
ననిశంబు దేవరాయనికి నీ చేర్వ
మొనయుశాలాకూపమున సలిలములు
ముదమున నర్చనంబున కొకబిందె
డొదవ నెమ్మనుచు నియోగించుటయును
ననయంబు చెలఁగి తోయంబు కైంకర్య
మొనరింపుచుండె శ్రీయుతుఁడు నాకరణి
నాయాదవుని బాసి హస్తిశైలేంద్రు
తోయకైంకర్యంబుఁ దొడఁ జేయుచును
ననురక్తి నున్నవాఁ డని విని మదిని
ననయంబు రాగిల్లి యాముని యుండు
పొదరి శిష్యుని మహాపూర్ణునిం బిలిచి
సదయుఁడై కాంచికాస్థలి కేగి నీవు
నచ్చటి రామానుజార్యవర్యునకు
మచ్చిక నీస్తవమణి వినుపింపు
మతఁ డెందుఁ జిల్చిన నచ్చోట నిలిచి
సతతంబు నీ విది చదువుమటంచుఁ
బనిచిన చని గురుపదపద్మములకు
వినతుఁడై కాంచికి వేవేగ వచ్చి

వరదరాజున కనవరత మంబుపులు
కరమర్థితోడ లక్ష్మణదేశికుండు
కొనివచ్చుచ్రోవ నెక్కొని యామునేయ
ముని వచించినస్తోత్రములు వచించుటయు
నది విని రామానుజార్యుఁ డెంతయును
ముద మొంది యమ్మహాత్మునకు వందనము
నవరించి యమ్మహాస్తవమణి యిట్లు
నవరించినట్టి యాచార్యుఁ డెవ్వాఁడు
అన విని యపుడు మహాపూర్ణుఁ డతని
కనియె నీనుతి యామునార్యశేఖరుఁడ
యొనరించె నమ్మహాయోగిపుంగవుఁడు
మునుకొని శ్రీరంగమున నున్నవాఁడు
అనిన రామానుజుఁ డనియె నన్నిప్పు
డనఘాత్మ యాయామునాచార్యవర్యు
పాదంబు లాశ్రయింపంగఁ జేసెదవె
నీదయ నామీఁద నిగుడించి యిప్పు
డనుటయు మెచ్చి మహాపూర్ణుఁ డట్ల
యొనరింతు రమ్మని యొడఁగూడఁ బలికి
యారామ సోదరు నపుడు దోకొనుచు
శ్రీరంగమునకు వేంచేసి కావేరి

దరి చేరఁబోయి యత్తఱిఁ బురిలోన
నరుదైనకలకలం బైన నాలించి
యరుదెంచువారల నరసిన లోక
గురుఁడైన యొకముని గురుశేఖరుండు
చనియె వైకుంఠవాసమునకు ననిన
విని మూర్ఛఁ జెంది యుర్వీస్థలి వ్రాలి
పొరలుచుండిరి మహాపూర్ణుఁ డవ్వేళఁ
దిరమొందు ధీరతఁ దెలిసి పల్మాఱు
భూమిపై నందంద పొరలుచునున్న
రామానుజార్యు చేరఁగఁ బోయి తెలిపి
యతనిఁదోకొని వేగ నరిగి కావేరి
సుతటంబునం గడు సొంపారుచున్న
యామునాచార్యుని యమలవిగ్రహము
వేమఱు సేవించి వెఱఁగందుచున్న
మునుప నాయామునమునిలోకనాథుఁ
డనువొందఁ బట్టిన వ్యాఖ్యానముద్ర
యడలకు మిఁక సకలార్థముల్ నీకు
నెడపక యీవేళ నిచ్చితి మనిన
ననువున విడువ రామానుజార్యుండు
కని వెండియును నమస్కారంబుఁ జేసి

యామునాచార్యపాదాబ్జముల్ చేరి
యామహాఁ చే సకలార్థంబుఁ దెలియ
వచ్చిన నీగురువరుఁ దను నిట్లు
చెచ్చెర నెడసేసి శ్రీరంగవిభుఁడు
ప్రల్లదంబున సిగ్గుపడక యే నింకఁ
జెల్లఁబో యేమని సేవింతు ననుచుఁ
బంచిన వగలఁ జొప్పడుచు నాపెరియ
నంబికి మ్రొక్కి విన్నపముఁ గావించి
శ్రీరంగనాథుని సేవింపకపుడు
భోరునఁ గాంచికిఁ బోయి యచ్చోట
మనసిజగురునకు మచ్చిక మునుప
నొనరించి కైంకర్య మొనరింపుచుండె
నలవడ నిఁక నిశ్చితార్థంబులెల్లఁ
దెలిసెద నని వచ్చి తిరుకచ్చినంబిఁ
గనుఁగొని పాదపద్మములకు వ్రాలి
వినవె యాకరిగిరివిభుచెలికాఁడ
తలఁపుఁలోఁ గొన్నియర్థంబు లీవేళఁ
దలఁచితి యే నిట్లు తలఁచితి ననుచు
శ్రీకాంతుఁ డగుహస్తిశిఖరశేఖరున
కేకాంత మగునట్టియెడ విన్నవించి

పూనికమీఱ నాపుండరీకాక్షుఁ
డానతిచ్చినరీతి నానతీవలయు
నన విని యట్లకా కనుచు నయ్యోగి
యనువొంద మూఁపుపై యాలవట్టంబు
హారి విహరించుదేహాపుమేడయందు
సిరిమించఁ జేర్చునిచ్చిన లనన్ వ్వ
నురుతరాయతధవళోర్ధ్వపుండ్రంబు
కరమొప్పఁ బచ్చల కనకపొంగళ్ళు
సలలితవస్త్రభూషణజాలములును
మలయసొంపులతిరుమణివడంబులును
నలర నేకాంతపాయస మారగించి
యలహస్తిశైలనాయకుఁ డింపుతోడ
నేకాంతమున నున్నయెడ నేగి నిలిచి
చేకొని వీవనఁ జెన్నార విసరి
యుపచార మొనరింపుచున్న నాయోగి
కృపఁజూచి యాహస్తిగిరినాథుఁ డనియె
నొనరంగ విన్నపం బొకటి మాకిప్పు
డొనరింపఁదలఁచిన ట్లున్నాఁడ వీవు
కలదె యేమైన నిక్కము సెప్పు మనిన
నలవరు దనకు నిట్లని విన్నవించె

స్వామి! తావకపదాసక్తుఁ డైనట్టి
రామానుజుండు గారవము దీపింపఁ
దలఁపులోఁ గొన్ని యర్థంబులు దలఁచి
వలుకొంద మీకు విన్నపము గావించి
యిరవొంద మీ రానతిచ్చినసరణిఁ
దిరుగంగఁ దనతోడఁ దెలుపుమటన్న
నావిన్నపమ్ము సేయఁగఁ బూనినాఁడ
నీవేళ నవి యాన తిమ్ము నాప్రుఁడును
చిన్నారిమోముపైఁ జిఱునవ్వు నెరయఁ
గన్నుఁగొనల నిండి కరుణ దైవాఱ
సేవింపుచున్న కాంచీపూర్ణుతోడ
నావేల్పురాయఁ డిట్లని యానతిచ్చె
నతఁ డెఱుంగనియట్టి యర్థము ల్గలవె?
యతఁడు సర్వజ్ఞుఁ డీయవనిలోపలను
ఇటువలెఁ దాను నీయుందఱికరణి
నటియింపఁగాఁ గోరి నను వేఁడినాఁడు
ఐన నే మమ్యె రామానుజార్యుఁడు
తా నాత్మలోపలఁ దలఁచునర్థమ్ము
లెవ్వారు తనగురుఁ డెద్ది యుపాయ
మెవ్వఁడు పరతత్త్వ మెద్ది సన్మతము

అని యెన్ని నాఁడు మహాపూర్ణగురుఁడె
తనగురుం డల ప్రపదనముపాయంబు
తత్త్వంబు నేను సద్వైతంబ మతము
తత్త్వార్థ మిది ప్రపదనమున కరయ
నంతిమస్మృతి వల దని చెప్పు మనిన
నంతట నరిగి రామానుజార్యునకు
నావిధం బాతయు నానతిచ్చుటయు
భావించి యాశ్చర్యపడి ముద మంది
చెలువుమీఱంగఁ గాంచీపూర్ణపాద
ముల ప్రాలి యమ్మహాముని సమ్మదమున
నలమహాపూర్ణుని నాశ్రయింపంగఁ
దలఁచి డెందమున సంతస మిగురొత్తఁ
బరువడి శ్రీరంగపట్టణంబునకు
నరుగుచు మధురాంతరాగ్రహారమున
నలసి తటాకనాయకుఁ డను నచటి
జలజలోచనునివాసముఁ జేర నేగి
దైవయోగమున నత్తఱి మహాపూర్ణుఁ
డావేళ సకుటుంబుఁ డై యేగుదెంచి
యిటమీఁదఁ దను గాంచి యీడేర్తు ననుచు
నటవచ్చివచ్చి యాహారిమంది రమున

నున్నట్టి యాదేశికోత్తముఁ గాంచి
వెన్నెలఁ బొడఁగన్న వెన్నెలపులుఁగు
సరవి భానుని గన్నజలజంబుకరణిఁ
గర మర్థి పాదపంకజముల వ్రాలి
యున్నరామానుజు నొగి గాఁగిలించి
కన్నీరు దుడిచి యంగములెల్ల నివుర
నామహాపూర్ణున కాలక్ష్మణార్యుఁ
డామోద మెసఁగ నిట్లని విన్నవించె
నుపదేష్ట మగుచు హితోపదేశంబుఁ
గృపఁజేసి నను గటాక్షింపంగవలయు
నన విని శ్రీకాంచి యల్లదే యింక
ననతిదూరము మన మటఁ బోయినపుడు
శేవగాఁ బుణ్యకోటిచ్ఛాయ నచట
దేవనాథునిసన్నిధిని సకలములు
నల యామునాచార్యు నన్నియు మీరు
తెలివిమీఱఁగఁ బ్రసాదించెద రనినఁ
గటకటా మున్నెఱుఁగరె యామునార్యు
నటఁ బోయి కనియెద మని పోయినప్పు
డేమయ్యె దేహంబు లెన్న నిత్యములె
యీమెయి మీ రానతిత్తురె యిపుడు

కృపసేయు మనిన నాకృతి లక్ష్మణునకు
నపు డారమాపతి యగ్రభాగమున
వకుళమూలమున నాళ్వందారుమదిని
ప్రకటించి గురుపరంపరమూలమనువు
ద్వయముఖ్యములను నర్థముతోడఁగూడ
దయసేసి రామసోదరున కిట్లనియెఁ
దొలుత రాముఁడు భరతునకుఁ బాదుకల
నిలఁ బ్రోవఁ దా నిచ్చి యేగినకరణి
నారీతి నను బ్రోవ యామునేయుండు
సారంబు లగు తమచరణపద్మములు
మనుమణియునుగూడ మాయందుఁ బెట్టి
మునుకొని యరిగిరి ముక్తిభూస్థలికి
సామంతమునకు వాచ్యంబైనవాని
బ్రేమమై నీకుఁ జూపెద రమ్మటంచు
నంచితంబుగ లక్ష్మణార్యుండుఁ దాము
గాంచికి నేతెంచి కాంచీపురీశు
నతిభక్తిఁ గాంచి రామానుజార్యునకు
మతినెన్న వీఁడ తన్మంత్రవాచ్యుండు
అనుచు నానతియిచ్చి యాఋమూసంబు-
లనురక్తి శిష్యుతో నచ్చోట నుండి

సకలహితోపదేశములు ఛాత్రులకుఁ
బ్రకటింపుచుండె నాపై నొక్కనాఁడు
తమదేవి రామసోదరునిదేవియును
గోమరారఁ జని యొకకూపంబునందు
సోరిది నీళ్లను జేదుచును జేదకుండ
లిరువుర నోరయ నయ్యోక లక్ష్మణార్య
కాంత కులంబులకరిమ మేర్పఱిచి
కాంతాళమునఁ జేతికలశంబుఁ గొట్టి
తనయింటి కరిగె నత్తఱి మహాపూర్ణు
వనిత యేతెంచి యవ్వాడువు చెల్వునకుఁ
దెలిపిన నాలోకదేశికుం డాత్మ
నలికి యెక్కడ వైష్ణవాపచారంబు
వచ్చునో యని శిష్యవరుతోడఁ జెప్ప
కచ్చోటు వాసి చయ్యన రంగపురికిఁ
జనియె నాస్మై ననుష్ఠానంబు సేసి
యనురక్తితోడ రామానుజార్యుండు
చనుదెంచి గురునివాసమునకు నరిగి
యనువొందుభక్తి నిజాచార్యు నడుగఁ
గోరి యచ్చో నెలకొనియున్న వారు
శ్రీరంగమునకు వేంచేసిరి యనిన

వాతోడఁ బిల్చి యాసతియీక యిట్టు
లీతటి నరుగుట కేమికారణము?
యన విని వారు మహాపూర్ణగురుని
వనిత మీావనితయు వాకిటిబావి
జలములు చేఁదంగఁ జని చేఁదుచున్న
బలువిడి నొండొరుభాండము లొ్సఁకఁ
దమకుండ మీాకుండ తాఁకుమెట్లనుచుఁ
దమకించి యాభిజాత్యంబులు దలఁచి
గ్రిక్కన మీాకొమ్మ కనలి చేకుండ
వ్రిక్కలు సేయు నవ్వడువు దా నెఱిఁగి
కలఁగి మిక్కిలి దమకాంతఁ గోపించి
యలుకుచు శ్రీవైష్ణవాపచారంబు
లొనఁగూడు నిచ్చోట నున్న నిం కనుచుఁ
జని రన్నఁ గనలి లక్ష్మణదేశికుండు
నేమిసేయుదు నింక నియ్యపచార
మేమిటం బెడఁబాయు నిట్లు రాఁదగున
యరయంగఁ బ్రతికూల యగుభార్య విడుచు
టిరవొందఁగా శాస్త్రహితమే తలంపఁ
జెనఁటియైనట్టి సంసృతి యింత రోఁత
యని యాత్మ నొకయుపాయంబుఁ జింతించి

యనురక్తిఁ దనదేవి నట బుట్టినింటి
కనిపెను కైవడి ననిపి గొబ్బునను
జెన్నొందు నాహస్తిశిఖరమందిరుని
సన్నిధానంబున జనులెల్ల వినఁగఁ
దక్కక సోదరీతనయు దాశరథి
దక్కఁ దా సకలబాంధవుల డించితిని
అని హస్తిశైలనాయకునిచే సర్వ
జనులు సన్నుతి సేయ సన్న్యాస మంది
తనగురుం డగుహస్తిధరణీధరేశు
ననుమతి మఠమున కరుదెంచినంత
నాశ్రితసురభూజ మగువేల్పుచేత
నాశ్రమస్వీకార మలవడం జేసి
యలలక్ష్మణాచార్యుఁ డని సర్వజనులుఁ
బలుక రామానుజభక్తమందారు
చెలియలికొమరుఁ డాశ్రితపారిజాత
† మలఘుప్రతిష్ఠితునంశమైనట్టి
సలలితగురుఁడు దాశరథి యవ్వేళఁ
దను నొందు దక్కంగఁ దక్కినబంధు
జనము డించితి నని సన్న్యసించుటయు
విని యమ్మహాత్ముఁ డెవ్విధి నన్ను విడువ
ననియొఁ గృతార్థుండ నైతిఁ బొమ్మనుచు

† మఠము

నాసమీపమునఁ గూరాగ్రహారమున
భాసిల్లు లోకైకపావనమూర్తి
యలసర్వనేత్రునియంశమై మిగులఁ
జెలువారు శ్రీవత్సచిహ్నదేశికుని
ననురక్తిఁ దోకొని యతఁడును దాను
జని కాంచినున్నలక్ష్మణమౌనివర్యు
సేవించి పాదరాజీవయుగ్మంబు
తావిఁ జొక్కుచు షట్పదంబులై వ్రాలి
కృపచేసి మముఁ గటాక్షింపఁగవలయు
నిపు డని వినుతింప నెంతయుఁ బ్రీతిఁ
బంచసంస్కృతులుఁ జొప్పడఁజేసి వారి
కంచితపరమరహస్యంబు లొసఁగి
శరధిగంభీరు దాశరథిఁ గూరేశు
గురుని నిర్జితదేవగురుని నెంతయును
బ్రేముడి సేసి రాప్రియశిష్యవర్యు
లామౌనిచంద్రుని యఖిలసేవలను
రమణఁ జేయుచు నంతరంగులై యుండి
రమలవిద్యామనోహరమూర్తు లగుచు
నంత యాదవమాత యాత్మజుఁ జూచి
యెంతయు వగచి నీ కిట్లుండఁ దగునె

యఖిలకర్మములకు నధికార మొసఁగు
శిఖయు జన్నిదమును జెల్లఁబోవిడిచి
యీమెయి నుండుట యిది శాస్త్రహితమె
రామానుజార్య గౌరవమున నీవు
నురుగతి శిఖయు యజ్ఞోపవీతమును
ధరియింపు మనిన నాతల్లి నీక్షించి
దండి నిన్నాళ్ళేకదండినై యిట్టు
లుండితి శిఖయు యజ్ఞోపవీతమును
నేరీతి ధరియింతు నివి పూనకొఱకు
నారయ నింకఁ బ్రాయశ్చిత్తముగను
వలగొనవలయు భూవలయుంబు తనకు
బలము లేదని యార్తిఁ బడి కను మూయఁ
గలలోనఁ జనుదెంచి కరిరాజవరదుఁ
డిలచుట్టి రాకున్న నేమయ్య వలదు
రమణతో నీవు మారామానుజార్యుఁ
దమకంబు డిగ్గి ప్రదక్షిణం బొకటి
చేసిన భూప్రదక్షిణము సాంగముగఁ
జేసినవాఁడవేఁ జెప్పినకరణి
నొనరించి లక్ష్మణార్యునియొద్ద నాతఁ
డొనరించు సన్న్యాస మొనరింపు మనినఁ

గల మేలుకాంచి యక్కల విశ్వసింప
కలకాంచిపూర్ణుని నావేళఁ గాంచి
యీతెఱం గంతయు నెఱిఁగించి మీర
లీతెఱం గిభశైలహేమాంబరునకు
నెఱిఁగించి యతఁ డానతిచ్చినరీతి
నెఱిఁగింపవలయు నా కిటమీఁద ననినఁ
దడయక శ్రీహస్తిధరణీశు నట్ల
నడిగి యేతెంచి యిట్లనియె నాఘనుఁడు
జలజలోచనుఁడు నీస్వప్నంబునందు
నెలమితో మును పానతిచ్చినకరణి
నవరింపు మనిమెఁ గొంచక యని యఃన
వివరించి యంతయు వెలిఁ గందుకొనుచు
యాదవుఁ డరిగి రామానుజమాని
పాదపద్మములకుఁ బ్రణమిల్లి పొగడి
సేవించి వడిఁ బ్రదక్షిణముగా వచ్చి
యీవిధం బంతయు నెఱిఁగింప నతఁడు
కరుణ దైవాఱ లక్ష్మణదేశికుండు
నురుతరం బైన వేదోక్తమార్గమున
నయమారఁ బునరుపనయనంబు సేసి
యయకరం బగు త్రిదండాశ్రమం బొసఁగి

యతని గోవిందనామాంకితుం జేసి
యతులితసకలరహస్యంబు లొసంగి
నిజశిష్యు గాంగ మన్నించి యచ్చోటం
ద్విజగంబు లెఱుంగ వర్తిలుచుండె నంత
యామునాచార్యపాదాసక్తమతులు
రామానుజార్యు చర్యలు విని యలరి
శ్రీరంగమున రంగశేషపర్యంకుం
జేరి విన్నపములు చేసి యగ్గించి
రామానుజుండు దర్శనగురుం డగుచు
స్వామి యెల్లపుడు నిచ్చట నుండవలయు
నన విని రంగనాయకుండు సంతసము
మునుకొని శ్రీనాథమునివంశుం డైన
రంగనాయకుని చేరంగంబిల్చి మిగుల
నంగవింపుచుం గాంచి కరిగి వేవేగ
ననుఁబొంద నేయుపాయంబున నైనం
గొనిరమ్ము లక్ష్మణగురుని నిక్కడికి
నన విని ప్రణమిల్లి యాగాయకేశుం
డనురక్తిం గాంచికి నరుదెంచి యంత
వరదుండు పరిజనవైభవస్ఫూర్తి
యరుదారం గొలువున్నయత్తఱి వచ్చి

ఘనమైన తనదివ్యగానంబు సొగయ
వినుపించి యానాదవేదిఁ జొక్కింప
వలనుగా మెచ్చి యావరదుఁడు కొంక
వలదు వేఁడుము నీకు వలయు నర్థముల
నన విని రామానుజార్యుని నాకు
వనమాలి వరద యీవలయు నావుఁడును
వరదుం డితఁడు దక్క వలయునర్థంబు
లరుదార నిచ్చెద ననిన గాయకుఁడు
రామావతార వారక రెండుమాట
లేమియు మీ రానతీ నెట్లు వచ్చు
ననిన నేమరితి మే మప్పుడే యనుచుఁ
గనకాంబరుండు లక్ష్మణమానివరుని
నిచ్చినఁ బొంగి రంగేశుగాయకుఁడు
మచ్చికతోడ నమ్మౌనిఁ దోకొనుచు
శ్రీరంగమునకు వేంచేయు నవ్వేళ
శ్రీరంగపతి తనసేనానితోడఁ
బరమభాగవతులు పరిచరజనము
నరుదార నెదురుగా ననిపి వెండియును
నామౌని తమకడ కరుదెంచువేళఁ
బ్రేమమై నెదు రేగి పెక్కుచందముల

ముదమున నడుగుఁదమ్ములఁ బ్రిసాదించి
తుదలేనివేడ్కతోఁ దోకొనివచ్చి
నాలక్ష్మణార్యుండు నఖిలభాగవత
జాలంబుతోఁగూడఁ జనుదెంచి భక్తి
శ్రీరంగనాథుని చెలువంబు కన్ను
లారంగ మఱియు నందంద సేవింప
నారంగవిభుఁడు రామానుజాచార్యుఁ
జేరంగఁ బిలిచి మచ్చికసేసి నీవు
నొగి నేనె పాలింపుచున్నవిభూతి
యుగము నీ కిచ్చితి నొకకొఱలేదు
పన్ని మామకగృహపరికరాదులకు
నన్నిటికిని గర్త వైయుండు మనిన
నామెడ రంగనాయకునిదివ్యాజ్ఞ
శ్రోయక యమ్మౌనితోయజతరణి
నిఖిలేశుఁ డగురంగనిలయుకో వెలకు
నఖిలంబునకు- గర్తయై తాను నిలిచి
యగు ననువారల నగు నంచు మెచ్చి
తగ దనువారలఁ దగ దంచుఁ దిగిచి
యామీఁద నిజశిష్యుఁ డగునకలంక
భూమీశుఁ డనురాజపుంగవు నొకని

నారంగపురమున కధికారిఁ జేసి
శ్రీరంగపతి సమంచితవైభవముల
నెప్పటికంటెఁ దా నినుమడి గాఁగఁ
దప్పక నడుచుచందంబు సేయించి
యట నొక్కనాఁడు మహాపూర్ణగురుని
బటుభక్తి సేవించి పదముల కెరగి
యనురక్తి మీకు నయ్యామునాచార్యుఁ
డానరంగ నుపదేశ మొసఁగినయట్టి
ఘనరహస్యము లింకఁ గలిగినఁ దనకుఁ
జనువుమీఱంగఁ బ్రసాదింపవలయు
నన విని యతిపూర్ణుఁ డాయామునేయ
ముని యొసంగినయర్థములు మునుమున్నె
కల వెల్ల నీ కలకాంచిలోపలనె
తెలిపితి మిఁదు సందేహంబు లేదు
అని తమసుతుని రామానుజార్యునకు
వినుతశిష్యుని జేసి వెండియుఁ బలికె
యామునమౌనిరహస్యము ల్గొన్న
ప్రేమమై నెంతయుం బ్రియశిష్యులైన
యలతిరుమాలనంబి కలదామధరుని
కలగోష్ఠిపూర్ణున కనఘుఁ డైనట్టి

యులరంగనాథగాయకునకు నెలమిఁ
దెలిపినా రవి నీవు దెలిసికొ మ్మనిన
ఘనమైనశిష్యసంఘముతోడఁ గూడ
ననురక్తి రామానుజాచార్యుఁ డంత
శ్రీగోష్ఠిపూర్ణుని సేవించుకొఱకు
శ్రీగోష్ఠిపురికి వేంచేసి యాగురుని
గని భక్తి పాదపంకజముల వ్రాలి
మనమార నలచరమశ్లోకమునకుఁ
జనునర్థ మెద్ది ప్రసాదింపవలయు
ననిన నాగురువరుం డట్లు కా కనుచు
రామానుజునిమనోరాగంబుఁ దెలియ
నీమాటు వోయి ర మ్మోటిఁగింతు ననిన
నీరీతి ముని పదియేను వారములు
సారెకుఁ దిరిగి వేసారక మదిని
జింతింపుచుండంగ శ్రీరంగమునకు
నంత శ్రీగోష్ఠిపూర్ణాఖ్యశిష్యుండు
చనుదేర నపుడు లక్ష్మణమానివరుఁడు
తనలోనియార్తియంతయుఁ దోఁచునట్లు
తెలిపి యాఘనుని కిట్లెఱిఁగెల్ల మీరు
చెలువార వేగి గోష్ఠిపూర్ణునకును

నెఱిఁగించి తలఁపులో నిరవొందువగపుఁ
దరలంగఁ జేయు మిత్త్రతి నని పనుప
నరిగి యాఘనుఁ డంత నలగోష్ఠిపూర్ణు
గురున కీతెఱఁగు సేకొని విన్నవింప
ననయంబు హర్షించి యాదేశికుండు
తనశిష్యుఁ బిలిచి యత్త్రతి నీవు వోయి
తనదుపవిత్రంబు దండంబుఁ దాల్చి
కొని పెరవారిఁ దోకొనిరాక తాన
యేతెంచె నేని నే నిత్తు నటంచుఁ
దోతెమ్ము మానిచంద్రుని వేగ ననుచు
ననిపిన నరిగి రామానుజార్యునకు
నొనర నవ్విధమంతయుం దేటపఱచి
రమ్మన్న నుప్పొంగి రామానుజుండు
సమ్మదం బెసఁగ దాశరథిఁ గూరేశుఁ
దోకొని యాతనితోడ నేతెంచి
యాకరుణానిధి నాచార్యవర్యు
సేవింప నపుడు గోష్ఠిపూర్ణుఁ డనియె
నావేళ నెంత రామానుజు తోడఁ
గరమర్థి నిన్నునొక్కనినె రమ్మనిన
నిరువుర నీవెంట నిటకుఁ దేఁ దగునె

యనినఁ బవిత్రింబు నలఘుపండుంబుఁ
గొని పని విను మనం గోరి యేవట్ల
యీవేళ మీ రానతిచ్చినయట్ల
వేవేగ నిల పని వింటి నాపుడును
నిండారుకూరిమి నీ కిందుఁగోన
దండ మెవ్వరు పవిత్రం బెవ్వ రనిన
దండ దాశరథియే దండంబు గూర
మండలేశ్వరుఁడె మామకపవిత్రంబు
నన విని మోదించి యాగోష్ఠిపూర్ణుఁ
డనియె నే నొసఁగు రహస్యార్థ మీవు
నీయురుపురుఁ దక్క నెవ్వరిఁకోడ
మాయానఁ జెప్పకు మఱి మహానివర్య
యని రహస్యంబున నాపరమార్థ
మొనర మహానిద్రమున కుపదేశ మొసఁగి
యనిపిన యతిపతి యామఱునాఁడు
ఘనతర శ్రీగోష్ఠి కానాథుఁ డైన
శ్రీవరుతిరునాళ్లు సేవించుకొఱకు
శ్రీవైష్ణవాళి వేంచేసియుండంగ
నందఱు వినుచుండ నాచరమార్థ
మందంబుగాఁ బెట్టి యానతిచ్చుటయు

నామాట విని యప్పు డాగోష్ఠిపూర్ణుఁ
డాహానిఁ జేరంగ నఱిముఱి వచ్చి
యేమోయి యిటకు మీ రిరువురుఁ దక్క
నీమహానీయార్థ మెవ్వరితోడఁ
జెప్పకు మని బుద్ధి చెప్పితి నానఁ
దప్పి యీగతి సేయఁ దగునె నీ కిపుడు
శ్రీ తిగురుతోడ బొంకినవాని కరయ
గతి యెద్ది తుది నరకమె కాక యనిన
ననియె రామానుజుం డాగోష్ఠిపూర్ణుఁ
గని యొక్కరుఁడు నరకముఁ బొంద నేమి
యిందఱు మీకృప నిడేరి శౌరిఁ
జెందుదు రని యేను జెప్పితి ననినఁ
గాఁగిటఁ జేర్చి లక్ష్మణమునివర్యు
వీఁగనికూర్మితో వినుతులు చేసి
యిల సర్వలోకుల నీడేర్పవచ్చు
నలవాఁడ వీ వని యందంద పొగడి
యిటమీఁద దొరఁకొని యీదర్శనంబు
కటుగతి నీపేరఁ బరఁగు నెల్లెడల
నని వరం బిచ్చి నిజాత్మజు శిష్యు
నొనరించె నప్పు డయ్యోగిచంద్రునకు

యతిపురందరుఁ డంత నాగోష్ఠిపూర్ణు
నతిభక్తి వీడ్కొని యరిగె నంతటను
శ్రీమాలికాధరుచే దివిడాగ
మామోదకరరహస్యంబు లెఱింగి
కరమర్థి శ్రీరంగగాయకుచేతఁ
బరిపూర్ణతద్గానభంగులు దెలిసి
శ్రీరంగమున నిట్లు శిష్యశేఖరుల
కారూఢి వేదాంత మానతియిచ్చు
చున్నయత్తఱి దండ నొకయేకదండి
క్రన్నన గంగసంగడినుండి వచ్చి
తనతోడ శాస్త్రవాదము సేయు మనుచు
ననయంబు గర్వించి యతిరాజుఁ జూచి
యొండొరు వాదింప నోడినవారు
దండిమైఁ గొల్చు నాతనిశిష్యవరుఁడు
గావలయునటన్నఁ గని లక్ష్మణార్యుఁ
డావాక్యమున కెంతె యంగీకరించి
పాలయక యువ్బాహుసుందరనామ
దళితహిరణ్యాముందరి కేగుదెంచి
నిండారుకణఁకతో నిలిచి యయ్యేక
దండితోఁ దొడరి యుద్దండుఁడై పేర్చి

పదియేడుదినములు పట్టినచలము
వదలక వాదించి వాదించి మదిని
వేసరి యతిరాజు వెతఁగన్న మాయ
నాసమయమున రంగాధీశ్వరుండు
చనుదెంచి ప్రతివాదిజయహేతియుక్తి
నొనరంగ నుపదేశ మొసఁగ మేల్కాంచి
యామఱునాఁడు రామానుజాచార్యుఁ
డామహాప్రతివాది నలవోక గెలిచి
దయతోడ నయ్యేకదండి కవ్వేళ
నయమార్గఁ బునరుపనయనంబు చేసి
మగుడ ద్రిదండాశ్రమముఁ బ్రసాదించి
తగశిష్యవరుల కెంతయు ముఖ్యుఁ జేసి
సాదరుం డగుచు వేదాంతదీపంబు
వేదాంతసారము వేద్య మైనట్టి
అరవిందదళలోచనార్చనాక్రమముఁ
గరమొప్పు సొబగుల గద్యత్రయంబుఁ
దలుకొత్తుచున్న గీతావివరణము
నలవడఁజేసి వ్యాఖ్యానంబు చేసి
చుక్కలలో నొప్పు సోముచందమున
నొక్కటఁ బరమశిష్యులతోడఁ గూడి

దెసలకు వేంచేసి తిమిరసంతతుల
పసగరగొనియెడు భానుచందమునఁ
బరమతవాదులఁ బరపి యచ్చోటి
ధరణీశ్వరుల శిష్యతములఁ జేయుచును
బాయనికడఁక నుద్భటశిష్యవరుల
నాయూయిలిరుపతు లందునిల్పుచును
వెలయ నీరీతి దిగ్విజయంబు చేసి
యిల వలగొని యిట్టు లేతెంచుచుండ
సారగ కాశ్మీరదేశమునందునున్న
శారదాపీఠదేశమున కేతేర
శారదానారదసంకాశ యైన
శారద యప్పు డాసంయమీంద్రునకు
నెదు రేగి పదముల కెరగి నుతించి
ముదమున నిజవాసమునకు నేతేర
రామానుజుండు శారదఁ జూచి యేమి
నామీఁద నీ వింత నంటుజేసెదవు
అన విని వాణి యిట్లనియె నోమౌని
వినవయ్య జగదేకవిఖ్యాతచరిత
మునుపొక శ్రుతివాక్యమునకు శంకరుఁడు
వనమాలి కపిగుదవర్ణ నేతుదెందు.

అని యథార్థముఁ జెప్ప నది తప్పటంచు
దనుజారి పంకజదళనేత్రుఁ డనుచు
నీవంటు పార్థు నెన్నితి వందుకొఱకు
భావించి సంతోషభరితనై యిప్పు
డారీతి నిన్నుఁ గన్నంత నుప్పొంగి
యీరీతిఁ జేసితి నేను నీయెడను
సన్నుతనిఖిలశాస్త్రంబులన్నియును
నున్నవి యచ్చోట యోగీంద్రచంద్ర !
చేకొని నీవలసినశాస్త్ర మిపుడు
కైకొను మనిన లక్ష్మణయోగివరుఁడు
భువనంబులన్నియుఁ బొగడఁ దా మున్ను
సవరించువేదాంతసంగ్రహం బెత్తి
యేముసేసినశాస్త్ర మిది దీనఁదప్పు
లేమేనిఁ గల్గిన నెఱిఁగింపు మనుచుఁ
దనకేల నున్నపుస్తకము పంకేజ
తనుజాతరాణిహస్తములకు నొసఁగ
ధరలోన సకలశాస్త్రముల కెల్లపుడు
సరకు గైకొనక మెచ్చక యుండువాణి
యిరవొంద నాఘనుఁ డిచ్చుశాస్త్రంబు
శిరసావహించి మెచ్చినమానివరుఁడు

నత్తఱి బోధాయనాఖ్యనిర్మాణ
వృత్తి శారదచేత వేగఁ గైకొనుచుఁ
గడుఁ బెక్కువిధములఁ గంజాతసూను
పడఁతుక నంత సంభావించి కదలి
యంత శ్రీపురుషోత్తమాధీశుఁ గాంచి
సంతసంబునఁ గూర్మశైలేశుఁ జూచి
యలసింహశైలనాయకుఁ బొడఁగాంచి
సలలితాహోబలేశ్వరుని సేవించి
శ్రీవేంకటాధీశు సేవింపఁగోరి
శ్రీవేంకటాగంబు చేర నేతెంచి
శ్రీపురంబునకు వేంచేసి నెయ్యమున
నాపురిఁ బాలించు నలవిఠ్ఠలేంద్రు
క్షితినాయకుని గృప సేసి యచ్చోట
నతనిచే నొకయగ్రహారంబుఁ గొనుచు
నఖిలశాస్త్రజ్ఞులు ననుపమేయులును
నిఖిలసన్నుతులును నిజశిష్యు లగుచు
చెలఁగి డెబ్బదినాల్గుసింహాసనముల
నలవడువారిలో నందుఁ గొందఱను
బరమానురక్తి ముప్పదిమందిఁ బిలిచి
తిరమొంద నందుఁ బ్రతిష్ఠఁ గావించు

నప్పు డయ్యతివరుఁ డాశేషనగము
తప్పక సేవించెఁ దద్దయుఁగూర్మిఁ
బరమపావనుఁ డైన పరకాలముఖ్యు
లరుదెంచి శేషాంశ మనుచు నగ్గిరిని
ద్రొక్కనోడిరి తాము దొడిబడ నింకఁ
ద్రొక్కరా దన విని తుందుడుగొనుచు
నతులశేషాంశ మైనట్టి యనంత
పతిశిష్యముఖ్యు లేర్పడఁగ నిట్లనిరి
యీవేళ మీ రిది యెక్కకయున్న
దేవమీశిష్యులు దిక్కులవారు
నారోహణము సేయ రగ్గిరిమీఁద
నీరీతి తగవు గా దేవేళ మీరు
నాగేంద్రశైలేంద్రనాథు సేవింప
వేగ నవశ్యంబు వేంచేయవలయు
ననిన రామానుజుం డాశైల మెక్క
చనువేళ నావచ్చుచందంబుఁ దెలిసి
యలతిరుమలనంబి యనురక్తిఁ బంపి
వలనొప్ప వేంకటేశ్వరుఁ డారగించి
దయసేయు తత్ప్రసాదమును గైకొనుచు
గయమున నరిగి శ్రీరామానుజులకు

నెదురుగాఁ జనిన మానీంద్రుఁ డావేళఁ
ద్రిదశవందితుఁ డైన తిరుమలనంబిఁ
గని భక్తిఁ బాదపంకజముల వ్రాలి
తనరారఁ దత్ప్రసాదము స్వీకరించి
యారయ సర్వలోకాచార్యు లైన
మీా శ్రీప్రసాద మిమ్మొయి దేరవలెనె
యనిఁ బూని యొకపిన్నపాపనిచేత
ననిపినం జాలదే యనిన నాఘనుఁడు
నిప్పుడు మీా రానతిచ్చినకరణి
తప్పక నగర మెంతయు వెదకితిని
ఆకడ వైష్ణవు లగువారిలోన
నాకన్న నెన్న చిన్నలు లేరు గానఁ
దెచ్చితినన్న నాదేశికుమాట
మచ్చిక వేదాంతమార్గమై యున్న
ననయంబు మోదించి యామానివరుఁడు
తనశిష్యవరుల నందఱ విలోకించి
కంటిరే యిపుడు వేంకటపూర్ణుమహిమ
గెంటక మది నహంకృతిలేశమైన
నరయక పెద్దవా రైన నైచ్యంబు
దొరయంగ భాగవతులయెడాటమున

రూపించుచున్న స్వరూప మందఱకు
దీపింపఁ జేసి తా దేశికుం డయ్యె
వరుసతో శ్రీవైష్ణవస్వరూపంబు
లరయనిగతి నుండు నని నుతింపుచును
గామధేనువులును గల్పభూజములు
కామితార్థము లిచ్చుకమనీయమణులు
సిద్ధరసంబులు సిద్ధమూలికలు
సిద్ధమానీంద్రులచేఁ జెన్నుమిగులు
నన్నగరాజంబు నహిరాజమూర్తి
కన్నులపండువు గాఁగఁ జూచుచును
దిరుమలనంబితోఁ దిరమొందుప్రేమఁ
దిరుమలమీఁది కేతెంచి కోవెలకు
వలచుట్టివచ్చి పావనతలభరణి
మిళితసంసారతమిస్రౌఘతరణి
ననుపమసుకృతసంహతిజన్మధరణి
జనముతయును నైన స్వామిపుష్కరిణి
స్నానంబుఁ జేసి యాచక్కిఁ జెన్నొందు
భూవళి సాక్షినొంపునఁ గాఁగిలించి
ఫణిరాజుపై నొక్కపద మూఁది దివ్య
మణిమయభూషణమండితుం డగుచు

దైవాలుపుడమిపైదలిమోముదమ్మి
తావులు గ్రోలెడుధరణీవరాహు
సేవించి యటఁ బ్రదక్షిణముగా వచ్చి
యావరణంబుల కాదియై మిగుల
గోమరారువైకుంఠగోపురంబునకుఁ
బ్రమదంబుతో మున్ను బ్రణమిల్లి యంతఁ
జనుదెంచి గారుడస్తంభంబుచక్కి
వినతుఁడై చెంత క్రొవ్విరిసాల కేగి
వలనొప్పుచంపకావరణంబు వేగ
వలచుట్టి వచ్చి యాస్వామిపుష్కరిణి
తోయంబు * లోని యుత్తుంగభాగమున
నాయహికులపతియవతార మగుచుఁ
దిరుగనిచింతలుం దెరలించునీడ
దిరుగనిచింత కంతే భక్తి మ్రొక్కి
రమణ రెండవగోపురము దాఁటి లోని
కమలమహానసాగార సేవించి
నెలకొని యానందనిలయాఖ్య మగుచు
నలువొందు మణివిమానంబు సేవించి
పటుమహామణిమంటపంబు సేవించి
యట వచ్చి తురగతార్క్ష్యాహినాయకుల

* లాని

సేవించి దనుజారిసేనాధినాథు
సేవించి నరసింహు సేవించి తార్క్ష్యు
సేవించి నిత్యుల సేవించి కూర్మి
నావేళ లోనికి నరుదెంచి యచటి
పంచాస్త్రకోటుల * భావంబు మించి
పంచవిగ్రహముల భాసిల్లి పసిఁడి
గజ్జలు నందియల్ కనకాంబరంబు
గొజ్జంగిముత్యాలకుచ్చుకటారి
బెడఁగుగాఁ గటిమీఁద బెరసిన కేల
నుడుగక వరముల నొసఁగు కెంగేలు
నుదరబంధంబు కేయూరహారములుఁ
బాదలుతావులుతట్టు పునుఁగుపైపూఁత
కుడిరొమ్ముమచ్చ యక్కున నెలకొన్న
కడలికన్నియదివ్యకంఠసరంబు
ధళధళఁ దుళగించు దరము, చక్రంబు
బలసిచూపట్టెడు పాణిపద్మములు
బింబాధరమ్మొప్పుకపోలములు
కంబుపోతంబు నెక్కసమాడుగళము
మకరకుండలములు మణికిరీటంబు
వికసితధవళారవిందనేత్రములు

---

* భాతిం

చల్లనిచూపును జారునాశికయుఁ
దెల్లనిమెఱుఁగుముత్తియపునామమును
గలిగి యెంతయును శృంగారభావంబు
మలయునయ్యలమేలుమంగామనోజ్ఞు
సేవించి ప్రణమిల్లి చేరి సన్నుతులు
గావించి పులకితగాత్రుఁడై చెలఁగి
శ్రీరంగమున నున్న శేషపర్యంకుఁ
డీరూపమున వచ్చి యిటఁ బొడచూపెఁ
బరతత్త్వ మీతండె పరయోగిహృదయ
పరిపూర్ణుఁ డితఁడె శ్రీపతియును నితఁడె
పరమకారుణికుండు భక్తవత్సలుఁడు
పరవాసుదేవుఁ డీపంకజాక్షుండె
జగములు వొడమింప సమయింపఁ బ్రోవఁ
దగువాఁడు నితఁడె యీధరణీధరంబె
వైకుంఠ మితని కెవ్వరు సరి గలరె?
యీకమనీయనగేంద్రరాజునకు
సరి లేరటంచు వేసరణుల వేద
శిరముల సన్నుతి చేసి సద్భక్తి
తనరఁ దీర్థప్రసాదము లన్వయించి
యనురక్తి దివసత్రయంబు వసించి

యాకాశగంగాదు లైనతీర్థములు
చేకొన్నభక్తితో సేవించి యంతఁ
గరమర్థి శౌరికైంకర్యంబు సలుప
నిరువదినలువుర నేకాంగిపరుల
నలవడ శ్రీమాలికాదికైంకర్య
ములు సేయ నిలిపెఁ బ్రేముడి పెచ్చుపెఱుగఁ
దమమాఱు గాఁగ సిద్ధజియతీశ్వరులఁ
గ్రమమునఁ బట్టంబుఁ గట్టి యావేళ
నిఖిలేశుఁ డైన శ్రీనిలయునివసతి
కఖిలంబునకుఁ గర్తవై యుండు మనుచుఁ
గపిరాజరూపసంకలితముద్రికలు
కృపచేసి శ్రీవేంకటేశున కెరగి
మగుడి యంతటఁ దిరుమలనంబి తాను
దగువేడ్క నమ్మహీధ్రము డిగ్గి వచ్చి
శ్రీపతిపురికి వేంచేసి యచ్చోట
నేపాఱ శేషాచలేశ్వరపూర్ణు
వాసంబునందు నివాసంబు చేసి
భాసిల్లు వేంకటపతిపూర్ణుచేత
ననురక్తి రామాయణార్థమంతయును
విని తాను మునుపు గావించినయట్టి

సలలితవేదాంతసంగ్రహముఖ్య
ములు వినుపింప నామోదించి యతఁడు
తనయుని రామసోదరమానిశిష్యు
నొనరింప నప్పు డయ్యోగిచంద్రుండు
మహితాత్మ నలతిరుమలనంబిశిష్య
సహజు విద్యోదయసంపన్ను నవఘు
గోవిందుఁ డనుదేశికుని గాంచి యతఁడు
గావించు నాచార్యకైంకర్యమునకు
నరుదంది శ్రీవేంకటాచలపూర్ణుఁ
గరమర్థి వేఁడి యాఘనుఁ దోడుకొనుచు
సేతువుదనుక వేంచేసి శ్రీవిభున
కాతతనిజనిలయము లైనయట్టి
యాదూాయితిరుపతు లచట శోభిల్లు
తోయజనాభుమూర్తులును సేవించి
మరలి రంగాధీశుమందిరంబునకు
నరుదెంచి యచట బోధాయనవృత్తిఁ
గనుఁగొని శ్రుతులవాక్యముల కైక్యముగఁ
బనుపడి యొప్పు శ్రీభాష్యంబు చేసి
యలఘుశిష్యులకు వేదాంత మంతయును
జెలఁగి వ్యాఖ్యానంబు సేయుచునుండ

నంతటఁ గులపాంసుఁ డైనట్టిచోళ
కాంతవంశజుఁడు దుష్కర్మపుంజంబు
భవపాదమతి యైన పరమపాషండుఁ
డవిరళదుష్టసాహసకృత్యపరుఁడు
వారనితనకర్మవాసనవలన
ధారుణిపై నచ్యుతద్వేషి యగుచు
హరుఁడే పరబ్రహ్మ మనియెడుభ్రాంతి
కరము దొదమ్మునఁ గడలుకొనంగఁ
దలకొని జగతి విద్వాంసులనెల్లఁ
బలువిడి భటులచేఁ బట్టి తెప్పించి
పనుపడఁగా "శివాత్పరతరంనాస్తి"
యని వ్రాలు వెట్టుండ యనుచుఁ బెట్టింప
నపుడు చతుర్గ్రామి యనువైష్ణవుండు
కపటాత్ముఁ డగుచోళకాంతునిఁ జూచి
యరయ నవైదికు లగువారు గాఁగ
నిరవొంద నిట్టివ్రా లిడిరిగా కరయఁ
దాచియావేద * పదప్రతిష్ఠాప
నాచార్యుఁ డైన రామానుజార్యుండు
నీరీతిఁ జేయునే? యిందిరావిభుఁడె
నారయఁ బరతత్త్వ మని నిల్పుఁగాక

* పథ

యన నేయిచల్లినయనలంబుకరణిఁ
గనలి చోళుండు కింకరుల రావించి
యరిగి శ్రీరంగంబునం దున్నయట్టి
హరిభక్తు రామానుజార్యుని వేగఁ
బట్టి తెండని చెప్పి పనిచిన భటులు
పట్టినకడఁకతో బలువిడి వచ్చి
గట్టిగా నేగి లక్ష్మణమునిమఠముఁ
జుట్టి పిల్చెదు మిమ్ము చోళుఁ డీవేళ
నన విని వాకిట నడరి వైష్ణవులు
చని లోనమన్న లక్ష్మణమునిఁ గాంచి
యీవార్త నంతయు నెఱిఁగింప నంతఁ
బోవుద మని మునిపుంగవుఁ డనిన
వాకూరనాథుఁ డిట్లనియె మునీంద్ర!
నీకార్య మంతయు నెఱుఁగరు మీరు
పరమపాషండియై భ్రాంతిమై వాఁడు
హరుఁడె దైవం బని యందఱిచేత
వ్రాలు వెట్టింపుచు వరుస మీచేత
వ్రాలు వెట్టింప నీవడుపున భటుల
దేవర నటకుఁ దోతెమ్మని కదలి
యీవేళఁ బుత్తెంచె నీవేలఁ దుదిని

వేదశాస్త్రంబులు విభజించి గెలుచు
వాదంబు గాదు వివాదంబు గాని
విలసిల్ల నిలలోన విత్తులకొల్వు
గలుగఁ దక్కినవెల్లఁ గలిగింపవచ్చుఁ
గావున దేవర కలిగినఁ జాలు
మావంటివారల మఱియుఁ దేవచ్చు
వాఁ డతిక్రూరుండు వానికి గురుఁడు
లేఁడు దేవుండును లేఁడు మౌనీంద్ర!
తావకవేషంబుఁ దాల్చి యే నిపుడు
వేవేగ నరిగెద వివరించిచూడ
నిట నుండఁ దగవు గాదీవేళ మీర
లెటకేని వేంచేయుఁ డితరవేషమున
నన విని రామానుజార్యుండు శిష్యుఁ
గనుఁగొని యెంతయు గారవం బెసఁగ
వాని గెల్చుటకు శ్రీవత్సాంకగురుని
చే నగు ననుచు నిశ్చితబుద్ధితోడఁ
దమకమండలమును దండకాటులును
బ్రమదంబుతోఁ గూరపతికిఁ దా మొసఁగ
నవి పూని రెండవ యతినాథుఁ డగుచు
వివరింప నాకూరవిభుఁడు వేవేగఁ

జనుదేర చోళరాజన్యునిభటులు
గనుఁగొని యితఁడె లక్ష్మణమౌని యనుచుఁ
గొనిపోయి యప్పు డాక్రూరునియెదుట
నునుప నాపాపాత్ముఁ డుగ్రతం బిలిచి
పనుపడఁగా "శివాత్పరతరంనాస్తి"
యనుచు వ్రాలిడు మని యాకు గంటంబు
చేకొని తాన యిచ్చిన జంకు లేక
వైకొని వైష్ణవకల్పభూజంబు
తగఁ "ద్రోణమస్తితతః పరం" బనుచు
బెగడ కందున వ్రాలు వెట్టెఁ బెట్టుటయు
నవి చూచి యుగ్రుఁడై యాజ్ఞయు సేయఁ
దివిరిన యాధరాధిపుఁ జూచి హితులు
ఇతఁడు రామానుజుఁడే కాఁ డటన్న
నతనిఁ దోతెండని యనిచిన భటులు
పరువడి శ్రీరంగపట్టణంబునకు
నరిగెడిసమయంబునందు ముందుగను
సరవిగా వెల్లలజాతిగృహస్థు
కరణి వేవేగ లక్ష్మణదేశికుండు
పురము వెల్వడిపోవ భోరన భూమి
వరభటవర్గంబు వడి మీఱి కదియ

నావేళ శ్రీలక్ష్మణాచార్యవర్యుఁ
డావచ్చు టెఱిఁగి సయ్యనఁ జెంతనున్న
యిసుము గైకొని వేంకటేశ్వరుమీఁద
ననమానగతిఁ దొల్లి హరిచిత్తయోగి
యొసఁగించు నొకపద్య మెన్ని లోలోనె
మసలక యట నభిమంత్రించి వైవ
నది రాజభటులకు నడ్డమై పొదలి
కదలక పర్వతాకారమై యుండె
నాకొండవలె నున్న యది చూచి భటుల
మూఁక రానోడుచు మొనచెడి యరిగి
నాదట వేగ రామానుజహాని
యాదవాచలమున కరిగె నంతటను
నడుగక కపటసన్న్యాసియై తనదు
కడకు వచ్చుట యని కడుఁ గోపగించి
తివిరి చోళుఁడు కూరతిలకు నేత్రములు
తివియుండ యని పల్కఁ ధీరుఁడై యాతఁ
డనియె విష్ణుద్రోహి వగునిన్ను నిపుడు
గనుఁగొన్న యిటువంటికన్ను లేమిటికి
నని తమగోళ్ళతో నపుడు రాఁ దిగిచి
కొనుచు నచ్చో నెలకొనియుండలేక

